ములు గలవనియు నపరిమితంబగు మహిమమ్మున కాకరమ్ములగు పంకవేదిలోనగు నోషధులు గలవనియు సాధకులకుఁదక్కఁ బ్రాకృతుల కివియేవియు గోచరింపవనియున్ జెప్పుదురు. ఇంతియకాదు. శ్రీశైలంబునందలి వృక్షంబులకు గమనంబు గలదనియు విందుము. మఱియు నయ్యెడ నొక్కదినంబు వసించినచో, గాశ్యాదులయందు నితరత్ర యుగమ్ములకొలఁదికాలంబు తపించిన పుణ్యంబు చేకూరునని వచింతురు. అయా విశేషంబులెకాక యింకను నెన్నియో విశేషంబు లందుఁగలవని చెప్పుదురు. 6

కం. ఆలోచించిన దక్షిణ
కైలాసముకాక వట్టిగ్రావమె యది? ఆ
శైలశిఖర దర్శనమే
వాలాయము ముక్తిమంటపమ్మున నిలుపుఁ. 7

కం. స్మరియించినంత మాత్రన
దురితమ్ములుతొలఁగు నెల్లదుఃఖమ్ములు సం
సరణగతమ్ము లడఁగు శ్రీ
గిరి పర్వతమనుటకన్న గిరిశుఁడనఁదగున్. 8

తే. గీ. సృష్టిలోఁగల బంగార మెల్లచోట్ల
రత్నములువొల్చునట్టి ధరాధరంబు
మఱియు హిమవంతమివియు సామ్యంబుపట్ల
శ్రీగిరికి లోఁగునని బుధుల్ చెప్పుచుంద్రు. 9

వ. మఱియు నగ్గిరివరంబుదరిని పాతాళగంగ ప్రవహించుననియు నందలి శిలలెల్ల శివలింగంబులే యనియుఁ జెప్పుదురు. చంద్రగుప్తుండను చక్రవర్తి యాగంగలో నిప్పటికిని గారుత్మత శిలారూపంబున నున్న వాఁడనియు వినంబడు మహాత్మా! అతండట్లుండుటకుంగల కత

మ్మను. నా శ్రీశైలపరమేశ్వరునకు మల్లికార్జునుండను పేరుగల్గు టకుంగల కారణమ్మును పీవలన వినవలతు మనవుడు సూతుం డిట్లు వక్కాణించె. 10

కం. కోరితిరి మంచిప్రశ్నము
భూరియశుండు చంద్రగుప్త భూనాధుడు సం
తారయుగ శంభుగూర్చి యు
దారతపం బాచరించె దారయుతుండై. 11

కం. చిరముతపించిన పదపడి
గఱకంఠుండతని మ్రోలగననై యొసగెన్
వరమును, నవ్వరమున న
న్నరవరునకు గొమిరెపుట్టె నారీమణియై. 12

వ. ఆపె రూపశీల విశేషంబులయందు చతుర్దశభువనంబుల యందెందును నీడుగానరాదనుట స్వభావోక్తి. శంభువరప్రసాద సంభూత యగు నక్కన్నియకు జంద్రవతి యను నామంబిడి యల్లారు ముద్దుగా బెంచుచుండ నా యబలకు బదివత్సరములు రాకమున్న సర్వవిద్యలయందును నపారంబగు పాండిత్యంబును దానితోపాటు మహేశ్వరారాధన తత్పరిత్వంబును బాదుకొనియె. నట్టిసమయమ్మున శత్రురాజులు ప్రబలులై చంద్రగుప్తు నధఃకరించుటయు నాతండు. 13

చ. గురుతరమైన సేనగొని కుంభిని గ్రక్కదలంగ వైరులన్
దురిమొనరించి వచ్చుటకు దోర్బలశాలి పురంబువీడి యే
త్తెఱగున నీపె రాజ్యమును ధీవరులెల్ల సెబాసనంగ భూ
వరులలరగ బొనర్చె దరువాత జయించి నృపాలకుండొగిన్. 14

వ. రాజధాని కరుదెంచి యంతిపురిం బ్రవేశించునెడ దల్లియు బరివారికలును మంగళహారతులతో నెదుర్కొని సభాజించుచుండ దల్లితో పాటుగ జంద్రవతియు గర్వాంధీరాజనంబుగొని వివాహించు సమ

యమ్మున నయిదాఱేఁడులకుమున్న యుద్ధజయార్థియై పురంబువీడి చనిన చంద్రగుప్తుం డాపె తనకొమిరె యనుస్మృతికి దూరుండై యనన్యసామాన్యములగు చంద్రవతి రూపలావణ్యవయోవిభ్రమవిశేషంబులకు మరులుగొని వికృతచేష్టలకుఁ గడంగుటయుఁ బట్టమహిషి.

మ. మనయాత్మోద్భవ కన్నె చంద్రవతి నజ్ఞ మన్నింపుమోనాథ ! నీ వనితై యేగి చిరంబుగాపుట స్మృతివ్యామోహమీపాపపుం బనికిన్నిన్ బురికొల్పె నీశ్వరుఁడు పాపంబు న్నివారించి ని న్నునునస్నుంగొమిరెఙ్ ద్రయిన్మనుచుతిన్ దుఃఖాగ్నిఁ జల్లార్పుచున్.

చ. ఎఱుఁగనిదోస మెట్టిదియు నేని తొలంగెడిఁ బాచితంపు సం స్కరణమునం; బదంపడి దొసంగెటువోపునొ యట్లొనర్చి యా శ్వయు దరికేగు నర్హతకుఁ జాలుదమక్కట ! నేఁడు లేచున ల్లరి యెటువంటిదో ! నృపవతంసున కిట్టిదొసంగు పాల్పడెన్. 17

వ. ఇట్లు నృపు నడ్డగించి యప్పట్టమహిషి తన మనమ్మున, నక్కటా ! ధర్మశాస్త్రమ్ముల మాతృగమనాదులకుఁ బ్రాయశ్చిత్తంబు లుండుటం గని యా నిష్కృతులు నిష్ప్రయోజనంబులనియు నట్టిపాపంబులొన ర్చుట తటస్థింపదనియు ననుకొనుచుంటింగాని నేఁటికిఁ దత్తత్త్వంబు బోధపడియె; యౌవనమదంబు చేయింపని దొసఁగొండుండదు. 18

తే. గీ. యౌవనంబును ధనమును నాధిపత్య
మవల నవివేక మిందొక్కటైనఁజాలు
నాలుగునుజేరుఁగద, భూమినాధులందు
వార లొనరింపకుండు పాపంబులున్నె ! 19

వ. అవి యెండియు. 20

చ. కొమిరెయటంచెఱుంగఁదనుకొందము తాళివిగట్టివట్టి భా ర్యమొగము నగ్రమందుఁ గననౌనెద వేఱొకకాంతపొందు కో.

సమెవఁడు సాహసించెడిని, జాలవిరుద్ధము వేండ్లులేరె। భూ
రమణులిటుల్ పొనర్చిరె। సురన్ జవిఁజూచినయప్పుడేనియుఁ. 21

వ. అని భర్తమొగమ్ము నేకాగ్రదృష్టితోఁ దిలకించి. 22

కం. ఇప్పటికినేని నాధుఁడు
తప్పున్ గమనించిన శైదకుఁ దట్టదు మో
మెప్పటిపలెనేయున్నది
తప్పనితోఁచునెటఁ గాంతితప్పకయున్నె. 23

వ. ఇట్లు సంశయగ్రస్తమ్మగు మనమ్ముతో మహారాజ్ఞి పెనిమిటి
నరికట్టినఁ జంద్రవతి వడవడవడంకుచుఁ దల్లిమాటునఁ జేరియుండె.
వాఁడు మదనోన్మాద సన్నిపాతజ్వర పరితః పరితాపవశంబున నొడ
లెఱుంగకుంజేసి యామెనుడువులు కర్ణపుటంబు గ్రహింపలేకుండి
యథాపూర్వంబుగఁ జంద్రవతిని బలాత్కారంబునఁబట్ట నుంకించు
టయుఁ బరివారికలెల్ల రక్కసుండను బుద్ధిఁజేసి యెచటనెడం బొలం
గిరి. రాజ్ఞిమాత్రము ధైర్యంబవలంబించి యెట్టకేలకు వానినివారించి
యాఁగె నంతఁ జంద్రవతి. 24

చ. జనక। యిదేటివిభ్రమము, స్వాంతమెఱుంగక భ్రాంతిచెందుఁగా
కనఘ వచించెఁదల్లి, యిపుడైనను గొంకవిదేమి। రక్కసుల్
గొనకొని పాపముల్ సలుపఁ గొంకరుగా కిటువంటి పాపముల్
పొనరిచినట్లువింటిమె। అపూర్వ మదృష్టము నశ్రుతంబహో. 25

తే. గీ. జాతి సాంకర్యమును ధర్మశాస్త్రమొప్ప
నట్టు లాశౌచవిధివల్ల నవగతమగు
వావివరుసలులేవి దాంపత్యమొప్ప
దీవెఱుంగవి ధర్మమ్ము లెందుఁ గలవె। 26

సీ. కూఁతులఁ గామించు కుమతులు కోదండ్ర
జెలఁబట్టనెంచు కుచ్చితపు మొద్దు
లక్కసెల్లెండ్రవ్యవాయమ్మునకు సిద్ధ
పడు చెడ్డదున్నలకొడుకులు పెద
తల్లితోడను బినతల్లితో గ్రీడింపఁ
దలఁపునించెడి పాడుఖలులు గురుని
యింతిఁ గామించెడి యెద్దెలు మేనత్త
నత్తను రమియించునట్టి కూళ

తే. గీ. లింకనుంగల దుర్మదులెట్టి ఘోర
నరకముల పాలఁబడుదురో। యెఱుఁగురాజ
పకట। తండ్రి। కూఁతురనని యరసికూడ
ననుతపింప విదేటి దౌరాత్మ్యమొక్కొ। 27

తే. గీ. ఏను మాత్రమకాక నీయింతి నాదు
తల్లి మొఱవెట్టుచుండె త్వత్తనయదీని
నేలకామించెదంచు మిక్కుఁడవును
గావు జని మొదలుగ నట్టి కలుషమేల. 28

చ స్మరుఁడు దురీహుఁడన్నునది సత్యమయైనను వావియుఁ మఱిఁ
వరుసయుఁ జూడకుండిన ప్రవర్తనలుండునె। యెందునేని కూఁ
తురని యెఱింగియున్ వలచు ద్రోహులవింటిమె। యీయకీర్తి దు
ర్భరమెటులీ ధరారమణి భామటంచనకే భరించునో। 29

చ. ఎప్పుడొ బ్రహ్మాప మబ్బుననియేకద। చెల్లెలితోడఁ దల్లితో
నెపమెటువంటిదుండిన మనీషి రహస్యగృహమ్మునందు నె
జ్జపయివి గూఁతుతోఁ దనదు సాధ్వినిదప్ప మఱొండు నాతితో
నెపుడును బండఁగూడదనియెన్ మనుపీవది విస్మరింతువే. 30

కం. అట్టి ప్రమాదంబును లే
దెట్టులు పొరఁబడితివో। సరే। జనకా। నేఁ
బట్టినవి చెప్పినను విన
విట్టి యఘముకట్టికుడుపదే। విను నన్నుగా. 31

వ. అవి వెండియు. 32

తే. గీ. సృష్టికర్త తిలోత్తమ నెనయుగాథ
వింటివేకద। యూవాలుఁగంటి నేను
నీకుఁ బలెఁ గన్నకూఁతురా? కాకయున్న
నతని విందింపరే। శంకరాదిసురలు. 33

వ. మఱియు యావత్సృష్టియు నతనిదే యగుటంజేసి వాగ్వధూటి యజు నకు వరుసకుఁ గూఁతురయ్యెడి ననుకారణమ్మునం జేసియకదా। కవులు వారివారి కబ్బమ్ముల నీ యంశమ్ముద్ఘాటించి యతని విందుగ్య విగాఁ బేర్కొనుచుందురు. బుధజననింద్యంబయ్యును బరమేష్ఠికి గత్యంతరమ్ము లేమింజేసి వాగ్వధూవల్లభత్వం బావశ్యకంబయ్యె. విదియునుంగాక. 34

కం. వావులయెడ వరుసలయెడ
నేవిషయమునందు మనుజులింకయును నా
దేవతలపోల్కిఁగొనరా
దేవిజ్ఞులెఱుంగు ధర్మమీ వెఱుఁగనిదే. 35

వ. ఇట్లు పలుతెఱంగులఁ జెప్పుచు వివారించు పరమయోగినిం దనకూఁతుఁ జంద్రవతి నాత్మోద్భవయని విస్పష్టంబుగా నెఱింగియు నాగుప్తవంశ శిరోమణి చంద్రగుప్తుండు భవితవ్యతావశంబున దుష్టాశ్వంబునుం బోవి మనంబున కవీశ్వరుండై యానంగ వికారమలీమసంబగు వెఱ నగవుతో వెంటాడుటయు నాపె యాతనికిం జిక్కక స్మరారివి స్మరించుచుఁ బరుగిడఁదొడంగె; నంతటఁ జంద్రగుప్తుండు. 36

ఉ. పాపమటంచుఁ జెప్పి మరుబారికి నన్గుఱిసేసి యేగుచుం
లోపికవాణి ! మానసికయోగముగూర్చి నఘమ్ముకన్నవి
న్నీపయినేను బైకొనిన నెక్కుడు పాతకినౌదునే ! యఘం
బాఁపిననాఁగునే ! ననుఁగృతార్థునొనర్చి భరింపుముగ్మలీ. 37

చ. నరకమటంచు నున్నయెడ నా కటఁగూఁటట యెట్లుతప్పు న
చ్చరలకుమించు నీయొదలి సౌరుకు దాస్యమొనర్చునాకు నే
నరకము భోగ్యమైనను మనంబుచలింపదు పాపమెట్లునుఁ గా
దొరకెఫలంబు శూన్యమిదితొయ్యలి ! యెట్లుభరింపఁజాలుదున్. 38

వ. ఇట్టు లాపెను వెన్నాడి యాడు నపత్రపాశూన్యంబులగు దుర్వచనంబులకుఁ బట్టమహిషియు నయ్యేడం గల తక్కిన వెలందులును "హా! హా!" యని చెవులు మూసికొని వందురుచుండిరి. అబాల్యయోగినియు సర్వధర్మసారవేదియు నగు చంద్రవతి వ్యాఘ్రంబుబారిఁ బడిన కురంగియయ్యు స్మరారి స్మరణంబుకఠినం గలిగిన జంఘాబలంబును మనోధైర్యంబును దోడుగా తెప్పపాటులోఁ సర్వపాపభంగయగు పాతాళగంగదరికింజేరి యిఁకఁ దనకు భయంబుగలుగదని తలంచి పరమేశ్వరు నాత్మలోఁ బాదుకొల్పి. 39

సీ. ఈ యెల్లలోకమ్ము లిందున్న సర్వచ
రాచరమ్ముల కీవయగుదు కర్త
వాకాశమునఁ గల యర్కాదిమండల
సమితి నీయాజ్ఞనే చక్కనిలుచు
నిలుచుటకే మఱనిమునమేనియు జాగు
సేయక యుదయించు సాయమేగు
బుతుధర్మములును దదితరధర్మంబులు
దాఁట వొక్కింతయుఁదావకాజ్ఞ

తే. గీ. ఇట్టి నీకు భక్తుండయి యెల్ల నృపుల
కేలికయు ధర్మవేత్తయు శీలవంతుఁ
డస్మదీయజనకుఁ డిట్టి యఘము సేఁత
కేల పాల్పఁడె వచియింపవే మహాత్మ ! 40

కం. పలుమంది భార్యలుండిరి
తిలోత్తమాద్యప్సరస్సదృశ లేమిటికిన్
వలచెనటఁ బూర్వజనినే
కలి నలుపుటఁజేసి యిట్టి కర్మము దొడరెన్. 41

వ. అక్కోమలి పరమేశ్వరు నిట్లు సారెసారె ప్రశ్నింపం దొడంగెనని వక్కాణించు సూతునకు శౌనకాదు లిట్లనిరి. 42

ఉ. శంకరు నాన్నృపాలతనుజాత పొరింబొరిఁ బ్రశ్నచేసిన
ట్లంకమిదెట్టు గల్గె ననఘాత్మన కాన్నృపమౌళికంచు నా
శంకయొనర్తు మేము తనుజాతపయిం బడనెంచుమానిసిన్
బంకిలచిత్తు నేకతలఁ బ్రాజ్ఞులు చెప్పిరె ? మున్ను వింటిమే ! 43

తే. గీ. ఇందులకుఁ బూర్వజనిని మున్నితఁడెదియొ
చేసియుండంగవలె నది చెప్పుమయ్య !
అట్టిదేదియు లేక యీయవని పాలుఁ
డిట్టి యఘమున కొడిగట్టు టెట్లు పొసఁగు. 44

వ. నావుడు సూతుండు సర్వధర్మమర్మజ్ఞులగు నో మునిచంద్రులారా ! పూర్వపూర్వకర్మంబు లుత్తరోత్తరమ్ములగు కర్మంబులకుఁ గారణంబులగు ననుసూత్రమ్ము సర్వసిద్ధాంతసమ్మతం బనుట శిలాక్షరంబ కాని యయ్యవి కొన్ని గోచరించినను గొన్ని గోచరింపవనిగూడ నుండుకతంబునన కదా ! చెప్పిచెప్పి తుట్టతుదకు—"కర్మణో గహనా గతిః" అని చెప్పి కర్మజ్ఞు లుపరమించుచుందురు. ఈనృపాలుండు

ధర్మజ్ఞశిరోమణియయ్యుఁ గాలకర్మవశంబున నిట్టి ఘోరపాపమ్ము నకు గుఱియయ్యె నన్నంతవఱకే నా యెఱింగినది యని వెండియు.

చ. పశువులతో రమించు నరపాంసనులెందఱులేరు మీకు నీ
విశయమదేల ? కల్గవలె ? విజ్ఞత కాముని ముందు నిల్వ దే
కృశతరకాయుసన్ మఱియు వృద్ధుని బుద్ధివిహీనుఁజేసి దు
ర్దశ కెంజేయునింక వసుధావరుఁడా విచియింప నేటికిన్. 46

వ. ఇందులకొక యనుభూతంబగు విషయం బుదాహరింతు నస్మద్గురు ప్రవరునొద్ద విద్దియ నభ్యసించునాళ్ళలో నొకప్పు డొక గ్రంధమ్ము వ్యాకరించునెడ—

శ్లో॥ బలవానింద్రియగ్రామో, విద్వాంసమపికర్షతి.

అను శ్లోకమ్ము ప్రస్తావనకుఁ దగిలె. నప్పుడు మా సతీర్థుఁడం దొక్క మునికుమారుఁడు గురువరునితో— "విద్వాంసంనాఽపకర్షతి" యని వివదింపఁ దొడంగె. నంతట మద్గురువరుండగు వ్యాసభగ వానుఁ దమ్మునికుమారున కనుభూతి పూర్వకఁబుగ నందలి సత్యము నెఱింగించి యింద్రియమ్ముల యందలి దౌర్మార్గ్యమ్ము నదయం జేయుటయు నతండు తనయజ్ఞానంబునకు వగచుచు క్షమాపణంబు వేడికొనియె. 47

తే. గీ. వరుస గమవింపనీయదు వావినరయ
నీయ దింద్రియదుర్మద మింతిచక్కఁ
దనమునకు లోఁగి పైఁబడఁ దలపుగొలుపు
దీనిని జయించువారలు తెలియఁబడరు. 48

తే. గీ. ఈశ్వరుఁడు మన్మధుని దహియించికూడఁ
బెండ్లియాడెను బార్వతీవిద్రుమోష్ఠి
నాదిమగృహస్థుఁడవల వెన్నాడె మోహి
నీస్వరూపమ్ముగనుచు మాయిసికి వశమె. 49

వ. సృష్టికి నిదానంబగు నీవిషయవ్యామోహం బపరిత్యాజ్యంబగుట యెఱింగిన మహర్షులు దీనిని బరమపవిత్రంబుగా నుండున ట్లనేక విధంబుల సంస్కరించి పరలోకవిరోధియగునంతవఱకే కాక పార లౌకికసుఖాపాదకంబగునట్లుకూడఁ గొన్ని కట్టుఁబాటులు సూచించిరి. రాజశాసనతుల్యమ్ములగు నా కట్టుఁబాటులు రాజేతరులనే శిక్షింప సమర్థంబులుగాని రాజులు నిరంకుశులగుటంజేసియు కామాంధులగు టంజేసియు వారియెడ నకించిత్కరంబులని వక్కాణింపనక్కఱ లేదుకదా? యని వెండియు. 50

తే. గీ. కొమిరె పాతాళగంగాతటమున నీకుఁ
బ్రస్తుతించుచుఁ దండ్రి దుర్గతికి నెగులు
చెంది సద్బుద్ధి గలుగంగఁజేయు మనుచు
వేడికొనునంతఁ దండ్రియు వెంటదవిలె. 51

మ. అవురా! దుర్మదమెంతఁజేసెనని యయ్యంభోజపత్త్రాక్షి యా
త్మవిచారించుచు లోఁతునీట డిగిపోఁ దత్కన్యకా చిత్తశు
ద్ధివికాసమ్మునఁజేసి గంగ మెరకై తీరంబు ముట్టించె భూ
ధవుఁ డేటంబడి యీఁదుచుం జనునెడన్ దత్కన్య భీతాత్మయై. 52

ఉ. ఏటికి నేటికడ్డపడి యీఁదఁ గడంగెదు కల్గెఁబో! యెదో
చేటు మనంబులో నెఱుకఁజేసి మరల్పఁగరాదె! నీకు నే
యాటవికంబులో మృగములకన్నట! దీటనరాదు నీరు నిన్
దాఁటగనీక రాతిగతిఁ దక్షణమంద నిమగ్నుఁజేయుతన్. 53

వ. నీవీమడుగునందు గారుత్మత శిలాస్వరూపంబునంబడి యుందువు గాక అయీజలంబు నాకారంబు నీయునికిం దెల్పునదిగా మాఱుం గాక. నీపేరుపెట్టి యాత్రామార్గస్థు లెవరుపిల్చినను నీవు ప్రతిధ్వని నొసఁగుచు నీ యగాధజలమ్మునందలి నీయునికిని స్ఫురింపఁజేయు దువుగాక యని వెండియు. 54

ఉ. ఏనృపుఁడెన్నఁడున్ సలుపఁడేయఘ మట్టియఘంబు సేయఁగాఁ
బూనిన నీదుపట్టణమువోలు సమస్తము రాతిగుట్టయై
కాననభాగమం దొకటిగాఁ గనుపట్టునుగాక రాజ్యమున్
గాననమౌనుగాక యిఁకజ్ఞానముగల్గునుగాక నీకొగిన్. 55

వ. ఇట్లు శపించునంత నయ్యోగినీ వాక్ప్రభావంబున నాచంద్రగుప్తునకు జ్ఞానోదయంబుగలిగి తన యపరాధంబెఱింగి యనుతపించుచు. 56

చ. మదమునకున్నిదానమయి మంచియుఁ జెడ్డయుఁగాన నీని దు
ర్గద సదృశంబు రాజ్యమది కన్నులుగల్గిననేమి చూడ నీ
దెదియును రోగమాఁగుటకు నెన్నియొ మందులు గల్గఁగాని యీ
గదమునకెందు మందొకటి గానఁగరాదు గదమ్మ! తల్లిరో! 57

వ. నీ వొసంగిన శాపమ్ముల యందొకటి నాకు జ్ఞానంబుగల్గుటకు నిమిత్తంబయి యాదృచ్ఛికంబుగా దొరలుటంజేసి యయ్యది యవితథ వచో విశారదవగు నిన్ను నాకు గురువుగాఁ జేసి నాకన్నుల నడ్డగించు పొరల నురులంజేసినది. ఆయీ శాపంబులు నాకు దరణోపాయంబులైనవనుటకు సందియంబులేదు. నే నెంతకాలం బీయగాధజలమ్మునంబడి యుండవలయు నాకు శాపాంతంబు ప్రసాదింపుమను తండ్రికి గూఁతు రిట్లనియె. 58

ఉ. ఈవొనరించినట్టి దొసఁగిట్టిది యట్టిదిగాదు చాలదు
ర్భావులు రావణప్రభృతి రాక్షసులుం బొనరించినట్లు లే
దీ విషమంపు బాపమున కీశ్వరుఁడే నివర్తకుండుఁ గాఁ
బోవునుగాక బేలయగు బోటికి శక్యమె! శాపమాఁపఁగన్. 59

ఉ. అట్టిది యిట్టిదంచు ననఁ దంతకమర్దనుఁ దప్పురారి చే
పట్టి యనుగ్రహించు నెటువంటి యఘాత్మకునైనగాని ప
ప్రాట్టతఁదొక్కఁడే యమరమాన్యుఁడు మొట్టిడు మమ్మహేశ్వరుం
డెట్టులొ నీయఘమ్మునకు వేదియొపారముఁజూపి ప్రోచెడిన్. 60

వ. అని యాజన్మయోగివి యగు నాచంద్రవతి తండ్రికిఁ దదభీష్టోపాయం బుపదేశించి తపంబున కరుగుటయు నా చంద్రగుప్తుండు తనపశు త్వంబు వివర్తింపంజేయుటకుఁ బశుపాశ విమోచనదక్షుండగు దక్ష ధ్వరధ్వంసింగూర్చి యిట్లు కుయ్యిడందొడంగె. 61

సీ. ఈశ్వరాయ మహామహేశ్వరాయ జగత్త్ర
యేశ్వరాయ నమో గణేశ్వరాయ
పావనాయ సురాద్రి పావనాయ మృకండు
జావనాయ నమో బుధావనాయ
నర్తకాయైనో వివర్తకాయ వికృత్త
ధూర్తకాయ నమః ప్రవర్తకాయ
కాయమానపటోలకాయ మానఫణీంద్ర
భూషణాయ నమోఽర్థి పోషణాయ

తే. గీ జీవనాయ శిరోంచిత జీవనాయ
సాధకాయ సురక్షిత సాధకాయ
అంబరకచాయ సాక్షాద్దిగంబరాయ
సర్వధా తేనమోఽస్తు విశ్వంభరాయ. 62

వ. అని యనేకప్రకారంబులఁ జంద్రగుప్తుండు పరమేశ్వరున్ గుఱిచి తపించుచు నమితపించుటకు నరిష్టవారకుండగు పరమశివుం డనుగ్ర హించి యంబరవాణీ ముఖంబున నిట్లు శాపాంతంబు వెలువరించె. 63

ఉ. ఈవు వివేకివయ్యు మఱి యేయవివేకియుఁ జేయఁబోవి యీ
యేవమొనర్చ సిద్ధపదితిందుకు విష్కృతి దీర్ఘకాల మీ
గ్రావపురూపుతో విట నగాధజలమ్ముననుండుమీఁద నీ
కావటిలున్ జనార్దనువి యంఘ్రితలంబు స్పృశించు హేతువై. 64

వ. దీర్ఘకాలమ్మునకు ధర్మాధర్మములు యుక్తాయుక్తమ్ములును దాటిం పవి కలియుగం బరుదెంచు. నయ్యది జరుగుకొలందివి బొత్తిగా

జనులకు విలువనీడయుఁ దిన నాహారమ్మును లేవి దుస్థ్సితి సంభవించు నప్పుడు శ్రీమన్నారాయణుండు కల్కినాఁ జను నవతారం బెత్తి కరవాలమాత్రసహాయుఁడై యెయ్యెడం గాని కుంటువడని దివ్యాశ్వంబు నధిష్ఠించి. 65

మ. భగవత్సత్తనెఱుంగనట్టి నృపులం బాపాత్ములఁ జాలదు
ర్ధగులన్ గుక్షి భరప్రవీణులఁ బ్రజన్ భక్షించు వ్యాఘ్రమ్ములన్
దెగునట్టుల్ పొనరింపఁగా దిరిగెడిన్ దేశంబులెల్ల న్నిలిం
పగురుండియ్యెడ కేగుదేఁ గలుగుఁ దృత్పాపనోదంబొగిన్. 66

వ. అమ్మహనీయుం డనేకుల దుర్ధీకుల వధించి పరమపావనం బగు నీపాతాళగంగాజలంబునఁ దానమాడి నన్ను సందర్శించి యేగెడి. 67

తే. గీ. అట్టి సమయమ్మునందు నీయందు నతని
పరమపావనమంఘ్రి సంస్పర్శమొదవు
దానితో నీవొనర్చిన యేన మెల్ల
నురుఁగు నందాఁక నిందుండు మెఱుఁగు మింత. 68

వ. ఇట్లు నొడివి యంబరవాణి విరమించెఁ జంద్రగుప్తుండు చంద్రవతి యిచ్చిన శాపంబు చొప్పునఁ బచ్చరాతిబండయై యప్పాతాళగంగా హ్రదంబునం బడియుండెఁ బిమ్మటఁ జంద్రవతియు. 69

కం. తనయందము చేసినదొసఁ
గునఁ దండ్రికకీర్తి యఘము ఘోరనరకముఁ
గొనసైనకతనఁ దనజ
వ్వనమందు మఱింత యేవపడి యోగినియై. 70

తే. గీ. ఫలజలాహారములు తప్ప ప్రాశనంబు
లితరములు మాని మౌనిజనేడ్యమైన
శైవదీక్షను గొని సదా సరసిజాక్షి
శివుగుఱించి తపించి యజించు భక్తి. 71

కం. శివుఁ బెండ్లాడు తలఁపుతో
నవసి యుమ తపించె నీపె ననవిల్తునికిన్
భవుఁ డొకటలోఁగి పెండ్లా
డవలచినఁ బాణితా నిడదు చేకొనఁగన్. 72

తే. గీ. ఎప్పుడు తండ్రి దుశ్చేష్టితమీపె చూచె
నపుడె యాపెకు సంసారమనిన విరతి
వొడమి పరమేశ్వరునియం దపూర్వమైన
భక్తి యుదయించి శుద్ధవిరక్తయయ్యె. 73

కం. పురుషులకన్నను నెక్కుడు
విరక్తి యంగనలయందె విజ్ఞులుగన నే
ర్తురు పరిశీలింపక యం
దురు గటితలు శీలమెడలఁదురని మనీషుల్. 74

తే. గీ. కలుగుచే కష్టమొక్కెడఁ గలిగెనేని
యంగనలకు విరక్తి తానబ్బియుండుఁ
బూరుషుల కట్లుగాదది పొలియుఁ దలచు
నెఱుక గల గఱువలకిది యెఱుకవడెడి. 75

చ. వనమున మంచిమంచి ప్రసవంబుల నన్వహమాపె కోసితె
చ్చి నిగమవేద్యునయ్యభవు శ్రీగళునిత్యునిరంజనున్ జనా
ర్దనసఖు లింగరూపిని విరక్తుల కాదివిరక్తునిన్ సభా
జనముదితున్ బొనర్చు నలసారసలోచనఫాలలోచనున్. 76

సీ. అరుణోదయముగాక యంతకుమున్నె యా
పాతాళగంగలోపల మునుంగు
మునుఁగుచే తడవుగా మున్ను నిర్దేశించు
కొన్న క్రొన్ననలునుగోయుఁ బూలు

కోయుచే తడవుగాఁ గొండపైనెలకొన్న
శ్రీశైలనాథు నర్చింప నేగు
నేగి స్వయంభువై యెసఁగు లింగమ్ము న
ర్చించుఁ దదేకాగ్ర చిత్తవృత్తి

తే. గీ షోడశోపచారమ్ముల శూలినెలిమి
బాలికామణి పూజించి పాడుఁగొంత
సేపు శివలీలలను గైత సెప్పునభవుఁ
గూర్చి ప్రతిదిన మా సుమకోమలాంగి. 77

కం. శ్రీశైల నాథుఁడనఁగాఁ
గాశీవిశ్వేశ్వరుఁడును గాఁ డీక్షేత్రం
బే శైవక్షేత్రములఁ బ్ర
కాశించున్ సాధకులకుఁ గల్పనగంబై. 78

కం. ఇతరత్రసల్పితపమున
శతాంశమిట సలిపెనేవి చాలునదియె తా
శతగుణితంబై సాధకుఁ
డితీర్షుఁగృతకృత్యుఁజేసి దేవునిజూపుఁ. 79

వ. ఆక్షేత్రమహిమం బట్టిదగుటంజేసి యచిరంబునన పరమేశ్వరుండు ప్రత్యక్షంబై యాదర మేదురంబులగు పలుకుల నలరించుచు నిట్లు ప్రశ్నించె. 80

ఉ. ఏమిమనంబునం దలఁచి యిట్లుతపంబొనరించుచుంటి నీ
నోమబలా! కడుంగడు మనోగతి సంతసమున్ ఘటింప ని
న్నోమెదిపూన్కిమై నిటకు నోతరళాక్షి గనంగవచ్చితి
న్నేమములిట్టులెందుఁగననేరఁ దలోదరులందు నుగ్మలీ. 81

వ. ఇట్లు సుప్రసన్నుండై ప్రశ్నించు పంచసాయక విజేతకుఁ ద్రిజగన్నే తకు నా తలోదరి కరకంజమ్ములు మొగిడ్చి. 82

కం. కోరిక యేమాత్రమునా
కో రజతాచల నివాస! యుండి తపంబే
నారంభించను విను నే
నూరక తపియించు చుంటి నురగాభరణా. 83

మ. భవ! సంసారమహాబ్ధికిం గలుగదే పారంబు. కోర్కుల్ సదా
నవయంజేయునుగాని తృప్తిగను విన్నాణంబు సూచింప నెం
త విభుత్వంబు ఘటించు నంతటి యఘధ్వాంతమ్మునం గూల్చునో
శివ! నీనామము సంస్మరించుటె జనిశ్రేయంబుగల్గించెడిన్. 84

తే. గీ. తండ్రియేమయ్యె నంతటంతటి విశాల
సార్వభౌమత్వమబ్బి పాషాణమయ్యెఁ
దొలుతఁ బాషాణముగఁబుట్ట దొసఁగులెవియు
నబ్బకుండెడిఁగదా జగదాదిదేవ. 85

కం. కొందఱి నటు కొందఱి నిటు
గందరగోళమునడించి కామాద్యరులన్
గందించి పనికిమాలిన
పందలుగాఁజేతు వేమిపాపంబభవా! 86

కం. కననీకిది క్రీడగఁదోఁ
చునుగా "కోతువునకాటచొప్పున నున్నన్
మనమెరియదె! యెల్కకు" నో
యనలాక్ష! యిదేటిక్రీడ! యని నిన్నందున్. 87

కం. ధనధాన్యస్యందనకాం
చనతురగద్విరద కలిత సంపదలిడి భ
క్తునిమత్తుఁ జేసెదవు ము
క్తుని జేయవు టక్కుఁజేయుదువు తుదకభవా! 88

ఆ. వె. తోలుబొమ్మలాటతో నిన్నువంటి దే
వాదిదేవునకు నహర్నిశంబు
కాలయాపనంబు గడతేఱునేని య
న్యులనుగూర్చి చెప్పనొండుగలదె. 89

ఉ. యోగినిగాఁగ నుండి సత మోగిరిరాడ్తనుజా హృదీశ ! ని
న్నాగమవేద్య నీ కుధరమందలి లింగమునందు సిద్ధులౌ
యోగులు మెచ్చులాగున సుయోగముగల్గెడు నంతదాఁక దు
ర్యోగహరున్ యజింతు నిది యొందొకవిఘ్నములేక సాఁగుతన్. 90

ఆ. వె. ఇంతకన్న జన్మమెత్తిన ఫలము వే
ఱొండు గల్గినట్టు లో మహేశ!
నాకుఁదోఁచదేల నగలు నాబొమ్మలు
బరువుచేటుగాదె ! పాలనయన. 91

మ. నినుఁ బూజింతురు, నీవొసంగిన ధనానీకంబు భూషాదులున్
గొని యానందముగాంతు. రంతియె గనుంగోఁబోరు నీతత్త్వ మే
కనకంపున్నగ లేమణుల్ గలవు నీ కాయమ్మునందేల నీ
వనుమోదింప నెఱుంగవల్వదె ! రహస్యం బద్రిభూవల్లభా. 92

కం. పరిశీలించినకాలఁదిన్
విరక్తికిన్ మించుపదవి వేఱొక్కఁడు నా
కరయంగరాదు సతముగఁ
గరుణింపుము దాని నాకు గరళాభరణా ! 93

వ. మఱియు నింక నొక్కండనుగ్రహింపుము. 94

సీ. కరవీరపుష్పముల్ గరమర్థినీకు న
ర్పించి పూజించితి వృషభవాహ !
పారిజాతమ్ములు బహుభక్తిమైఁ దెచ్చి
నిను సభాజించితి నిటలనయన !

శతపత్రములువాల సంగ్రహించి వినుఁగా స
పర్య గావించితిఁ బార్వతీశ।
బిల్వదళమ్ములు వేనవేల్ సమకూర్చి
నిను యజించితి భవానీసనాథ।
తే. గీ. మఱియు నెన్నేవియును గుసుమములు దెచ్చి
యర్చితునొనర్చితిని నేఁటి కభవ। మల్లి
కాసుమమ్ములఁ బూజిఁపఁగానుపించె
నీదునిజమైనరూప మనాదిదేవ। 95

వ. ఇందులకు నభిజ్ఞానంబుగా నాయందలి యనుగ్రహమ్ము వెలువరించుచు నీనామంబు మల్లికార్జునుండుగా మార్పుచెందుటకు వరంబు కరుణింపవలయు ననవుడు నట్లయగుంగాకయని యనుమోదించి యద్దేవుండంతర్హితుండయ్యె. నియ్యది శ్రీశైలమహిమంబు ఈపుణ్యశైలంబునకును నిందలి మహేశ్వరునకును విందలి భక్తులకును సంబంధించిన గాధలెన్నియో పాపనాశకంబులును బుణ్యప్రదంబులునుం గల వని వెండియు. 96

కం. కరవీరుండను భక్తుఁడు
కర ముగ్రతపంబొనర్పఁ గరుణాళుఁడు శం
కరుఁడు ప్రసన్నుండై యే
వరముంగావలయు నన్న వాఁడు వినతుఁడై. 97

తే. గీ. దేవ। నాతపమునకు సంతృప్తి నీకుఁ
గలిగెనేనియు నన్ను వృక్షముగఁజేసి
దానిపుష్పమ్ములను దైవతములునీవుఁ
బూజగొనుచుంటయే వరంబుగనొసంగు. 98

తే. గీ. చేతులారంగనిన్నుఁ బూజించువాఁడె
ధన్యుఁడట్టిపూజకుఁ గడుమాన్యమైన

పుష్పములను దళంబులుఁ బుణ్యమునకు
నాలవాలమ్ములవి చెప్పనేల ! గిరిశ ! 99

ఉ. గంగ పవిత్రమయ్యె నెసకమ్మున విన్నభిషిక్తుఁ జేసి యో
యంగజవైరి ! పూజ్యతకు నాకరమయ్యె హిమాలయంబు నీ
కుంగొమిరెఁ జగజ్జననిఁ గోర్కెలెసంగ నొసంగి ; విన్ము నా
రంగ సపర్యసల్పుట జరామరణాదులడంచునో శివా. 100

వ. కావున నాకు నిట్టివరంబు ప్రసాదింపుమని వేడు కరవీరునకు నట్ల
యగుంగాకయని పురారి యదృశ్యుండయ్యె నియ్యది శ్రీశైలమహి
మంబు దీనిశ్రవణ మననాదులిహపర శ్రేయోదాయకంబులు మఱి
యింక దేవిని వినఁదలంతు రనవుడు శౌనకాదులు నీవేది వచించి
నను మాకది యమృతప్రాయం బనవుడు సూతుండు నీ శ్రీశైల
మహిమకు సంబంధించిన ముగ్ధబాలానుగ్రహంబను ప్రాకృతేతి
హాసమ్ము వచింతు వినుండని శౌనకాదుల కిట్లనియె. 101

## ముగ్ధబాలానుగ్రహ మహిమ.

తే. గీ. కలదు శ్రీశైలమనియెడి మలకు నాతి
దూరమున బాడబుల యగ్రహార మొకఁడు
వేదవేదాంగ ముఖ్యమౌ విద్దియలకు
నది నివాసంబు రిక్తులందలరు ద్విజులు. 1

కం. శివపూజం బొనరింపక
యెవఁడుఁ ద్విజుఁడందు నీరమేనియు ముట్టం
డవనీపతి యిడినను గొనఁ
డవమతికరమైనదాన మఘకరమగుటన్. 2

వ. అందొక్క గేస్తునింటికి నల్లుండేగుదెంచిన కారణంబునఁ బిండి
వంటవండికొనిరి. ఆ యింటికుఱ్ఱండా భక్ష్యంబుగొని తినుచుఁ దోడి

బాలుర నూరించుచుండె. నయ్యది చూచినబాలురలోఁ ద్రిహాయన
వయస్కుండొకండు తనతల్లి కడకరిగి యిట్లను. 3

కం. అప్పచ్చి తినెడి మన యల
తిప్పవధానుల మనుమఁడు దేవికతన వాం
ఛ్రప్పములు వండికొనిరో
చెప్పుము వండికొన మేమిచెప్పుము మనముజ. 4

వ. నావుడుఁ దల్లి నాయనా! యల్ల తిప్పవధానులుగారి కుఱ్ఱనిబావ
వచ్చుటంజేసి వాండ్రప్పచ్చులు వండికొనిరనుటయు, నక్కుఱ్ఱండల
భక్ష్యమ్ములనందలి వాంఛన్ జేసి "మనబావ మనయింటి కెప్పుడును
రాఁడేమి?" యని యడుగ మొదలువెట్టుచు నిట్లనియె. 5

ఉ. బావయనంగ నెవ్వరగు? బావలు సర్వులకుందురో? ధరా
దేవులలోన నెవ్వరి కెదేని నిమిత్తముచేసి యుందురో?
బావయొకండు తా మనకు భాగ్యముపండి లభించెనేని నా
కేవియొ అప్పచుల్ దొరకు నెట్లొకొ? బావ యిటేలరాఁడహో. 6

కం. ఉన్నాఁడా బావమనకుఁ
దిన్నఁగనేనేగి వానిఁదీసుకవత్తున్
మన్నించి యప్పచులు మన
మున్నెటిఁ దినవచ్చుఁ జెప్పుము వెసన్నాకున్. 7

వ. ఇట్లు సారెసారెకు నప్పచులయందలి భ్రాంతింజేసి వేధించుకఱ్ఱని
వోరడంచుటకు వండిపెట్టుటకుం దగిన సామగ్రిలేమింజేసి తల్లి తన
కూఁతునికింకను వివాహము లేమింజేసి బావ మనకింకను నేర్పడ
లేదని చెప్పుచోఁ గుఱ్ఱని ప్రశ్నంబులంతతో శాంతాకాంక్షంబులు
గావని వానిప్రకృతింబట్టి యెఱింగినయది కావున మఱపింపఁదలంచి
వాని కిట్లనియె. 8

సీ. అప్పమగని బావయందురు నీయప్ప
కింకను మగఁడు తానేరుపడఁడు
చిన్నప్పకన్నను శ్రీశైలభ్రమరాంబ
పెద్దది, తద్భర్తపేరుఁ బెంపు
గలవాఁ డతనికున్న కలిమి యొద్దకులేద
అతఁడష్టైశ్వర్యజాతకుండు
మనపేదఱిక మెఱింగిన కారణమ్మున
మనయింటి కెన్నఁడాఁ ఘనుఁడు రాఁడు

తే. గీ. నాఁగ నాకట్టు విని నేనయేగి బావఁ
బిల్చుకొని వత్తునంచును బిండివంట
మీఁది విశ్రాంతిచే నాఁడు మేల్మిపలుకు
లంబ విని వానితో నిట్టులనియెఁ బేర్మి. 9

తే. గీ. అప్ప వచ్చినచో బావయపుడె వచ్చు
నప్పకేలేదు దయ మనయందుఁ దండ్రి
ఆపె యైశ్వర్యవంతురాలయ్యె మనము
రిక్తులము వచ్చునే? మనగృహముఁ జూడ. 10

తే. గీ. ఎప్పుడో మనమే పేర్మి నేగిచూడ
వలయు ననుటయు నప్పు డప్పచ్చి తనకు
దొరక దనియెంచి బాలుండు తోడితెత్తు
నప్పతోఁగూడ బావ నటంచుఁ బలికె. 11

కం. అప్పసిపాపని కర్మిలి
యప్పచ్చులయందుఁ గలుగు టంబ యెఱిఁగి తా
విప్పచ్చరమున కేవము
చొప్పడ మదిబొక్కు సుతువిజూచి యలఁదురుఁ. 12

వ. ఇట్లు కతిపయదినమ్ము లరుగుటయు నంత శివరాత్రి మహాపుణ్యకాలం బరుదెంచె. 13

మ. గుడులుం గోపురముల్ సుధారసమునం గొంగ్రొత్తలై మించ న
ట్లడరంజేయుచు భక్తిచిత్రముల సొం పాకొందకుఁ మేటి సొం
పిడ భక్తాగ్రణులైన మానవులు తత్పృథ్వీధర ప్రాంతమం
దుడురాట్ఛేఖరు మెప్పుగోరి సతతోద్యుక్తిన్ ఘటింపింపఁగఁ. 14

కం. కన్నులపండువుగా నా
పన్నగభూషణుని నగము ప్రాంతమునందున్
జెన్నలరు ప్రదేశంబులు
విన్నాణపుఁశోభఁ జాలవిందై యలరెన్. 15

ఉ. ఏగిరిశేఖరంబు శిరమించుక కన్నులఁ జూచుమాత్రలో
నాగము లెన్నియో సలిపినట్టిరుగూడఁ బునస్తనంధయ
త్వాగతి దప్పుగా నడరునట్టి విముక్తికిఁ బాత్రులౌదు ర
య్యాగమవేద్యు స్వీయ నిలయంబును శ్రీగిరిఁ జూచువేడుకఁ. 16

సీ. ఎద్దులపైనెక్కి యీశ్వరు నపరావ
తారంబు లనఁ గిరిఁ జేరువారు
నందికేశ్వరుమించు ననఁజాలు నెడ్లబం
డులపైఁ బ్రయాణంబు సలుపువారు
చెంచుల చిక్కాలఁజిక్కి పక్కలునాఁగ
నరవాహనములతో నరుగువారు
ముల్లె మూఁటలు తామె మోసికొంచును లేమి
పీకునకున్ జూపనేగువారు

తే. గీ. హర। హరా। పాహిమాం హర। హర। యటంచు
శివ। శివా। యంచు శ్రీశైల శిఖరవాస।
యంచు భ్రమరాంబికా మనోహర। యటంచు
స్మరణ పేయుచు యాత్రికుల్ పాఁగిరిట్లు. 17

వ. ఇట్లనేక ప్రకారంబుల యాత్రికు లష్టకష్టములలోనెల్ల మిన్న యనం దగు నయ్యష్టమూర్తిని దర్శించు శ్రీశైల యాత్రం బొనర్చు కోట్ల కొలఁది యాత్రికులం జూచి భ్రమరాంబ మహేశ్వరుం గాంచి యిట్లనియె. 18

కం. స్వామీ! మీమహిమం బతి
భూమము నేనెఱుఁగుదు నిటు భూమియె యీనం
గా మెఱసినట్టు వచ్చిరి
మీమలకున్ ముక్తిపడని మేకొను నిచ్చల. 19

కం. ప్రతియేఁ డిట్టులె వత్తురు
పతితులుఁ బావనులు నెల్లవారును దత్స
ద్గతి కైలాసము వీరికి
సత మనుటకు లేశమేని సందియమున్నే? 20

ఆ. వె. అట్టులేని వీర లాప్రదేశమ్మున
నెట్టు లిముడువార లేది దిక్కు
నాకుదోఁపకిప్డు మీకెఱింగించితిఁ
దెలియఁజెప్పి శంక దీర్పుమీశ! 21

వ. నావుడుఁ బరమేశ్వరుండు మందహాసముతో దేవీ! నీసందియమ్ము దీరు నుపాయం బొండు గలదట్లొనర్పు మది యెట్లంటివేని. 22

ఉ. ఏనొక వృద్ధవిప్రునిగ నిప్పుడొ! యింకనొ యన్నయట్లుగా
గూను కునుష్టుమానిసిగఁ గొండొకచో నొకచెట్టునీడ నెం
తేనియు దైన్య ముప్పతిల నిప్పుడెపోయి పరుండుఁ ద్రోవ మ
న్మానినివేష మీవుగొని నన్నుగుఱించి వచింపుమీగతిన్. 23

చ. ఇతఁడు మదీయభర్త కడు వృద్ధుఁడుదప్పిని గొన్నవాఁడు నీ
రుతగినవార లేరయిన రూఢిగఁ గొంచెము గొంతునందుఁ బో

సి తడియునట్లొనర్చునెడ శ్రీభ్రమ తెప్పిరి సేదదేఱి జీ
వితము ధరించు నంచనుము వెళ్ళెడియాత్రికులెల్ల వారితో. 24

వ. అట్లు నీవు తెల్పినపిమ్మటఁ బలుమంది స్త్రీలును బురుషులును నిది యెంతపని యని తమయొద్దనుండు జలకలశంబులతో సిద్ధమగుదురు. అప్పుడు మరల నీవు వారించి వారికిట్లనుము. 25

కం. ఎన్నఁడుఁ బాపము సేయని
పున్నెముగల జీవియేని పోసినజల మా
సన్నమరణుఁడగు మత్పతి
గ్రన్నన బ్రదికెడి నొకంటఁ గాలునిజేరుఁ. 26

వ. అని విష్కర్షగాఁ బల్కునదియని పరమేశ్వరుండు పరమేశ్వరికిఁ జెప్పుటయుఁ నాపెయు వల్లెయనియె ననంతర మ్మిరువురును యాత్రి కులరుదెంచు మార్గమ్మునకుఁ గొంచె మెడఁదొలంగి యొక తరుచ్ఛాయను బూర్వోక్తరీతి నధిష్ఠించుటయు. 27

ఉ. ఏమిది ! యింతవృద్ధుఁగొని యేరును తోడను దోడులేక నీ
వీమెయి యాత్రకంచు విటకేటికి వచ్చితివమ్మ ! నీకు ది
క్కై మిటనయ్యయో ! కుధరమీయనతో నెటులెక్కెదీవు పూ
ర్ణామయుఁదంచుఁదోఁచెడిఁగటా ! కదలించుట యెట్టులీయనఁ. 28

వ. ఇట్టులనుచు నెవరిత్రోవను వారు శ్రీశైల మల్లికార్జునదేవు సందర్శించు సంభ్రమంబుతోఁ బోవుచుండిరి. మహేశ్వరియు. 29

తే. గీ. అమ్మలార ! నాథ్రకు నన్ని మంచి
నీళ్ల మీవద్దనున్నచో నేఁడు మీకు
నెంతయో పుణ్యమబ్బెడి నీయరమ్మ
గొంతులోఁ బోయరమ్మ ! తగ్గు నెగరొప్పు. 30

కం. ఇది మార్గాయాసమ్మున
నొదవిన యాయాస ముదకమింత ఘుడినఁ ద

గ్గ దయావతులార ! యెటున్
గదలంగాలేమి నిచటఁ గస్తి జవించెన్. 31

కం. మీతోపాటుగ నేమును
నేతెంచితి మల్లదేవు నీక్షింపఁగ మ
చ్చేతోహరుఁ డిటులౌటఁ
శీతాంశుకిరీటు గిరికిఁజేరుట యెట్లుల్. 32

తే. గీ. నీరుకొంచె మెవ్వరేవియిడిరేవి
అంతలోఁగొంత యోపికయావహిల్లు
మెల్లఁగాఁ గొండదరికేగి మెట్లనెక్కి
శ్రీగిరీశుని జూతుము చేతమలర. 33

వ. ఇట్లు శ్రీశైలమ్మరుగు యాత్రికుల యంగనలు వినంగ నంగలార్చు నా భ్రమరాంబను మాయాకుటుంబినిగా నెఱుంగమిఁ బఱపుఱ గృహిణీ లలామలు తోడి గేస్తురాలుపడు కస్తికి జాలిపడుచు నమ్మా! యిదెంత భాగ్యమని నీటికలశంబు కేలఁగొని యాకపటనాటక సూత్రధారిగొంతుకలో నీరమ్మువోయ నేగుచుండుటయు నమ్మహామాయ చట్టన వారించి. 34

చ. మఱియొకలాగు చూడకుసుమా ! కలమర్మము దెల్పుదాన నీ
కరుణకు సంతసమ్ము నినుఁగాళగజుండు సముద్ధరించు నె
త్తఱి నఘమంచు నీవెఱుఁగుదానవు కానియెడఁ జలంబు ని
త్తఱినిడు మట్లు కానియెడ దక్కుదుప్రాణమెఱింగి చెప్పితిన్. 35

ఆ. వె. "పుణ్యమునకు నీవుపోఁగఁ బాపంబెదు
రౌ" నటంచుఁ గల యథార్థమిట్లు
తెలుపవలసె నిన్ను దేవుండు రక్షించు
మంచిదానవీవు మగువమిన్న.

తే. గీ. ఎందఱో వినిపించుకో కేగుచుండఁ
గరుణగలదానవౌట నాక స్త్రిలోనఁ
బాలుపంచికొనిన నీదుశీలమెంత
యని నుతింతు దేవుండు విన్నరసిప్రోచు. 37

చ. ఎపు డిటులాడునో జనని యీశునిరాణి జలమ్ము వోయ సి
ద్ధపడినకాంతలెల్లరు నెదఁజనియించిన కొంకుకల్మి ది
ల్లపడి యిదేటి చిక్కని కలంగిననెమ్మది వెన్కకీడ్వ శై
లపతిఁగనంగఁబోయిరి కలావతియోరుతు వృద్ధయయ్యెడన్. 38

వ. శ్రీశైలయాత్రార్థం బరుగుచు నీదృశ్యంబు దిలకించి తనలో. 39

కం. పొనరించితిఁ బాపంబులు
జననం బెత్తినది మొదలు జవ్వన ముదయిం
చినపైఁ జెప్పఁ బనేమవి
చన కింకన్నిలిచెనే! వెసంజనె నెటకో. 40

కం. శ్రీశైలేశున్ గనఁగా
లేశముఁబనిలేదు కడు మలీమసుఁడగుఁగా
కాశైలశిఖరముఁ గను
చో శివ! శివయంచు నఘముసురుఁగు నఖిలమున్. 41

తే. గీ. అనుచు క్షేత్రమాహాత్మ్యమునందుఁ గలదు
కంటి నఱగంటకునుమున్ను కాలగలివి
కొండశిఖరంబు నిపుడుగన్గొనుచు నుంటి
వింక నాకెక్కడిదిపాప మెటకొపోయె. 42

తే. గీ. అనఘురాలను బుణ్యాత్మురాలననుచు
ధైర్యమున నీరువోయు న త్తరుణమందు
శివుఁడు ప్రత్యక్షమయ్యె నాశివునిరాణి
గూడ స్వస్వరూపమ్ముతో నాడ విలిచె. 43

కం. శివుఁడిటువచించె వబలా
యెవరికి నిటువంటి నమ్మి కెద గుదురునొ వా
రపుదురు మత్పదమున యం
దు వసింపగఁ నర్హులెఱుఁగుదువుగా కింకన్. 44

ఆ. వె. వారలేగుచున్నవారని కొందఱు
వీరలేగుచున్న వారటంచుఁ
గొందఱిటకువత్తు రందఱుధన్యులే
కాని యిట్టివ్యక్తిఁ గాంచుటరిది. 45

వ. ఇట్లు వచించి మహేశ్వరితో శివుం డంతర్థినందె. నావేశ్యను యాత్రికులెల్లరును ధన్యురాలవని యభినందించిరి. ఇట్లెల్లరును శ్రీశైల యాత్రకు నరుగుసమయమ్మున మున్నొడివిన యగ్రహారమ్మునం దలివారును గొందఱరుగుచుండిరి. ఆవిప్రస్తనంధయుండు తన యప్పయు బావయు శ్రీశైలమ్మునందున్న వారని జనని మున్ను తనకు వచించి యుంటంజేసియు వారు తమయింటికి వచ్చినప్పుడు గాని తనకు నప్పచ్చి తిను భాగ్యంబలవడదని యెఱుంగుటంజేసియుఁ దానుగూడఁ దదానయనార్థంబు శ్రీశైలమ్మునకుఁ బ్రయాణంబొనరించు సన్నాహమ్ముతో నుండి తోడిబాలురతో నిట్లు ప్రసంగింపం దొడంగె. 46

కం. మాయప్పయు మాబావయు
నీయూరికి నేగుదెంతు రేనేగి యెటో
మాయప్పను రమ్మనియెద
నాయమతోవచ్చితీరు నాయయవారున్. 47

తే. గీ. అప్పు దప్పాలవండు మాయమ్మ మీకుఁ
బెట్ట కేనొక్కడనె తిందుఁ బెట్టుమంచు

నేనడుగ మీరు పెట్టరు నేనుమాత్ర
మేలపెట్టెదనని బాలుఁడోలిఁ బలుకు. 48

వ ఇట్లు తోడి బాలురతోఁ బలుకుచుఁ బ్రయాణంబగు చిన్నికొమరు ముగ్ధత్వమ్ము నెట్లును వారింప వశమ్ముగామి నబ్బాలునితల్లి తమ యూరివారలు గొందఱు శ్రీశైలయాత్రకు నరుగుచుండ నవ్వారితో వీని యమాయకత్వంబు సర్వమ్మును వక్కాణించి మా కుఱ్ఱని మీవెంటఁ దీసికొని చని శ్రీభ్రమరాంబామల్లికేశ్వరులఁ జూపించి, వీరె మీయప్పయు బావయు నని చెప్పి పో రుడుపుండనిచెప్పి పంచు టయు వారట్ల కాకయని తోడ్కొని చనిరి యనంతరమ్ము. 49

తే. గీ. అప్ప సర్వాంగభూషితురాలుగాఁగఁ
గానఁబడె భ్రమరాంబిక కనులకఱపు
దీర గుండ్రాయిగా బావ గోచరించెఁ
గుఱ్ఱనికి లేశమును దృష్టి గుదురదయ్యె. 50

కం. కుదురక యప్పకు నగలే
మి । దరిద్రత బావకిట్లు మేకొనుకత మే
మిది యక్కజంబుగా నా
యెదకున్ గనుపట్టుననుడు నిట్లని రవలన్. 51

తే. గీ. ఇతఁడు మీబావ భక్తులకిచ్చు టొకఁడె
యెఱుఁగుఁగాని కట్టికుడుచ నెఱుఁగఁడప్ప
యొరులకు నొసంగుఁ దాఁదిను నున్నసకల
మెఱుఁగు మనుటయుఁ గుఱ్ఱని యెదకు నచ్చె. 52

వ. అచ్చటనున్న నాలుగైదు దినమ్ములను భ్రమరాంబికాసాన్నిధ్యము నందును మల్లేశ్వర వికటమ్మునందును వసించుచు వారలను దమ యింటికి రమ్మని ప్రార్థించుటతప్ప వితరం బెఱుంగక తన్మయుండై కాలక్షేపం బొనర్చుచుండె. 53

తే. గీ. అప్పరో! భాగ్యవంతురాలగుదు గాక
పేదలమటంచు మమ్ము ననాదరించె
నీకుఁ దగకున్న బావకేనియును దగమె!
యంచు నెకసక్కెముల నాడు నప్పతోడ. 54

కం. బావా! నీవెంతో మహా
భావుఁడవఁట! అగుదుగాక బట్టయులే కి
ట్లే వేఁదుఱువలె నొకగుం
డ్రావిధమున నుండు పేటి రాజసమొక్కో! 55

తే. గీ. ఎందఱో వచ్చినారు నీయందు నున్న
భక్తి కలిమిని నీవిట్లు బండరాయి
చందముననున్న వారలు డెందమందు
నేమి యనుకొందురో! సుంత యెఱుగవలదె! 56

ఆ. వె. ఇట్లు బావతోడ నెలమిమై నప్పతోఁ
దలుచు బాలకుండు దత్పరత్వ
మలరు బుద్ధితోడ నల్లారుముద్దుగాఁ
బలుకుచుండు వారు పలుకకున్న. 57

తే. గీ. ఉత్సవపురోజు లేగుడు నూరిమొగము
వట్టి చనసాఁగిరెల్లరు బాలునెవరు
తీసికొనివచ్చిరో! బయల్దేఱి వారు
పిలువ రానన మొదలిడెఁ బిల్లఁడపుడు. 58

కం. బావయు నప్పయు నాతో
రావలె రాకున్న నేను రా. నిటనే నా
జీవితము గడపుదునటం
చా వెఱిబాలుండు పలుకు నక్కజమొదవున్ 59

కం. తిరునాళ్ళప్పుడు దక్కన
నరులిట నెవరుండ రటవి నానాజంతుల్
గిరినెల్లెడఁ దిరుగాడున్
గరము భయంకరమెఱింగి కదలుదమింకన్ 60

తే. గీ. మరల శివరాత్రిదనక నిగ్గిరిని బావ
కప్పకును భుక్తి దేవత లరుగుదెంచి
పెట్టుదురు వారు మనమున్నఁ బెట్టరెఱిఁగి
చనుట యుక్తములేవన్న చనుదమింక. 61

కం. అని యెంతచెప్పినను బా
వను నప్పను దీసికొనియె వచ్చెదఁగా కే
నని "భల్లుకపట్టు" గనా
చినకట్టఁడు గూరుచుండె శ్రీకంఠుగుడిన్. 62

కం. ఇతికర్తవ్యముదోఁపక
బతిమాలి విసువుజనించి బాలువిడిచి యా
గతమైనత్రోవ నలవా
రతి రయమున నేగి రతని యమ్మకుఁ జెప్పన్. 63

వ. తిరునాళ్ళకాలమ్మరిగిన పిమ్మటఁ గూడఁ గొండొక పర్యంతమును ధర్మకర్తలు లోనగువా రుందురనియు నింతలోఁ దండ్రి వచ్చి పీనిం దీసికొని వచ్చుననియు నెంచి వారు పయనం బొనర్చిన యనంతరము మల్లికార్జున దేవుండును భ్రమరాంబయు నప్పిన్నవాని పట్టుదలకు సంతసించుచు మంతనమ్మునఁ దమలోఁ దామిట్లు మేలమ్ములాడుకొనఁ జొచ్చిరి. 64

సీ. పుట్టినింటికి నీవు పోయి యెన్నాళ్ళయ్యె
నని శంకరుఁడు మేలమాడఁ జొచ్చె
నత్తవారింటికి నరిగి మీరెన్నాళు
లయ్యెనో! యని మేలమాడె నాపె

కట్టి దుకూలసంఘమ్ములా ! యేముండె
నను జూచి నవ్వికొంద్రవియె శూలి
ఆచట నేసిప్పింతు నట్టిపుట్టములు మీ
కెందుకు రండవియె భ్రమరాంబ

తే. గీ. వారు రిక్తులటంచుఁ బురారి నగియెఁ
గాదు సకలభాగ్యము లిచ్చువారు మీర
లల్లురై యుండ రిక్తు లెట్లగుదు ! రగుదు
రనుఁడు మీదయ కపయశంబవియె గౌరి. 65

వ. ఇట్లన్యోన్యము మేలమ్ములాడికొనుచు. 66

కం. రావోయీ ! బావా ! యని
యావిభుఁడా కుబ్జ మార్గమాదేశింపం
గా వెడలె గౌరితోఁ డను
దేవతలెల్లరును బోరి నుతింప నభమునన్. 67

వ. అట్లు బావయు నప్పయుఁ బాదచారులుగాఁ బయనంబగుటయ కాక తమతమ ప్రయాణపు వస్త్రాదికంబులు గల చిన్నిమడిసంచులు తమవి తామే మోసికొనుచు నరుగుచుండ నప్పసికుబ్జుండు కొండొక నేలనడిచి. 68

ఆ. వె. నడువఁజాలనేను గడుఁగడు నడుగులు
గులకరాలు గ్రుచ్చికొని యలఁదురె
వచ్చినప్పుడేను వచ్చితి బండిపై
ననుమ నడువలేక అఁగెనొకట. 69

వ. అయ్యెడ భక్త పరతంత్రుండు శంకరుండు భ్రమరాంబంగని చిఱునవ్వుతో. 70

కం. మీతమ్ముఁడు నడువండిఁక
రాతి ప్రదేశంబు గులకరా లసులవలెన్

నాతిరో ! గ్రుచ్చికొనెడి నెటు
లో ! తన్వీ ! యెత్తికొనుట యుక్తంబగుగా ! 71

వ. అనవుడు జగదంబ మందహాసమ్ముతో 72

కం. పదునాల్గు భువనములో ! అ
ద్రదునీయుం మో ! సుమేరుపర్వతమొ ! కళా
స్పదు మండలమో ! తమ కి
య్యది భరమెట్టులగుఁ జిన్నియర్భకుఁడనఘా ? 73

వ. అని వెండియు. 74

తే గీ. శరధిశరధిగ నొక్క యంసము నలంక
రించె రెండవయంస మ్మకించనముగ
నుండెఁ గనువారి కెట్టులోయుండుఁ బిన్న
మఱఁది నెక్కించి కొనుఁడన హరుఁడు నగుచు 75

తే. గీ. నెత్తిపై గంగఁ జందురుని ఫణిరాజు
పెనుజడల మోపుమోసెడి పేదవేల్పు
బుజముపై బావమఱఁదిని మోసికొనుచుఁ
బయన మొనరించె వేల్పు లబ్రపడిచూడ. 76

కం. ఎలజవ్వన మలరారెడి
పొలఁతిగ నంబయును నాదిపూరుషుఁ డొప్పల్
గులికెడి యువకుండుగఁ బు
ట్టిచు నత్తిలుఁ జూచువేడ్క నేగిరి యిట్టుల్. 77

తే. గీ. పుట్టువే లేనితల్లికిఁ బుట్టినిల్లు
టంచు నేర్పడె మునుపల్ల మంచుకొండ
మరల శ్రీశైలపున్ దరి మంచి విప్ర
జనము లుండెడి దేర్పడె జనపదంబు. 78

వ. ఇట్లప్పసిబాలుతోడను నర్ధాంగితోడను సామాన్య గృహమేధింబోలె శ్రీశైలమల్లికార్జునదేవుండు పథికుండై యేగునప్పుడు మున్ని కుజ్జవి వెంట నిడుకొనివచ్చిన యగ్రహారవాస్తవ్యులు గనియును, 79

కం. మానిసిఁబోలెడి వేల్పొక
మానిసులుందురని యెంచి మాటాడ రమూ
జానిబుజమందుఁగల ద్విజ
సూనుఁడు కనిపిలిచె వినరు సుంతయురొదచే. 80

వ. అనంతరమ్మవ్వారికన్న మున్న యబ్బాలుండు కపట సోదరీ భావుకులతో నింటి కరిగి తల్లింగని పట్టరాని సంతోషముతో. 81

కం. అప్పయు బావయు వచ్చిరి
అప్పచ్చులు వండుమనుచు నబ్బాలుఁడు మే
లుప్పతిలఁబల్కుటయుఁ దా
నప్పాపని పల్కునమ్మ కయ్యము యంతన్. 82

తే. గీ. వీధిగుమ్మమ్ము కడకేగి వెలఁది చూచు
నంతలో దంపతులు చూడనగుడు వీర
లెవ్వరో ! యాత్రికులు మనయింటికేగు
దెంచిరని నిశ్చయించి యతిథిసపర్య 83

వ. చేయుట గృహస్థధర్మంబగుటంజేసి పాదప్రక్షాళనంబునకు జలంబొసంగి సేమమ్మడిగి కూర్చుండు-డని కటంబొకటి నికటమ్మునఁ బఱచుటయు వారలయ్యెడఁ గూరుచుండిరి 83

కం. ఆ పసిపాపఁడు తల్లి న
పూపమ్ములు వండుమనుచుఁ బోరిఁబోరిమైఁ బ్రే
రేఁప దరిద్రతచే నెటు
దోఁపక సజ్జలను విసరి దోసెగఁ జేసెన్. 84

వ. అట్లు చేసీచేయని తోడన నబ్బాలుండా రొట్టెను బుచ్చికొని బావా!
తినుమని శంకరున కందిచ్చుటయు భక్తపరాధీనుండగు నాకపట
జగన్నాటక సూత్రధారుండందుఁ గొండొక భక్షించునంతలో బాల్య
చాపల్యమ్మునం జేసి శంకరునొద్ద కరిగి. 85

శా. బావా! అంతయుఁగూడ నాకు నిడకే భక్షించెదే! తెమ్ము నా
కా వైపెల్లను, వేఱొకండిపుడె నీకందించెదన్ రొట్టె, యి
ప్డే వేఱొక్కటిఁ గాల్చునమ్మయని యా యీశుండు భక్షించునా
లో వేవేగమ లాగికొంచరిగె బాలుండద్ది భక్షించుమన్. 86

వ. తోడి బాలురున్న వీధికిన్ జని యూరించుచు మాబావయు నప్పయు
వచ్చిరి మాయమ్మ యప్పచ్చులు వండెనని చెప్పుచు నానందించు
చుండె నింతలోఁ దల్లి తటాకమ్మునకు జలానయనమ్మున కరిగి
మరల నింటికి వచ్చుటయు. 87

చ. మునుపటి యిల్లు వాఁకిలియుఁ బూర్తిగ మాఱుపుచెందె సౌధమ
య్యెను దృణకాష్ఠనిర్మితపు పెద్దిగృహం బెటునమ్ము నాపె నే
మ్మనమది స్వీయగేహమని; మాయగఁ గన్పడె వచ్చినట్టి గే
హినియును భర్తయుఁ జనిరి యెచ్చటికో! తమ యిచ్చచొప్పునన్.

వ. అప్పుడప్పేదగేస్తురా లెట్టకేలకు సరిహద్దు గేస్తులయిండ్ల గుఱుతులం
బట్టి యయ్యది తమ యిల్లేయనియు నంతకుమున్ను వచ్చిన దంప
తులు శ్రీభ్రమరాంబా మల్లికార్జునులే కావలయుననియు నిశ్చ
యించికొని. 89

తే. గీ. పోరు చల్లార్ప నప్పుడపుడు తనూజు
తోడ భ్రమరాంబికాదేవి దుహితయనియు
బావ మల్లికార్జునుఁడని పలుకుదానఁ
గుఱ్ఱఁడది నమ్మి యటకేగు కుతుకమూనె. 90

వ. ఇరుగు పొరుగు గేస్తులతో దంపతి, వారిచ్చటికింకను వచ్చినజాడ కనుపట్టదని వెండియు. 91

తే. గీ. వారు రాకుండ నేరీతివచ్చె వీఁడు
మూఁడు నిండెను వీనికి మొన్న మొన్న
స్వయముగా రాఁదగిన శక్తి చాలునంచు
నెట్లు నమ్ముదుఁ జూచినదేని త్రోవ. 92

కం. అప్పయు బాపయునని నా
కప్పదఁతిని మగనిజెప్పె నయ్యో। వారే
అప్పార్వతి పరమేశుఁడు
తప్పెను బాదములు మ్రొక్కుటలి దాఁటెఁ గదా. 93

శా. కారికాలని సజ్జరొట్టె యిడు నాకార్పణ్యమున్ రోసి యా
ఫాలాక్షుండును నంబయు న్గడు ధనభ్రాజిష్ణు దివ్యాంబరా
వాల శ్రీకతురంగగోనికరసౌవర్ణాతి నూత్నప్రభా
జాలాందోళితడోలికాకలితవేశ్మం బిచ్చియుండ్రింతియే. 94

కం. ఎటిఁగి శివుఁ బూజచేసిన
దురితమ్మునఁ బోని నాకె దొరకెఁ గదా। య
బ్బురమగు నీసిరి యిఁక నెవ
రెటిఁగి యజించెదరొ। వారి కేకొఱఁతుండుఙా. 95

వ. ఇట్లాపె నివ్వెఱపడి కట్టుండేడ కేగెనని చూచుచుండ గర్వవ్యావ సాయికుం డాపె భర్త పశుగ్రాసంబు ఘాసంపుమోపు శిరమ్మున నిడి కొని తనగృహమ్ము గానరాక సంశయించునెడ నాపె యెదురుచని.

మ. ఇదియే మీగృహ మేలకొంకెదరు, రండీశుండు దేవేరియుఙా
ముదమారన్ మనయింటి కర్వుగులయపోల్కిఙా బదాతిత్వమూ
ర దయోద్రేకము కల్మి కుట్టునియెడన్ రాగిల్లి విచ్చేసినా
రిది మీగేహము నేను గేహినివి వాఁడే కుట్టుఁ దేతెంచెడిన్. 97

వ. ఇట్టులా యిల్లాలు భర్తకు విన్నవించునంతలో నీకుఱ్ఱని వెంటఁబెట్టు
కొని యాత్రకుంజని వీఁడు తన యప్పయు బావయు నగు శ్రీశైల
భ్రమరాంబా మల్లేశ్వరులు రానిచో నేను రానని మూర్ఖపుఁ బట్టుపట్టి
రానమటంజేసి విధిలేక యచట డించివచ్చితిమని తల్లిదండ్రులకుం
జెప్పుటకునై తద్గృహమ్ము గానఁబడమిన్ జేసి వెదకుచు-టయు
నీకుఱ్ఱండు గంతులిడుచు వచ్చి వారల కిట్లను. 98

ఉ. వచ్చిరి యప్ప బావయును వచ్చెది త్రోవను బావమూపుపై
ముచ్చటఁ గూరుచుండి కనిమోదముమైఁ బిలువంగ మీరు నా
కిచ్చినవారుగారునుడి హెచ్చిన పేరిమి బావనన్నుఁ దా
నిచ్చటదింపె నెత్తికొని యీడనెయుండిరివారు చూడుఁడీ 99

చ అనుటయువారు నన్యులను నాపులుబందుగు లెల్లవారల
క్కనకపుద్వారముందెఱచి కాంచనరత్న మయంబులైన స
ద్మనిచయమెల్ల నొక్కటియుఁ దక్కక చక్కఁబరీక్షగాఁ గనుం
గొని యిది యీశులీల యనుకొంచు నుతించిరి తత్కృపాప్లుతిన్.

వ. కుఱ్ఱండును నక్కజంపడుమ గేహంబెల్ల వెదకి తల్లితో నిట్లను. 101

తే గీ. ఇంతలో నప్పబావయు నేడకేగి
రప్పుతినలేదు రొట్టె బావైనఁగొంచె
మెంగిలియొనర్చెనో। లేదొ యేనుదాని
లాగికొనిపోతిఁ జామి। మరలనిడుదంచు. 102

తే. గీ మరల నిచ్చితివో। లేదొ। మంచిపనినె
చేసితివి కష్టపడి నేను జెన్నమల్లి
కేశుభ్రమరాంబ మీకిది చెల్లదేమ
రిక్తులమటంచు రాకుందురే। యటంచు. 103

తే. గీ. ఎన్నియో విస్మరములాడ నేగుదెంచి
నారు బావ నన్నెత్తుక నడచె నేను

నడువలేనన్న నంతటికడుఁ గృపావి
శాలు రెండుండ, రేమైరి? జనని? వారు. 104

ఆ. వె. ఎంతకష్టపడితి నేగినదాది నే
నప్పనడిగి యడిగి యాపెవలన
మాఱుమాటరామిమదిఁ గుంది బావను
సారెనడిగి రాతితీరుఁగాఁగ 105

ఆ. వె. మరల నప్పయున్న మందిరమ్మునకేగి
అడరానివేని యాడి విష్ణు
రములు, తుదకు వీరు రారంచు రాకున్న
నేను వారితోడ నెపుడునటనె! 106

కం. ఉండుటకు నిశ్చయించుక
"పోం" దని మనయూరివారిఁ బోరిఁ బోరి మీరల్
రండని వేధింపఁగ, వా
రొండొకపని తోఁపవీకయుండిన కతనన్.

ఆ. వె. బయలుదేఱి యిటకువచ్చిరి భాగ్యము
గలుగువారలౌటఁ గలిమి మనకుఁ
గలుగఁజేసి, రప్పగలిగించె భాగ్యమ్ము
బావకన్నమనమె పైతరంబు. 107

ఉ. వారమురోజులేవి యిటవారలు పుట్టిలు నత్తవారియిల్
కోరిన వచ్చియుంటిమని కొండొకపేరిమి సొంపుఁ బెంపు చె
న్నారఁగనుండఁగావలదె! యక్కట యేగిరె! చెప్పకే యెదో
దారినిబట్టి యయ్యయొ! యథార్థము నాకెఱిఁగింపు మమ్మరో! 108

కం. చేసినయత్నము "బూడెం
బోసిన పన్నీటి" పగిదిఁ బొలుపఱ పమ్మం

జేసితివమ్మరో ! యను శివ
దాసుఁగా బసికుఱ్ఱఁగాంచి తల్లి యిటులనున్. 109

తే. గీ. పార్వతీపరమేశు లవ్వారు తండ్రి !
వారు జగము లెల్లను గనువారుగావి
వారలంగనువారలు వేరెఱుంగు
మీవు నేమును ధన్యులమిది ధ్రువంబు. 110

తే గీ. మాటవరుసకు నేనంటి మనకువారు
చుట్టములటంచు నీవదేపట్టికొంటి
రాతివిగ్రహములు పురారాతి యతని
దేవెరియునంచుఁ జేసితివీవు ఋజువు. 111

వ. అని తల్లిదండ్రు లక్కుఱ్ఱ నభినందించి నీవలనఁ గులంబెల్ల ధన్యం
బయ్యెనని దీవించి సుఖముండిరి. 112

తే గీ. కుఱ్ఱయగుఁ గాక పెద్దయగుత జడాత్ముఁ
డగుతఁ బండితుఁడగుఁగాక యభవునందు
మది లగించినఁ జాలు నున్నదివిముక్తి
యిహముఁ బరమును మునులార ! యెరుఁగుఁ డింత. 113

కం. ఈకుఱ్ఱం డప్పచ్చికి
నై కాదే ? యభవువింటి కాహ్వానించెన్
శ్రీకంఠుఁడని యెఱుంగునె !
పీఁకన్ గరుణించి వానివెంబడి వచ్చెఁగా. 114

తే. గీ. అందులో నింతమెత్తని యాత్మగలుగు
దేవతలులేరు వేయేండు దేవదేవుఁ
డనఁగ నీయనకే చెల్లు నందరాని
వరము లిడికాచె ! యీవేల్పు వరదుఁడయ్యె. 115

ఆ. వె. "నేతిబీరకాయ" రీతి బిరుదముల
నితఁడు దాల్పఁ డితని యెల్లపేళ్ళ
శివుఁడు శంకరుండు శ్రీశంభుఁ డొకఁడేల
అఖిల నామములును సార్థకములు. 116

వ. ఇయ్యది ముగ్ధబాలానుగ్రహమ్మనియెడి శివలీల దీనిఁ జదువువారలు, వినువారలు నశ్రమంబున నైశ్వర్యవంతులై భక్తి ప్రపత్తులఁ దానకంబులగు సూనులంబడసి నిరామయాయురారోగ్యంబుల నంది సుఖించి తుట్టతుదను శివసాయుజ్యంబు పడయుదురని సూతుండు శౌనకాదులకు వక్కాణించె. 117

కం. దేవా! యాపత్తైలం
తావద్వ్యాఖ్యగ రచించు త్వత్పదభక్తి
శ్రీ వేంకటేశ నామకు
శ్రీవర్ధిష్ణు నొనరించి చేకొను శుభవా! 118

శ్రీశైల - ముగ్ధబాలానుగ్రహమహిమలు

సమాప్తము.



శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# గాయత్రీ మహిమ



వ. శ్రీమద్విజయవాటీపురనివాసా! కృత్తివాసా! మల్లికార్జునదేవా!
మహానుభావా! అవధరింపుము పురాణకథనోన్ముఖుండగు
సూతుంగాంచి శౌనకాదు లిట్లు ప్రశ్నించిరి. 1

తే. గే. అన్ని మంత్రమ్ములందు గాయత్రి యెక్కు
డందు రయ్యది యల్లపంచాక్షరిబలె
నెల్లరకు జప్యమైయుండ దెవరికి నుప
నయనయోగ్యత గలదొ! వార యధికృతులు. 2

వ. అట్లే యగుంగాక యితరమంత్రంబులకన్న దాని విశిష్టత్వం బెట్టిది?
అం దేదేవతకుం బ్రాముఖ్యంబు? వివరింపు మనవుడు సూతుండు.
మహామహులారా! వినుండు. "గాయంతంత్రాయతే" అను నన్వయా
ర్థంబు మీ యెఱుంగనిది కాదు. అద్దానివలన వాచ్యంబు పరమేశ్వ
రుండను నంశంబుగూడ నమ్మంత్రమ్మునందలి భర్గపదం బుద్బోధిం
చుచున్నను గొందఱు వారివారి బుద్ధిచాకచక్యంబు వినియోగించి
యితరదేవతాపరంబుగ వ్యాకరించుటయుం గలదు. 3

తే. గీ. అంతమాత్రాన నామంత్ర మభవు భర్గు
వీడునని విశ్వసించుట వెఱ్ఱితనము
భర్గునంశమ్ములే నిలింపగణమను ర
హస్యమేమయ్యె నెందు కన్యార్ధరచన. 4

వ. "సర్వేసర్వార్థవాచకాః" అను ననుశాసనమున్నను దానిని సర్వత్ర
యుపయోగించి యా యా పదమ్ములకు విరుద్ధార్థకల్పనం బుచితంబు
గాదు. 5

శా. గాయత్రీమనువాచ్యుఁ డల్లశివుఁడే కైవల్య మట్లుండ సు
శ్రీయోగంబిదు టక్కృతమ్మననెకా సిద్ధించె నద్దాని కీ
శ్రేయ మ్మొక్క మహేశుపట్లనె బుధుల్ సిద్ధాంతు లూహింతు రిం
కేయేవేల్పులు శూలిఁబోలె నిడువా రీశత్వసౌభాగ్యముల్. 6

తే. గీ. అల త్రిమూర్తుల యైశ్వర్య మష్టదిగధి
పతుల యైశ్వర్య మల్ల రావణుఁడు లోను
గాఁగలుగు రాక్షసేంద్రుల కలిమి శివప్ర
సాద మని చెప్ప నెవ్వరుఁగాదనారు. 7

కం. అడుగుటయేతదపుగ వర
మిడువాఁ డొకశంకరుండె యీ మంత్రజపం
బుడుగక యొనర్చి గౌతముఁ
డుడిగించెంగాదె ! కఱవు నొక్కెడ మౌనుల్. 8

వ. ఒక్కెడఁ దీవ్రంబైన ద్వాదశవర్షక్షామం బుప్పతిల్లి లోకంబు నెల్ల
నశింపఁ జేయుచుండె. 9

తే. గీ. వాన యను శబ్దమేతక్క వాచ్యమెందు
లేదు సస్యంబులకు దిక్కులేదు పసుల
గతి యధోగతి యీదృశక్షామ మేరు
పడి జగమ్ము నశింపఁగాఁ దొడఁగెఁ బెలుచ. 10

వ. ఆ మహాక్షామంబున విశ్వామిత్రునంతటి మహాతపస్వి దారపుత్రుల సంరక్షణమ్మునకు గత్యంతరమ్ము గనుపట్టక యెటకోచని పొట్ట పోసికోనెంచి తుదకుఁ దనకుఁగూడ నాహారంబు చిక్కక శ్వపాకు నింట వండికొన్న కుక్కమాంసమ్ము దిన నాలాయపడవలసివచ్చె నన విఁక నితరులంగూర్చి వచింపనేల ! అట్టులా మహాముని తనకుఁ జెప్పకుండఁ గుటుంబభారనిర్వహణంబునకు భీతిల్లి యెటకేనియుం

బోవ నమ్మునిపతిభార్య కొన్నినాళ్లు పెనిమిటిరాక నిరీక్షించి ప్రయోజ నంబు గానక కుటుంబభరణంబునకుఁ ద్రోవలేక "ఆపత్కాలేనాఽస్తి మర్యాదా।" యను సూక్తినూహించి తనకొమరులలో నొక్కని విక్రయించి తక్కుసంతానమ్మును రక్షింపనెంచి వానిగళమ్మునకు రజ్జువు దగిల్చి యమ్మకమ్మునకై గొంపోవు దృశ్యమ్ముచూచి హరిశ్చంద్రునితండ్రి శారదనృపాలుండు కారణాంతరమ్మునఁ బితృవిష్టాసితుండై యరణ్యమ్మునఁ గ్రుమ్మరువాఁడు "వీని మెడకిట్లు రజ్జువు నేలతగిల్చితివి" నావుడు నాసాధ్వీమణి విక్రయార్థంబు గొంపోవు చుంటి నవి తనదుర్దశనెల్లఁ దెల్లంబుగా వాక్రుచ్చిన నానృపమౌళి కటకటంబడి. 11

చ. ఇదిమొద లేదొయాఁకటికి నేనిడువాఁడ దినంబుఁదెచ్చి యా
పద గడవంగఁబెట్టుకొని బాలుని గ్రీతు నొనర్పఁబోకు మం
చెదముదమందఁ బల్కి మునియింతియు సమ్మతిచూపి కుఱ్ఱ గ్రీ
వఁ దవిలి యున్న రజ్జుమయపాశము దీసె నృపాలు మెచ్చుచున్. 12

వ. కొలఁది కాలంబు గళంబున రజ్జుబంధంబు దగుల్చుకతన నాకు ఱ్ఱండు గాలవుండు నాఁ బ్రసిద్ధుండయ్యె। నారాజన్యుండు ప్రతిదినంబును నేదేని భక్షణయోగ్యంబగు జంతువును వేఁటాడి తెచ్చి యమ్మునిపత్నికి సభక్తికమ్ముగా సమర్పించుచుండె నిఁకఁ బ్రకృతంబాలింపుఁడు. 13

కం. ఇట్టి మహాక్షామంబున
నట్టుడికినయట్లు లోక మార్తికి లోనై
చెట్టు కొకడుగాఁ బోవఁగ
నిట్టటుగౌతముఁడు గదలఁ దెసకం బఱఁడున్. 14

కం. అతిథులనెకాక యభ్యా
గతులనె మఱికాక యింటికడ కేగిన యే

పతితునకేవియు షడ్రస
యుతముగ నన్న మిడుచుండె నౌరు లరుదందన్. 15

సీ. ఎండిపోయెను బావు లెచటనున్నవిగూడ
గౌతమాశ్రమమునఁ గలదు జలము
రూపుమాపెను జెట్లు లేపొలమ్మునఁగూడ
గౌతమాశ్రమమునఁ గలవు చెట్లు
మాడిపోయెను సస్య మేడనున్నదిగూడ
గౌతమాశ్రమమునఁ గలవు చేలు
ఏష్టవాసెను జంతులేపొంతలనుగూడ
గౌతమాశ్రమమునఁ గలవు పసులు

తే. గీ. ఎండ యితరత్ర యగ్గికి నెన్నిరెట్లొ
అదరుగలిగించుఁ గాని యయ్యాశ్రమమున
మితికి మీఱదు వానయు మెట్టసస్య
ములకు ననుకూల మగుగతి నొలయుచుండె. 16

కం. ఎక్కడలేనిద్విజులు ముని
మక్కువతో సత్ర మిడినమాటను విని నల్
దిక్కుల నుండియు వచ్చిరి
క్రిక్కిఱిసిరి యాశ్రమమ్ము కెలకులనిండన్. 17

తే. గీ. దారపుత్రాదులను గొంచు నూరువిడిచి
వచ్చువారలు గొందఱు పశుగణంబు
గొంచు వచ్చెడివారలు కొందఱిట్లు
నిండి రిల గౌతమాశ్రమమండలంబు. 18

కం. అది మును పరిమితమైన
ట్టిది యయ్యును ద్విజులు వచ్చుచే తదవుగఁ దా

మదపసితముల నోసంగెడు
నదియై వర్ధిల్లుచుండె నమ్ముని మహిమన్. 19

తే. గీ. ఎంద తెక్కిన మఱియొక్కఁ డెక్కుచోటు
చాలియుండు కుబేరపుష్పకము రీతి
గౌతమాశ్రమ మెంద అక్కడికిఁ జనినఁ
గొఱఁత లేకుండ నిచ్చు నందఱకు నిండ్లు. 20

తే. గీ. పెండ్లికొడుకువారికి నెటు పెండ్లికూఁతు
వారు విందులమర్తు రాతీరు గౌత
మాశ్రమమ్మున నతిథుల కనిశము నను
భూతమయ్యెను షడ్రసోపేతభుక్తి. 21

వ. ఇట్లేఁ దీక్షగా నొకటిగాదు రెండుగాదు పండ్రెండేఁడులు గౌతముండు గాయత్రీమంత్రపురశ్చరణసామర్థ్యంబునం జేసి యయ్యెడ కరువెంచిన చాతుర్వర్ణ్యంబును భరించె దదితరజనంబునుగూడ భరించె నా భరణ ప్రకారంబు చాలవిచిత్రంబై యుండు. నమ్మహాతపస్వి తన్మంత్రోపాస్తియందు దీక్షితుండై యుంటతప్ప నితరం బేయదిగాని గలిగించుకొన్న ట్లగుపట్టదుగాని. 22

ఉ. దానమునందుఁ బ్రేమగల ధారుణినాధులు వైశ్య లంఘ్రిజుల్.
మౌనికి వశ్యులై తమ సమస్తము సచ్చటఁ వెచ్చఁబెట్టు న
ప్పూనికతోడ వచ్చి సతమున్ జతనంబున భూతతృప్తి యిం
పౌ నెటిఁ జేయుచుండి రటులౌట మునీంద్రు తపఃప్రభావమే. 23

కం. ప్రతి వటువున కుపనయనం
బుతఱిన్ గాయత్రి మంత్రమును గురుఁ డిడు నీ
వ్రతి గౌతముబలెఁ దన్మం
త్రతరస్విత నెఱిఁగి జప మొనర్పఁ డొకండున్. 24

కం. పదియో నూఱో లే కేఁ
బదియో పదినూఱుసార్లొ పఠియింతురు కో
విదులు మఱికొంద ఱితఁడ
య్పదసంఖ్య జపించె మంత్రమును గాయత్రిన్. 25

వ. ఆకారణంబున సకలజగదుద్వేజకంబగు క్షామం బాతని యాశ్రమ
ప్రాంతమున నడుగిడ నేరదయ్యె నని వెండియు. 26

ఉ. పెండిలివారువోలె నట బీదలుసాదలుఁ విందులందుచుఁ
బెండిలి పడ్గు నాదియగు పెక్కుశుభంబు లొనర్చికొంచు నా
క్కఁడును లోటు లేనిగతిఁ గాలముపుచ్చుచునుండునంత నా
గండముదాఁటె నెల్లరు సుఖంపడు కాలము వచ్చెఁ జెచ్చెరన్. 27

వ. అనేకులు గేస్తు లమ్మహాముని సాన్నిధ్యంబు వాయలేక యెట్లెట్లో
సెలవుగొని తమతమ నిలయంబులకు గౌతముని సౌహార్దంబున
కచ్చెరువందుచుఁ జని సుఖంబుండిరి. ఇఁక మిగిలినవారు కొందఱు
మాత్ర మే. 28

కం. వారల లోపలఁ గలరు బి
కారు లనుపకారులు నపకారులును గడే
కారులు యతిక్కించిత్సం
స్కారులు నానావిధప్రకారులు క్రూరుల్. 29

వ. బ్రహ్మజాతియందు మాత్రమ కా దేజాతియందును దాదృశుల యున్కి
కోచ్యంబ ఆకృతఘ్నులెల్లరు నొక్కచో గుమిగూడిరి. అందుఁ
గొందఱు గృతజ్ఞులును గలరు, వారును వీరును నిట్లు ప్రసంగించు
కొనఁ దొడంగిరి. 30

చ. ముని గడుమంచివాఁడెయగు ముక్కుబిగించుక గూరుచుండు ద్రొ
క్కినయెడఁ బిచ్చికోఁడు పరికించిన వింతటిగర్వి గానరాఁ



దని యొకరుఁదన వ్నిజమ యాయనవై ఖరి యట్టిదే సిరిన్
గను జనులెందులేరె । యిటు గర్వముదాల్చిరె । వారలెల్లరున్. 31

కం. తనయంత జపిత లేఁడని
మునికిఁ గర్వమ్ము గలుగ మోఱకులకుఁ జె
ప్ప నలవియుం గలదే యీ
యన తలదాఁటిన తపస్వు లవనిని లేరే । 32

వ. ఇట్లొకరుండు వలుక వేఱొక జ్ఞానలవదుర్విదగ్ధుం డిట్లను. 33

ఉ ఈయనకున్న గర్వమది హెచ్చుతపస్వి నటంచుఁ గాదు నేఁ
బాయక నిత్య మిందఱకుఁ బాఱల కన్నముపెట్టుచుంటి నా
కీ యిల నెవ్వ రీడనునదే యన నింకొకరుండు వల్కెఁ సీ
సీ । యటులేల పల్కెదు విశిష్టగుణుండు మునీంద్రజాతిలో. 34

ఉ. అన్నములేక చచ్చు మనకన్నము వస్త్రము నిచ్చి ప్రోచుసం
పన్నుఁ డుదారుఁ డీయనఘు పాదరజంబు శిరానఁదాల్చుచోఁ
బున్నెముగల్గుఁగాని వెడపోకలు వోయినఁ గూడుపుట్టునే ।
చిన్నతనంపుఁ జెయ్వు లవి చేటు ఘటించెడి నూరకుండుమీ. 35

వ. నావుడు వేఱొక కృతఘ్నుండు సపరిహాసమ్ముగా నిట్లను. 35

చ. ఎఱిఁగినవాఁడునుం బలెనె యెమ్మె లెవో వచియింతు విమ్మునీ
శ్వరు పదరేణు వంతటి ప్రశస్తికిఁ దానక మేని రాము పా
దరజము దాల్చి యీతపసిదార పవిత్రత గాంచనేల । భ
ర్తృరజము తాదృశం బనెడి తేఁకువ యాకెకు లేకపోయెనే । 36

వ. అవి వెండియు. 37

చ. ఇతఁడు మహోత్తముం డయిననేమి యనాగసురాలుభార్యదై
వతపతి యింద్రు మోసమునుబట్టి కళంకితురాలు గాఁగ న
య్యతివఁ బతివ్రతన్ వెతకు నగ్గముగాఁగ శపించె మౌని యై
యుత మెఱుఁగంగనేరఁ డెవఁ డీతనిమెచ్చు వివేక ముండినన్. 38

కం. సురపతి శపించుటకు నె
వ్వరు గాదన రితని నతఁడు పాపియగుటచేఁ
బరమపతివ్రతయెడ ని
ష్కరుణుండగు నితని ననని ఘనులుంగలరే। 39

వ. నావుడు మఱియొకరుండు కొండొకయోగ్యుండు. 40

చ. గఱువల వర్తనంబునెఱఁ గాదనియొనని చర్చ సేయఁగా
మొఱకులు నేర రూరక నమోయని వారికి మ్రొక్కు టొక్కచే
దురితహరంబు మోఱకులు తొందరపాటున వారినెంచి వి
స్తరమగు నారకమ్మునఁ బడంపడి గూలి నశింతు రార్యులై. 41

తే. గీ. అన్ని శాస్త్రమ్ములందున నతిదురూహ
మైన తర్కశాస్త్రమ్మున కాదికర్త
గౌతముఁడనంగ నాతని సేఁతకాదు
నాఁగ మనకున్న లేఁతవిన్నాణ మెంత. 42

తే. గీ. ఏదొ మిడిమిడిజ్ఞానంబు నింతొ। యంతొ।
ఉన్నదేయను నీకునాకొడ్డనెంచు
నంతపాటిదె। యది యెంతయులఘుఁ డిహ్మ
హామహుఁడు కోట్లకొలఁదిగ నన్నమిడియె. 43

వ. మఱియొక కృతఘ్నుండు పరిహాసపూర్వమ్ముగ నిట్లను. 44

ఉ. అన్నముపెట్టె నెందఱికొ అయ్యది యీతని ప్రజ్ఞగాదు ప్ర
చ్ఛన్నముగాఁగ నింద్రుఁడు నిశాసమయమ్మునవచ్చి యేగుచో
బన్నము కారణమ్మగుచు వార్ధిజనించిన కోర్కెలీను న
య్యన్నువరత్నము౯ మఱచినట్లుగ నామది నూహపుట్టెడున్. 45

వ. అట్లేకావిచో. 46

తే. గీ. పండినట్టులు గనరాదు వార్చినట్లు
లేదు దినదినమును గోట్లు లేచిరతిధు

లల్ల చింతామణీసుమహత్త్వమయది
ఋషిమహత్త్వం బటన్నచో నెవఁడునమ్మ. 47

వ. మఱియొకరుం డించుక సజ్జనుం డిట్లు మందలించె. 48

చ. పదియును రెండునేఁడులు కృపామయుఁడమ్మని సొమ్ము మెక్కి సౌ
హృదమెడఁజేసి తప్పనుడు లేటికిఁ గూటికిగుడ్డకౌనె ౹ త
ప్పిదమిది రత్నమే మనలఁ బెంచినధేనువు పెంచినం గృతం
బెద పుఱవంగరాదు మునియే మనయాపదఁబాపె నాఁదగుఱా. 49

కం. క్షితినిగల దోషములలోఁ
గృతమును మఱమకలి మిగులనెక్కుడగుట ని
ష్కృతి దానికి లేదనుచున్
మతిమంతులు వల్కుదురు ప్రమాణజ్ఞాతల్. 50

ఉ. కావున నమ్మహాపురుషుఁ గాదని యౌనని వాచులాట దు
ర్భావమ యన్నదాతయు భరంబుభయంబు దొలంచిప్రోచు స
ద్భావుఁడు వీరుఁతండ్రిబలెఁ దద్దయుఁబూజ్యులటండ్రువిజ్ఞు ల
క్కోవిదు గౌతమున్ వృథగఁ గూళతనంబున నాడిపోతురే ౹ 51

శా. గాయత్రీమనుజాపకుండు నిఖిలజ్ఞాత్రగ్రగణ్యుండు వి
ద్యాయత్తుం డయికూడ నీతఁడు దరిద్రాణుండు గాకుంటచేఁ
జేయేనాఁడును జాపఁబోఁ డనఘు సుశ్రీయుక్తు నీమౌనిరా
డ్గేయున్ జెప్పిననోటఁ జెప్పుటకునేఁడీ వేఱొకం డిద్దరఁ. 52

వ. ఇట్లు కొందఱొకవిధంబుగను మఱికొంద ఱింకొకతెఱంగుగను నప్రస్తుతప్రసంగం బొనర్చుచు మఱికొంతకాలం బటనుండిరి. అందుఁ గేవలకృతఘ్నులకు నిర్హేతుకంబగు నసూయ సహజంబ గావున నాయన్నదాతనెట్లో వంచింత మనుతలంపు వొడమి రంధ్రం బన్వేషించుచుండిరి. కాకతాళీయమ్ముగ నక్కాలమంద క్షైలానమ్మున.

తే. గీ. తనకు నర్ధాంగ మిచ్చినందునకు గౌరి
సంతసించియు గంగ శీర్షమునఁ దాల్చు
నీశుపై దికి వగగూరి యెట్టులావె
నవలి కంపించుట కుపాయ మంచునెంచి. 54

కం. దినదిన మదేపనిగ నె
మ్మనమున గంగయెడ నీసు మాసరముగ యో
జన చేయుచుండె నీశ్వరి
వనితకు మనమెరియదే। సవతిగన్పడినన్ 55

తే. గీ. అందులో నుత్తమాంగమ్మునందు సవతి
తాండవించుట తన కధస్థలపుటునికి
యెంత యీశ్వరియైనను నెడఁద నైఁచు
నోర్వ చాలక గౌరి విట్టూర్పువుచ్చు. 56

చ. దయితుని మందలించుట కెదందలవోసియు నర్ధదేహముఁ
దయమెయి నిచ్చియుండిన కృతంబది జ్ఞప్తికివచ్చి కొంకు నే
ప్రియుఁడును భార్య కీవిధపుఁబ్రేమ గనంబడఁజేయఁ డంచు నా
మె యెఱిఁగియున్ దపించుఁదనమీఁదనొకర్తుక యుంటనైఁపమిన్.

తే. గీ. వలపుతలకెక్కి తలకెక్కువనిత యాగ
డమును నయిరించెఁ దా భుజంగమవిభూషుఁ
డట్లుగాకున్న నెల్లరు నపహసించు
వింతచనువున కొప్పెడి విభులుగలరె। 58

కం. వోసీ పతివ్రతాత్వం
బేసీ కలదేమొ। యన్న నీవె జలధితోఁ
దానెఱుఁగఁడె। కలయుట యీ
శానున కీకులట చెయిది సహ్యం బాయెన్. 59

కం. తనపాపం బటుబుండఁగ
మనుజుల పాపముల నీపె మాన్పుటకై లోఁ
గొనుటది జగత్ప్రసిద్ధం
బనలాక్షుఁడు నెత్తిఁదాల్చె నఘములముల్లెన్. 60

వ. పంచమహాపాతకుల నిర్వచించు సందర్భంబున గఱువలు నలుపు రను జెప్పి "తత్సంసర్గీచ పంచమః" అనుట సర్వజ్ఞుం డెఱుఁగ కుండునా। అగుచో నీపె సంసర్గంబునంజేసి తానుగూడఁ బాపాత్ముండు గావలసి వచ్చుంగదా. 61

చ ఇతరుల పాపపుణ్యముల నేర్చి ఫలమ్ము నొసంగు దేవతా
పతిపురవైరి ఆయనకుఁ బాపము సోఁకిన యేని యెవ్వ ర
ప్రతితత వ్యాకరింపఁగలవా రను గర్వముదక్క నొందు సం
గతిమగు నుత్తరం బిచట గన్పడ దెంతగ నెంచిచూచినన్. 62

వ. బాగుగ విచారించిచూచినచో. 63

చ. ఇతరులజీవితంబు లవి యేగతినుండిన నంత వింతగా
స్తుతమతులైన పండితులుఁదోషముగా గణియింప రెవ్వఁడు
న్నతుఁ డధికారి వాని సుగుణంబులలోనఁ గళంక మున్నచో
నతనిని గౌరవింప రధమాధముఁగా విరసింతు రీసుమై. 64

సీ. బ్రహ్మదేవుఁడు తన్నుఁ బ్రత్యక్షమునఁ దప్పు
పట్టఁజాలనియంతఁ బాపమఱునె
విష్ణుండు మాటాడవెఱచి యూరకయున్న
నేనంబు తనది తా నెట్లు సురుగు
సూర్యుండుఁ జంద్రుఁ డక్షులు వహ్ని తనకు వా
రూరకుండినఁ బాప మాఱిపోదు
ఇంద్రాదిదిక్పాలు రేమనంగలరు త
న్నవకున్నఁ బాతిత్య మవలఁజనము

తే. గీ. చేయిశిరమున నిడి మున్ను చేసినట్టి
సమయము నతిక్రమించి యీశ్వరుఁడు వేలు
కులట శిరమున నిడికొన్నఁ గోవిదుం డె
వండు సహియించుఁ గననీదు వలపు సడిని. 65

సీ. ఒడలెల్లఁ జేపకం బొక్కచో నిలకడ
లేదు వంకరనడ లాదినుండి
ఉన్నతస్థానమం దుంచుటయేకాని
నీచస్థలంబేగి నిల్చుచుండు
"నైనవారికినాకు" లన్నరీతికి నగ్గ
మై పాపుల కొసంగు నాకసుఖము
నున్నతంబగు వస్తువొండు తారసమైనఁ
దప్పించుకొని దారితప్పి యేగు

తే. గీ. భంగపాటుకుఁ బుట్టిల్లు భవునికీపె
పట్లఁ బ్రేమంబు గలిగెఁ "దాపలచినయది
రంభ యనుసామెత కుదాహరణము నాధు
చెయిది నెట్లువిమర్శింపఁజెల్లు నకట. 66

తే. గీ. ఆపెగుణదోషములకేమి అన్యులకవి
నచ్చకుండిన నచ్చెను నాధునకెద
సవతిపోరు తప్పించు వెఱవును జూచి
కోపలయు వింతకెయ్యది గోడు సతికి. 67

ఉ. అందఱనెత్తిమీఁదఁ దనయంఘ్రులు రాజిలునట్టివాఁడు ఖం
దేందుధరుండు తాదృశుఁడిహీ ! యని యెల్లరునవ్వ నెత్తిపైఁ
జిందు లొకర్తుద్రొక్క నెద సిగ్గిలఁదేమని మ్రొక్కువారొ ! యా
యిందిరభర్త లోనయిన యెల్లనిలింపులు శోచ్య మీయనన్. 68

కం. అధికార మెంతయుండిన
బుధసమ్మతి కదియుఁ బాత్రముగ నుండనిచో
వ్యథ గలిగించు జగతి; కా
పథమున నడువఁగ వివేకి భయపడు నెదఁదన్ 69

వ. అని కొండొకయోజించి. 70

చ. తప మొనరించి యీయనకు దార యిఁకెవ్వతె లేదటంచు నే
నపరిమితానురాగమున నాదితిఁబెండిలి; నిప్పుడెట్లొ యీ
కృపణత దాపరించె లవమేని రహస్యములేదు నెత్తిపై
నెప్పుడును గుల్కు నీసవతి నెట్లుసహింతు నధఃకరించెదన్. 71

వ. అని సర్వజ్ఞగావున నప్పరమేశ్వరి యీ పెనెటులో దింపవలయు నిందు
లకుం దగినవాఁడు గౌతముండనియు నాతండు గోరినచోఁ బరమే
శ్వరుం డీపె నొసంగవలసి వచ్చుననియు నెంచి యాతండు గోరు
టకుందగిన నిమిత్తంబు గల్పింపవలయునని యెంచి తన చెల్మికత్తె
యలయందగ్రగణ్యయగు జయను బిల్చి మంతనమ్మున నిట్లుప
దేశించె. 72

ఉ. ఈ విపుడే రయంబచని యెందులకుం గొఱగానివై ఖరిన్
గోవయి యూఁదుచోఁబడెడి గోమున గౌతమునాశ్రమంబునం
దేవియొ చేలలోనఁబడి యేద్దెఱ మేయుచునుండు మాతడా
త్రోవనువచ్చి చూచి నినుదోలను వెంటనె వీడు మీవసుల్. 73

వ. పదంపడి జరుగుకార్యంబుతో నీకు నావశ్యకతలేదు, నీయితకర్తవ్యం
బింతియేయని యనుశాసించుటయు నయ్యంతియు మిగుల బక్క
చిక్కిన వృద్ధగోవయి గౌతమాశ్రమంబునందలి యొక కేదారంబు
నంబడి మేయుచుండునెడ నత్తపస్వి స్నానార్థంబరుగుచు మోదుగు
మండతో దానినవలఁదోలు పూనికితో నించుక తాడించునంత నయ్యది

దీనదీనమ్ముగా నొక్కయుఱపుమాత్ర మఱచి యాచేనిలో విగతసంజ్ఞ కంబై పడియె. 74

కం. ముని దరికినేగి జతనం
బునఁ జెవులనుమూసి కలశమునఁగల జలమొ
య్యన మోరనిండఁ జల్లినఁ
బని లేశముసేయ కాయుపాయములెవియున్. 75

వ. కృతఘ్నునకొనర్చిన యుపకృతులంబోలె వ్యర్థమ్ము లగుటయు నయ్యనఘుండు ఖిన్నుండై యేదియుందోఁపక యింకను దాసిన్ బ్రదికించుట కేవియో యుపాయమ్ములు వెదకుచు నిర్విణ్ణుండై యుండునెడ వెనుకనుదాహరించిన కృతఘ్నులు తమయెదందల సంతసించుచుఁ బయికిమాత్రము విచారం బభినయించుచుఁ దగ్గఱ కరుదెంచి మునికి సంఘటించిన యయ్యెడరునందుఁ బాల్గొను వారలంబలె నటించుచు. 76

చ. కొలఁదిపలాశదండమునఁగొట్టితి రీ రిది వృద్ధమూర్తి యె
మ్ములు మఱితోలు లేదుపలమున్ గనుఁగొందమటన్న మేన నా
వలి కరుగందలంచి పడి ప్రాణమువాపెను మాటదక్కె మీ
హొలమున కెట్టుగా నఘముపోవునొ ! అవిధిఁ జూచుటొప్పగున్. 77

ఆ. వె. తినిన నెంతదినెడిఁ దినుటకిద్దానికిఁ
బండ్లుగూడ లేవు పాపమురక
మీకుఁ జుట్టనెంచి మేఁతకుఁజేనిలోఁ
బడియె బ్రహ్మహత్య వంటిదిదియు. 78

వ. గౌతముండు మిన్నుమన్ను నెఱుంగక యీదినమెంతదుర్దినమో? యీగోహత్యకు నేస్వల్పమైననేమి? తాను నిమిత్తం బైతినిగదా? యని వగచుచుండ నాకుటిలవిప్రులు తన్నుద్దేశించి యుపశమోక్తులకు బదులు "మిహొలమునకు మాటదక్కె" ననునుడి నొడువుట కాలం

బుతీరున హృదయమ్మునకు నాటి విరపరాధిని దన్నుదోషింగా నపల
పించు నా బ్రాహ్మణబ్రువుల ప్రల్లదనంబు దనమనమ్మున గోచరించు
టయు నమ్మహనీయుండు. 79

చ. ఆకలుషుఁడంచు నన్నెఱిఁగి యాత్మ నొకందును బైకొకఁడుగా
వెకలితనంబు పైకుబుక వీఱిఁడికూతలు గూయఁజొచ్చు మీ
వికృతి బయల్పడెఁగా సకలవేది పరాత్పరుఁడుండె నేను మా
రకుఁడనా కానా ? దీని కచిరంబున నాతఁడు తేల్పకుండునే। 80

చ ఎఱుఁగదొసంగు వట్టి యవహేళనమిద్ది భవత్కులీను లె
ల్లరు నిగమమ్ములన్ విడిచి లాఁతివి లాతులవాండ్ర వేసమున్
మఱగి శివార్చనారహితమానసులై కడజాతి సేవ కా
దరము వహించి పాడుకుమతంబుల పాల్పుకు దేలతెప్పెదిన్. 81

కం. పాలాశపుమండదం గొని
దోలుట దోషమన రెట్టిదోషజ్ఞులు మీ
హేళనకుఁ దగ్గఫలమును
వాలాయము గుడువకుండ వశమెట్టులగున్. 82

కం. గాయత్ర్యుపదేశమ్ముఁగా
జేయుటయేకాని దానిఁ జేకొనుకొమరుం
డే యార్యునకోతక్కిన
నీయుర్వి జనింపఁ డింతయెఱుఁగుఁడు మీరల్. 83

తే. గీ. జందెమేయుండ దుండిన సందెవార్చ
రదిఘంటిచిన లేదు గాయత్రిసిద్ధి
స్నానమని మడియని సుంత లేనివాండ్రు
పొడముదురు మీ కొలమ్ములు పొల్లుగాఁగ. 84

కం. ఉదయమ్ము కాకమున్నే
యుదరము నేరసముతోడనో వింపనిచో

బ్రదుకుట దుర్ఘట మనువా
రుదయింతురు మీకులమ్ము లోలిన్ బ్రీలన్. 85

కం. పంచాక్షర్యుపదేశో
దంచనము నశించుఁ బొట్టకై యేచదువో
పంచముల గురుత్వమునఁ బ్ర
పంచము వంచించుఁ బొలియు బ్రహ్మకళ యిలన్. 86

కం. శాపానుగ్రహశక్తి ద
యాపరతయు నతిథిపూజ యాగమనియత
వ్యాపృతి మీ వంశస్థుల
కేపాటియు నబ్బకుండు నిదియు మొదలుగన్ 87

తే. గీ. ఆర్షమర్యాద లడుగంటి యాత్మజలకు
మీకులస్థులు గాంధర్వమేళనములు
సమ్మతింతు రొండొక్క వాసరమునంద
యుష్మదీయులు చేయుదు రుపయమములు. 88

కం. శివలింగార్చనయు, నుమా
ధవు పారమ్యప్రసక్తి తగ్గి యెవేవో,
వివిధపుఁ ద్రోవల మీకొల
మవనిం జరియించు వేదమది నశియించున్. 89

తే. గీ. అద్దమైన వృత్తులకు మీయన్వయములు
సిద్ధపడి గూడ లాభంబు చెందకురక
పీచుల సమాశ్రయణము సంకోచమెదలి
సేయు న న్నవహేళనసేయుకతన 90

కం. కట్టున బొట్టున జుట్టున
నెట్టి నియతిలేక మగలునింతులు స్వేచ్ఛం

బట్టిచరింతురు మీకుం
బుట్టెడివారలును దద్భవులుం భవుంగుచున్. 91

కం. కొందఱు చెప్పలుగుట్టెడి
సందప్పుష్మనఁ గుటుంబసంరక్షణమున్
గొందురు గొందఱు మాంసము
తిందురు మీవంశజులు విధికి దూరగులై. 92

కం. కొందఱు భార్యలయార్జనఁ
దిందురు కన్నియలనమ్మి తిందురు ధరలోఁ
గొందఱు మీవంశము లీ
చందమునం జెడెడి నాదు శాపముకతనన్. 93

కం. ప్రతిగ్రహమేధియుఁ గన్యా
పితృత్వమున కెంత యేని భీతివడు ధనం
బతిగా నిడక వివాహపుఁ
గృతికిన్ వంజనకు లొప్ప రెట్లోయనుచున్. 94

కం. కులభేద మెంచకుండ స
కలకులముల కన్నియలను గైకొంద్రు భవ
త్కులమునఁ బొడమినకుమతులు
కలికిం జంకనెడిమాట గన్పట్టదెటన్. 95

కం. భృతకోపాధ్యాయత్వము
సతమగు నంఘ్రిజులు ధనమొసంగిన వాంఛన్
శ్రుతికర్తలుగా మంతురు
గతమర్యాదులయి వచ్చుకాలమున ద్విజుల్. 96

కం. ఆయుష్కర్మమ్మునకున్
రేమే నమవసయునేవి రిక్కదియేనిన్
రోయరు కొందఱు స్వయముగ
నే యదిగావించుకొందు రెఱుఁగుఁడు కులజుల్. 97

వ. మఱియును మీకులస్థులలోఁ బెక్కురు దూష్యమ్ములగు వస్తువులు విక్రయింతురు, అన్న విక్రేతలుగూడ నగుదురని వెండియు. 98

చ. అదియిదియేల ၊ సర్వమిహమై పరభీతి లవంబులేక మా
బుదురు భవత్కులస్థులు దురుద్ధరదోషము లాచరింత్రు కో
విదులనుడుల్ గణింప రవివేకులువారని యూసడింత్రు త
ప్పిదముల నొప్పిదమ్ములని పేరిమిమై నొనరింతు రెమ్మెయిన్. 99

వ. ఇట్లు గౌతముండు తత్రత్యులును గృతఘ్నులును నగు ద్విజులను శపించుసమయమ్మునఁ బరమేశ్వరీసంకల్పప్రేరితులగు కొంద ఱుత్తమద్విజు లయ్యెడకువచ్చిన నవ్వారలం గాంచి గౌతముండు సప్రశ్రయమ్ముగ నిట్లను. 100

చ. అనఘులుమీరు నాకునొకఁడారసితెల్పుట కేనుగోరుమఱ
మనముతపించుచున్న దతిమాత్రముగా నిది నాకతమ్మునఁ
గనెమృతి మందనొండుగొని కాతరతం గలిగించినాఁడ దై
వనియతి కేమనంగలదు ၊ పాపముపైఁబడె నేమిసేయుదుఱ. 101

తే. గీ. ఇప్పుడో ၊ రేపో ၊ చచ్చెడిదేయటన్న
వాలకము చూచి సస్యమ్ము పాడుచేయు
చున్నదని బెదరించితి నొక్కయాఱు
పార్చి పడి మృతిచెందె మాయ యిదియేమొ. 102

కం. పాపంబెఱుఁగని నాపై
నీపాఱులు పాపమెంచి హేళన లేవో
ఆపాదింపఁ దొడంగిరి
శాపం బిడినాఁడ నదికి సైఁపఁగరామిన్. 103

శా. పైఁగా నీదొసఁ గొక్కఁడబ్బె వృథగాఁ బాఱుండు ముక్కోపియై
యాగోభాగులనేని దిట్టు టదితప్పాఁ దామసావేగ మ
ట్లాఁగన్ రామి శపించితిన్ ఘనులు మీ రాగంబులేకుండి పై
కొగం బున్నటులున్న నన్నెటులొ వీశాగసుకఁ జేయన్ దగున్. 104

వ. ఇట్లు నిరపరాధియయ్యు నపరాధి చందమ్మున వగంబొగులు గౌత మునకు బ్రహ్మణ్యులైన యమ్మునులు పరమేశ్వరీప్రేరితులై సగౌర వంబుగా నిట్లనిరి. 105

ఉ. నీవు మహానుభావుఁడవు నీకెనయౌ ఋషు లెందుమ్రుగ్యు లీ
గోవు నిమిత్తమాత్రమునకు న్నినుఁజూపి యనుల్త్యజించె నీ
దైవతమాయ నీకతనఁ దద్దయు మేలొనఁగూర్చుఁగాక యీ
భూవలయాంకన్ వృథగఁ బో వెవియేవియు మీదుచైదముల్. 106

వ. ఈదేశంబు నదీమాతృకంబు గామింజేసినిన్న మొన్నటిదనుక ద్వాదశ వర్షపరిమితంబగు క్షామంబునకు నగ్గమై నీయనుగ్రహమ్మున తవ మాబోట్లందఱును గృతార్థులై మనఁగలిగిరి. కొలఁదిదినమ్ములనుండి క్షామం బుపశమిల్లెఁ గాని దేవమాతృకంబులగు దేశంబులకుఁ దఱ చుగా నీ క్షామపీడ తప్పదు. 107

తే. గీ. "ఒక్కొకల గన్నయంతనే చక్కఁదెల్ల
వాఱు" దటుగాన నీదేశవాసుల కిఁక
క్షామబాధ లేకుండఁగ సలుపవలయు
నిదియు దానికి వ్యాజమై యేరుపడుత. 108

కం. గాయత్రీమంత్రసదా
ధ్యాయికి నీ కిట్టిఫలము దక్కుఁ గడఁగుచో
నే యంతరాయములు విను
డాయవు మాకిట్లుగా నెదందవచించెణ. 109

ఆ. వె. ఈవు గోరినంతనే యిచ్చుఁబురవైరి
గంగఁ బాపభంగకారిభంగ
దావి దీవిమీఁదఁ దరలించుచో నొక్క
కృతికతాన రెండుకృతులు నెగ్గు. 110

కం. ఇది సదుపాయముగా మా
యెదకుణ వట్టినది యేనమే లేదొకచో

నది యున్న పిదిఁయడఁచి పై
నౌదవించున్ మేటిపున్నె మోయమివంద్యా। 111

వ. మాకుం దోఁచినతెఱం గిదియని మహామాయాప్రేరితులగు నమ్మునులు లోకకళ్యాణంబు మనంబున నూహించి ప్రేరేచుటయు గౌతముం డిదిలెస్స యని యంగీకరించి 112

చ. మనమున శంభుని న్నిఖిలమంత్రవినేతఁ ద్రినేత్రు లింగరూ
పిని వనజాక్షమిత్రు రిపుభీకరు లోకరుజాపహారిఁ బా
వనసుచరిత్రు సర్వసురవందితు నిందితదూరు నిల్పి యా
యన శివమందుఁ దాల్చ నలయాపగకై తప మాచరించుచున్.

సీ. సామేనఁగలగౌరి సంతోషవంతురి
తాసనాంభోజ నెయ్యంబునెఱప
శీర్షభాగమ్మునఁ జిన్నారిపొన్నారి
విదియచందురుకాంతి ముదముఁగొలుప
ఘనజటాజూటాన గంగామహాదేవి
తరఁగ లంచలపిండు దరికి ద్రోయ
నత్యచ్ఛపగు గళమ్మందు సుశ్రీచ్ఛాయ
గ్రహణకాలపు రాహుకలన మెఱయ

తే. గీ. భూతిభూషితమైన వపువున సర్ప
రాజి పడగలువిప్పి శీర్షగతరత్న
కాంతులను గంతకాశిముఁగడకుఁ ద్రోయ
నెదుటఁ బ్రత్యక్షమయ్యె గౌరీశ్వరుండు. 114

వ. అట్లు ప్రత్యక్షమైన మహాదేవుంగాంచి హర్షపులకితగాత్రుండై గౌతముండు. 115

సీ. గౌరీకళత్రాయ గాంగేయజనకాయ
భవనాశకాయ తుభ్యంనమోఽస్తు
పంచాక్షరీమంత్రపారాయణ హితాయ
ఫణిభూషణాయ తుభ్యంనమోఽస్తు

కాలకాలాయ విషకలుషాయ శర్వాయ
భక్తేష్టదాయ తుభ్యంనమోఽస్తు
దక్షాధ్వరహరాయ త్రైలోక్యనాథాయ
భద్రాత్మకాయ తుభ్యంనమోఽస్తు
తే. గీ. పతితజనపావనాయ తుభ్యంనమోఽస్తు
ఫాలతలలోచనాయ తుభ్యంనమోఽస్తు
భంజితపురాసురాయ తుభ్యంనమోఽస్తు
పర్వతగుహాలయాయ తుభ్యంనమోఽస్తు. 116

వ. ఇట్లు పలువిధమ్ముల నుతించి బద్ధాంజలిపుటుండై యెదుట నిలువం
బడి యున్న యమ్మునిని నాదరించి పన్నగభూషణుండు. 117

ఉ. ఏమి మనంబునం దలఁచి యిట్లు తపం బొనరించుచుంటి ని
ష్కాముఁడ వీ వెఱుంగుదును క్షామపుఁ బీడకు నోడి గ్రామముల్
గ్రామము లేగుదెంచి నిను గ్రాసముకోసర మాశ్రయింపఁ ద
క్షేమము నిర్వహించిన ప్రతిశ్రవుండవు నిన్నెఱుంగుదున్. 118

వ. ఇట్టి నీకు నేరిపలనఁగాని కాఁదగు ప్రయోజనం బొండుండదు.
"ప్రయోజన మనుద్దిశ్య నమందోఽపిప్రవర్తతే" యనుటంజేసి నీకేమి
కావలయు నని ప్రశ్నింపవలసె నావుడు గౌతముండు. 119

కం. ఎచ్చటనుండియొ మదిగో
విచ్చటికొక్కండువచ్చి యెలతలతలగ
బెచ్చుపెరుఁగు సస్యములోఁ
జొచ్చి తినుచునుండె నంతఁజూచితి నేనున్. 120

వ. చూచి ఫలోన్ముఖంబగు సస్యంబు త్రొక్కిపాడుచేయుచున్నదిగదా
యని చిఱుమోదుగుమండతో మెల్లఁగఁదాడించితి. వెంటనే యది
బిట్టుగానార్చి యాకేదారంబుననపడి మడిసె. దీనికి నాంతరంగిక
కారణం బేదేనియుండినను నయ్యది సర్వజ్ఞునకు నీకు గోచరింప
వలయునేకాని కించిజ్ఞుండనగు నాకు గోచరించునది కాదనివెండియు.

తే. గీ. "కాకతాళీయము" గ నాకుఁగలిగె గోవు
మృతికిఁగారణత్వంబది యీశ్వరేశ!
తావకశిరస్థితం బతిపావనంబు
గంగ యిద్దానిపైఁ బొదలంగనిమ్ము. 122

మ. ఇదివ్యాజంబుగ దేశమియ్యది జలంబెచ్చోటవాపీసరః
ప్రదమౌటన్ సుఖమందుఁగాక పతితత్వంబున్ బెడంబాపు పు
ణ్యదముల్ తీర్థము లొప్పుఁగాక భవదీయంబౌ కటాక్షంబు దే
శదురాపత్తులనెల్ల బాపుత ముమేశా! సర్వలోకేశ్వరా. 123

వ. ఇట్లు ప్రార్థించుటయుఁ బరమేశ్వరుండు సర్వజ్ఞుండుగావున గతంబు సర్వంబు నాత్మనెఱింగి పరమేశ్వరియొనర్చిన మాయ లోకోపకారకం బగుటకు సంతసించుచు నట్లయగుంగాక యని గంగనొసంగి యాప్రవాహంబునకు గౌతమి యనునామం బిడియె. నయ్యది మఱి కొందఱు గౌతమునడిగి కైకొనిరి. వైనతేయుండుమాత్ర మట్లడు గక తన్కరించి తుదకుఁ దప్పునొప్పికొని క్షమాపణంబు చెప్పి తాఁ గైకొన్నవాహినికిఁగూడ బాపహరత్వంబు సంపాదించె నియ్యది గౌతమ్యవతరణం బను పుణ్యచరిత్రంబు దీని పఠనశ్రవణాదు లాయు రారోగ్యభాగ్యాద్యనేకశ్రేయస్కరంబులని సూతుండు శౌనకాదిమునివ లకు వాక్రుచ్చె. 124

కం. దేవా! యావత్తైలం
తావద్వ్యాఖ్యయెటులేని దైవతమగు నీ
సేవలభియించె నిది మ
ద్భావమునకు సంతసంబు ప్రబలించె శివా!

శ్రీ గాయత్రీ మహిమ

సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# శ్రీ శివజ్ఞానదానమహిమ



వ. శ్రీవిజయవాటీనగరపరిసరస్థితపర్వతనిత్యనివాసా ! కృత్తివాసా ! శ్రీమత్కనకదుర్గాసనాథా ! మల్లికార్జునదేవా ? అవధరింపు మనంత శౌనకాదులు సూతుంగని యిట్లనిరి. 1

కం. చెప్పితివి పలువిశేషము
లెప్పటివో పుణ్యగాథ లెలమిఁదడవి వి
న్నెప్పటికి మఱపఁజాల మిఁ
కిప్పుడు చనవుంటఁజేసి యెదియేనడుగన్.

వ. మనంబు కుతూహలపడుచున్నయది తపమ్ములు పలువిధమ్ములు గదా ! అందు దానమ్ముగూడ నొక్కండని శ్రుతి చెప్పుచున్నది. దానంబు ద్రవ్యసాధ్యంబు ద్రవ్యార్జనం బెంతజాగ రూకతగా నొనర్చినను బాతకదూరంబుగ నుండఁజాలదు అక్కృతనఁ దపో ధనులగు మాబోట్లయ్యెడ విముఖులుగా నుంటయే శ్రేయంబు కాదని ధనార్జనంబునకుం గడంగితిమో పాపంబుగూడ గడింపక తప్పదని మఱియును. 3

శా. ఆపక్షంబున దానరూపము తపం బస్మాదృశుల్ సల్పుటే
లా ! ప్రాప్తించు ధనాఢ్యు లాతపముసల్పన్ శక్తులేకాని యా
శ్రీపూర్ణుల్ సువివేకు లౌటరుదుగాఁ జేకూరుటఁ ద్రవ్య మె
ట్లోపోవున్ దుదకీతపం బెవరికెట్టుల్ సిద్ధమౌనో ! కదే ! 4

వ. "ఋతంతప" యను నమువాకము నందున్న తపోవిశేషంబులలో నీ దాన రూపంబగు తప మ్మెన్నివిధాలఁ జూచినను మా కసాధ్యం

బుగాఁ గన్పట్టుచున్న దనుముచులకు సూతుం డిట్లు వక్కాణింపం దొడంగె 5

కం. అడిగితిరి మంచిప్రశ్నము
నుడివెద నా యెఱిఁగినంత నూతన మీ రి
ప్డడిగినది దానతప మె
ప్పుడుఁ జేయుచునున్న మీ కిపుడుకొంకేలా। 6

కం. అతిథులఁ దన్పుట లేదో
సతతము విద్యార్థిజనుల సాఁకుటలేదో।
మతిమత్త నొసఁగి; మీ రీ
యితికర్తవ్యమున లోఁగ రేదాతలకున్. 7

వ. "నాన్నోదకసమందాన" మనుటంజేసి యేసువర్ణాది దానంబులును నన్నదానంబునకు దీటుగామి తెల్లంబ. మీరు నీవారాన్నభక్షకులు కందమూలఫలపర్ణాశనులు నగుటంజేసి మీకున్న యన్నంబును మీ రతిథులకిడక భక్షింపరు. అన్నంబన। శాల్యోదనమే కావి తదితరంబు కాదనవలనుగాదు. 8

కం. జ్ఞాతలు మీరలు వేదా
ర్థతలు మీకెఱుకపడని దేదిగలదు। తా
భూతగణ మేదితిను నది
యేఁగు నన్నమనిచెప్ప నిటు శ్రుతివలుకున్. 9

తే. గీ. "ఆద్యతేఽత్తిచ భూతాని" యనెడిశ్రుతి య
పూర్వమే। మీకు. మీ రన్నమును నొసంగు
దాతలనుటకు నొందేమి। తదవవలయు
జ్ఞానదాతృత్వ మధికమ్ము గలదుమీకు. 10

కం దశదానంబులు మఱి షో
డశదానంబులును నొక్కటంబెట్టి కలా

ర్ధిశతంబున కీరిదు జ్ఞా
నశకల మొక్కంటఁ బెట్టినఁ సరిపడునే? 11

తే. గీ. అక్కతనఁగాదె। తనకు దేహమ్ము విడిన
తల్లిదండ్రులకన్న శతగుణ మెచ్చు
జ్ఞానమిచ్చిన గురువని ఖండితముగఁ
బలుకుచుండ్రు భవాదృశుల్ పరమమునులు. 12

కం. జ్ఞానము లనేకవిధములు
గా నుండెడి నందు శివునిఁగనుఁగొనియెడి వి
జ్ఞానము నొసఁగిన గురువరు
తో నెవ్వరుసాటి యని బుధులనరుమౌనుల్. 13

వ. ఇట్లు నొడువుచున్న సూతునింగాంచి యన్నదానముంగూర్చియింతను గొందొక విపులమ్ముగవ్యాకరించి పదంపడి జ్ఞానదానమహిమను వ్యాకరింపఁ గోరెదమనవుడు నట్లయగుంగా కేమియని యిట్లు వక్కాణింపందొడంగె. 14

తే. గీ. అన్నదానమునకు జాతి యనుచులేదు
"వేళపాళలు" లేవు దయాళువగుచు
నెవ్వఁ డాకొన్నవానికే యిడి తరింప
వచ్చుఁ దత్ఫలము వచింపవశమెనాకు. 15

కం. కలఁడొక్క బ్రాహ్మణుం డా
యలఘుం డన్నప్రదాత యతఁడొకమాలఁ
గలమాన్నమిడి భరించి య
తులమగు సుకృతమ్ము గొనె బుధులవినుఁడతవిఁ. 16

వ. ఒక్క వర్షకాలంబున నీయింటిమీఁది కాకం బాయింటిమీఁదికిఁ జన నలవిగాని గతి నొక్కనాఁడు దివారాత్రంబులు సంతతధారావృష్టిగా ముసురుపట్టి కొండలనుండి దిగిమెడి పెలయేళ్ళు నలుదెస లాక్ర

మించుతఱి నాబ్రాహ్మణుఁ డున్నయూరికి నేయూరినుండియో పయ
నమై వచ్చు నొక్కశ్వపచుండు గ్రామమ్మదరినున్న సెలయేరుపొంగి
పాముమీసము తెగవేయు విధమ్మునఁ బ్రవహించుచున్నకతన దానిం
దరింపఁ జాలక దాయవ్వలిదరిఁ జిక్కికొనునంత లోకబంధుండు
గ్రుంకెఁ జీఁకటి సర్వత్ర వ్యాపించె మఱియు. 17

చ. శ్వపచుఁడు నిల్చునచ్చోటును జాం జలప్లుతమౌచునిండి గొం
తుపొదవు ముంచుచొప్పు మదిఁదోఁచి భయంబగుచుండె నట్టిచో
శ్వపచుఁడు కేకపెట్టుచును బ్రాణభయంబున నుండె భూవిలిం
పపతికి నార్తనాద మదివచ్చి చెవింబడె నర్థయామినిన్. 18

వ. వానికేక నిశ్శబ్దంబగు నిశీథవేళ యగుటంజేసి యాయేటియొద్దునం
గల మేడపైఁబన్నుండిన యా గృహమేధికి నిరతాన్నదాన దీక్షాపరు
నకు విస్పష్టంబుగా వినసై వాఁడు నికృష్టజాతి యని గ్రహించి
యన్నంబును వ్యంజనంబులు మాత్రమకాక తజ్జాతి కవశ్యము గావ
లసిన ధూమపత్రంబుశలాకను నగ్గికోఁగూడిన తూటకట్టంగూడఁ
గైకొని యొకతెప్పపై తానీఁదుచు వానికై యింకొకతెప్పను నడుము
నకుఁగట్టుకొని సాహసించి యేఱుదాఁటి వానికాతెప్పనిచ్చి దాని
మీఁదనే కుడువంబెట్టి యనంతరం బీవలియొద్దునకు భద్రంబుగాఁ
జేర్చెఁ బదంపడి జరిగిన చరితంబు వినుండు ప్రస్తుతమీకథయింతతో
ముగిసినట్లున్నను ముగియలేదు. 19

కం. అ యగ్రహారముండిన
దేయెడ నానేల నేలు నేలికకొమిరెకా
బాయక యొక బ్రహ్మగ్రహ
మాయాసము పెట్టుచుండె నతిఘోరముగన్. 20

ఆ. వె. పెద్దపెద్దమంత్రవేత్తలు మంత్రించి
చెంపపెట్లు దిని సహింపలేక

యింటిమొగమువట్టి యేగుచునుండిరి
గద్దుగ్రహము నెవ్వ రడ్డగలరు. 21

వ. మహారాజున కేమియుండోపక యెక్కడెక్కడికి నాప్తుల నంపి మాంత్రికుల రప్పించుమందె నందొక్క మహామంత్రవేత్త కించుక లోగి యా బొమ్మరక్కసి యిట్లనియె. 22

చ కలరిల నెందఱో బుధులు కల్గిననేమి । భవత్సమానులే
వలననులేరు మాంత్రికులు వహ్వారె । నీదగుశక్తి మెచ్చెదన్
గొలిపెనునాకు నక్కఁతనఁ గొందొక నీకవకాశ మిచ్చితిన్
నలుపుము నాదునానతి వెసన్ జనుదెంతుఁ గుమారి వీడుచున్. 23

కం. కలఁడొక్క బ్రాహ్మణుఁడు భూ
తలపతియేల్పడినె యతవిధామం బతఁడి
మ్ముల మాలవిఁబూజించిన
ఫలితంబది ధారవోయవలయున్నాకున్. 24

వ. అట్లు మీతేఁడు నలుపనేర్చిన యుత్తరక్షణమంద నేను మీ రాకొమి రెను వదలిపోఁగలను ఆ యన్నదాన సుకృతంబు నాకిఘోరజన్మ విముక్తికిఁ గారణంబగు నా పుణ్యాత్ముని యూరిపేరది, యింటి పేరిది యని సకలమ్మును విస్పష్టంబుగాఁజెప్పి వెండియు నెక్క పక్కెమ్ముగా. 25

ఉ. నీదగు లింగకాయయును నీ రుదురాకలు మేనువిండు నీ
బూదెమెఱుంగుఁ గుంకుమపుబొట్టును నీదగు మంత్రతంత్రముల్
నాదెస లేశముం బవినొనర్పగనేరవు తేవి విప్పుదే
ఆ దెస కంపి యయ్యనఘు నాదృతిఁ బిల్చిన భద్రమబ్బెడిన్. 26

కం. నీయందలి దయకల్మిఁజూ
మీ । యానతి యిచ్చుచుంటివిటు లేమాయో

పాయములు మిముఁ గృతార్థులఁ
జేయవు నాదరికిరావు చెప్పితివింతే. 27

వ. నావుడు రాజేంద్రుం డమ్మహనీయుండు తనరాజ్యమ్మున నుంటం జేసి ధన్యుండనైతి నని సంతసించుచు నా బమ్మరక్కసికి వినతుండై యామహనీయుం డెండఁకో యన్నం బిడువాఁడయి యుండుఁగదా మూలవికిడిన యన్నదానపుఁబున్నెమును మిన్నగాఁజేసి కోరినకారణంబు వినపలఁతు నావుడు, దేశకాలపాత్రాదికంబు సకలంబును వివరించి నాపాపంబు దొలఁగించుటకు నదితప్ప వేఱొండేదియు సమర్థంబు గానేరదని ఖండితమ్ముగా నొడివె. ననంతరంబు ఆఁడాయగ్రహారమ్మునకుంజని వినతుండగుచు నా బ్రాహ్మణపుంగవు ద్వారమ్మున కరుదెంచుటవిని యాగృహమేధి. 28

ఉ. ఎందుల కేగుదెంచెనొకో । యెన్నఁడురాని నృపాలుఁ డింటికం చుం దలఁ పెన్నియో వగలజోగుచు నూఁగుచుఁ గంపమంద రాజేందుని ముందుకేగి కడునెక్కుడు గౌరవ మాచరించి సం క్రందనతుల్యులీరు ననుఁరమ్మన రానొకొ । మీరువత్తురే । 29

తే. గీ. ఎంత యపచారమయ్యె నేనెఱిఁగి చేసి
నట్టి తప్పిద మిదిగామి యరసి నను క్ష
మింపఁగావలెఁ గాకిచేనేనిఁజాలు
గబురుచేసిన నేను రాకతడయుదునె । 30

వ. ఇట్లు వినయం బనయమ్ముఁ బెనంగొన సగద్గదంబుగా నేమిముప్పు మూఁడెనో యను భయమ్ముతో విన్నవించు నావిప్రపుంగవుని పాదమ్ములకు మణిమయకిరీటభాస్వరంబగు తనశిర్షంబుసోఁక మ్రొక్కి రాజేంద్రుండు తనవచ్చిన కార్యంబు మెల్లన నివేదించుటయు నా విరతాన్నదాత కొంతవడికి నాఁటివిశిధంపువేళఁ దానొనర్చిన యన్నదానంబు జ్ఞప్తికిం దెచ్చికొని యిట్లను. 31

కం. మీపూర్వులిడినదే మా
కీపల్లియయగ్రహార మే నెవ్వఁడ మే
మే పుణ్య మెపుడుచేసిన
నా పుణ్యము మీదికాక యదిమాయదియే। 32

వ. అని సవినయమ్ముగఁబలికి యయ్యవనీంద్రుతో సగౌరవంబుగఁ గోట కుంజని రాకొమిరె నాశ్రయించి వేధించు నాబ్రహ్మరాక్షసికి నాపుణ్యంబు ధారవోసి రాజేంద్రునివలన నేవిధమగు ప్రతిఫలముంగొనక యనుజ్ఞను మాత్రముగొని యయ్యలఘుండు తనయగ్రహారమ్మునకుం జనియె. బ్రహ్మరాక్షసి రాకొమిరెనువీడి తత్పుణ్యంబుకతంబున నా పాపిష్ఠజన్మముం దొరఁగి యుత్తమగతినందె రాకొమిరెయు సుఖంబుండె. 33

కం. ఆయీ యుదంతమును విని
శ్రీయుతుఁ డింకొక్కతేఁడు శ్రీగలుగుటకా
ధీయుతు సన్మానించుచె
శ్రేయం బనిపంపె మంతిరిని ద్విజుకడుకుఁగా. 34

వ. అట్లుపంపి సగౌరవంబుగఁ దన యాస్థానమ్మునకు రప్పించి. 35

కం. నీవంటి సుకృతపుంజం
బేవిభు దేశమ్మున వసియించు నతఁడె పు
ణ్యావాలమ్మని యిచ్చెం
గోవిదుఁ డొకయూరు పేర్మి కొమరారంగన్. 36

తే. గీ. అన్ని దానమ్ములను మిన్న యన్నదాన
మదియు దేశకాలమ్ముల ననుసరించి
పాత్రమునుబట్టి చేసిన బహుఫలప్ర
దమ్ము గాఁగల దెఱుఁగుఁడు తపసులార। 37

వ. ప్రతిదానంబునకును దేశకాలపాత్రమ్ములు విశిష్టత్వమ్మును గలిగించు చుండు విఁక జ్ఞానదానంబునుగూర్చియు నందును శివజ్ఞానదానమహిమను గూర్చియు వక్కాణింతు నాలింపుఁడు. 38

ఉ. పుట్టిన దెక్కటమ్మననొ ! పుట్టువులేక తరింపుత్రోవ చే
పట్టునుపాయమెద్దియొ ! యపారపుసంసృతి నెల్లయప్పుడున్
గట్టునుబట్టకుండుటకుఁ గారణమెద్దియొ ! తెల్పునట్టి మేల్
గుట్టు నెఱుంగు సాధనము కోవిదసేవయె వేఱులేదిఁక౯. 39

వ. అట్టి విజ్ఞానులశుశ్రూష బహుజన్మకృతతపఃపరిపాకమ్ముకతనంగాని లభింపదు. జ్ఞానంబన్నను విద్యయన్నను నొక్కటియే విద్యకు రెండే సాధనంబులు అందొక తరగతివి పుస్తకంబులు రెండవతరగతి సాధనంబులు పండితులు. ఒకచోరుం డొకబ్రాహ్మణునకు నొకపొత్తము శివమహిమం దెలుపుదాని నిచ్చి తత్పుణ్యంబునంజేసి తరించె నాకథ సావధానంబుగ నాలింపుఁడు. 40

చ. కలఁడొకబ్రాహ్మణుండు గదుఁకర్మఠుఁ డాగమవేది రిక్తుఁడై
కలికి భయంబుచెంది యెదిగాని యొనర్పఁడు వృత్తి మేటి రా
జులు తనుఁబిల్వనంపినను జూడఁడు వారలవంక నెల్లశి
ష్యులు దనవెంటరాఁ దిరుగు జోలిపిగై కొవి బిచ్చముగా౯గొనున్. 41

సీ. పండితుండని హెచ్చుతండులమ్ము లొసంగఁ
గొంచెమే కొనుఁగాని కొనఁడుహెచ్చు
భూదానగోదానముల నొసంగెదమన్న
నాకునెందులకం చనాదరించు
బియ్యమ్ములో మేల్మిపెట్టి ముష్టిగఁ బెట్టఁ
గనిపెట్టి యది వారికడకుఁ జేర్చు
నెదితిన్నఁబోవు నీహేయంపుఁగాయాన
కెందుకో ! మెఱుఁగులం చెదఁదలంచు

తే. గీ. నెపుడు సన్న్యసిసగుట సంస్కృతివివిదివి
యనుచు మాటిమాటికి నెంచుఁదనమనమునఁ
జిన్ననాఁటఁ బెండ్లాడినవేదె కార
ణమ్మున నతండువిల్చె గేహమ్మునందు. 42

వ. ఇట్లసిధారావ్రతంబుగ నెల్లపుడు నొకచే యూరయినచో నందలిగేస్తులకు భారమ్ముగాఁదోఁచు ననెడిసంకోచమ్మునంజేసి తనయూరికి జుట్టుపట్టులనుండు నూళ్ళకుంగూడ బిచ్చమునకు జనుచుఁ "బంచమేఽహని షష్ఠేవా" యను శ్లోకార్థంబునకుఁ బ్రథమోదాహరణంబై కాలంబుగడపు నా సర్లిప్తున కనుగుణగుణాఢ్యయగు భార్యకూడఁ దటస్థించుటంజేసి యేలోపమ్మునులేక—"మనసిచపరితృప్తేకోఽర్థవాన్కోదరిద్రః" అను వడువునఁ గాలయాపనంబు జరుగుచుండె నంతఁ గొంతకాలమ్మునకు. 43

మ. ఒకచోరుం దెదురాయెనాయన కెదోయూరేగి భిక్షాటనం
బుకశానంగొనితండులమ్ములు గృహమ్ముం జేరుమార్గాన నం
తకువింటోలెడివాని భీతిమది నీతం దేటికింబొందు "దొం
గకు మిందం దెవఁడన్న రిక్తుఁ" డనుటల్ గాదంచనన్ శక్యమేః

వ. అంతకుమున్ను వానిదుండగములు కర్ణాకర్ణికగా విన్నవాఁడగుటంజేసి వాఁడు తనయొద్దనున్న తండులమ్ములుగొని యంతంబోక దుర్నయంబుకతనఁ దన్నుఁగొట్టి బాధించునేమోయని కొండొక భయమ్ము గ్రమ్మునను, శివుని యాజ్ఞలేక చీమయేనిగుట్ట దనెడి యభియుక్తోక్తి జ్ఞప్తికిందవిలి కొండొకధైర్యం బొసంగఁ దనత్రోవనుఁ దాఁ జనుచుండె నంతనాచోరుండు తన శిరమ్మునందలి మూటబరువై యొకచెట్టునీడఁ బడవైచి మరల నెత్తికెత్తికొనుటకు సాయమ్ము నపేక్షించువాఁడగుటంజేసి కొండొక ప్రక్కమార్గమునఁ జూపుమేరలో నరుగు నీబ్రాహ్మణు నిటురమ్మని బిగ్గరగాఁ బిల్చుటయు

నాయవారపు తండులమ్ములువినాగా వేఱుసొత్తు లేశమును దన యొద్ద లేనియమ్మహీతుండు వాఁడున్న చెట్టుదరికినేగి నిల్చుటయు నాదస్యుండు. 45

కం. సురిఁగియిటునటును దుసికిలి
జరిగిన యమ్మూటఁజూపి సరిగా నదిక్ర
మ్మఱ బిగియించి యిదుము నా
శిరమున కనిపలికె విప్రశేఖరుఁ డంతన్. 46

వ. వాఁడు తనవలన సుప్రసన్నుండుగా నుండుటకు సంతసించి యమ్మూటవిప్పి కట్టునెడ నందొక తాటియాకుల సంపుటమ్ము గను పట్టుటయు నదిగూడ యథాపూర్వమ్ముగా సవరించి కట్టునప్పు డందున్న విషయం బెట్టిదియో ? యనుతలంపున దృష్టినించి తిల కింపందొడంగె నంత నా చోరుండు. 47

చ. వలసిన నీవుదానిఁ గొనవచ్చును దక్కినమూట గట్టిగాఁ
దలపయిఁ జక్కనిల్పెదివిధమ్మునఁ గట్టుము జాలమేల । వి
ప్రులయిలు దోఁచికోఁజనినఁ బొత్తముదక్క మఱేమిచిక్కు ని
మ్ముల నదినీవు కైకొనుము మూట శిరమ్మునకెత్తు ముత్తమా । 48

వ. భావియోగమ్ముకతన నాపొత్తమ్మ బ్రాహ్మణోత్తమున కిచ్చి యాయనచే మ్మూటనెత్తికెత్తించికొని చోరుండు యథేచ్ఛఁజనియె. 49

ఉ. పాఱుఁడు పొత్తముంగొని యపారముదంబున "వీఁడు దేవుఁడే
చోరుఁడుగాఁడు దీనియెడ శూలికిఁజెందిన గాథలెన్నియో
యూరయఁగాఁ గనంబడెడి యందముఁజందము గోచరించె విం
పారఁగ నొక్కపత్త్రమునయందలి సూచిక చూచినంతనే. 50

ఆ. వె. ఎవరియింటఁ బొత్త మిదిచిక్కెనో । వీని
కిల్లారు పండితాగ్రగణ్యు

లెంతకష్టమోర్చి యిది వ్రాసికొనిరొ వా
రెఱుకపడిన వారికిత్తుఁబిదప. 51

వ. దొంగవాఁడిచ్చిన పదార్థంబుచేకొని యాత్మసాత్కరించుటకును దొం
గరికమ్మునకును నెంతో యంతరంబుండదు. ఇట్లు తనమనంబునఁ
దనకద్దానికతనఁ బాపంబంటకుండు నుపాయమ్ముఁ జింతించుచుఁ
గుతపవేళకు నింటికింజని దేవతార్చనంబు ముగించుకొని భుజించి
యాపొత్తమ్మునందున్న విశేషమ్ములు సవిమర్శమ్ముగాఁ బరిశీలించు
టయు నందు. 52

కం. సకలము శివమయమని శివు
నకు వెలియగు వస్తువెటఁ గనంబడదని బి
ల్వకుజము శివునకుఁ గైలా
సకుధరమంతటి ముదంబొసఁగునని యుండెన్. 53

కం. ఇతరవిలింపులు శివునిస
వతు గారని యెల్లరకును వరములొసఁగి బి
కృతులనొ భూపతులనొ వా
కృతులనొ। చేయంగలాఁడు భవుఁడని యుండెన్. 54

వ. ఆమహావిద్వాంసుం డాగ్రంథమ్మునందలి విశేషమ్ములన్నియుఁ దిల
కించి పెన్నిధిగన్న పేదచందమ్మున నానందించుచుఁ దాను శిష్యు
లును నా గంథమ్ముసు గతిపయవాసరమ్ములలో సమగ్రముగ నొం
దొకతిగా వ్రాసికొని యందున్న పేరుకతన నయ్యది యెవ్వరిదో
తెలియుటంజేసి పదంపడి వారల కాపొత్తమ్మును ముట్టఁజెప్పి
"అయ్యా। మీ సమ్మతిఁ గైకొనకుండ మీ పొత్తమ్ముమబట్టి వేఱొక
ప్రతి వ్రాసికొన్న నా లౌల్యంబు క్షమింపవలయు"నని విన్నవించు
టయు ది. 55

ఉ. తాతల కిచ్చినారు మునుతాతలు వారది మాకుదాఁచి స
ర్వాతిగమైన విత్తముగ నారసికొండవి యిచ్చియుండి రె
ట్లో తటివేచి దొంగలు చటుక్కునఁ గన్నముపెట్టి యేదియున్
జేతికినంక కిద్దిగొని చేసి రపాకృతి మాకుఁదద్దయున్. 56

వ. వంశపరంపరగ మాత్రమకాక శిష్యపరంపరగాసైతము ప్రేమింపఁ దగు నీధనంబు మరల మీవలన మాకు దక్కెనది యని సంతసించి యంతట విరమింపక దీపమువలన మఱియొక దీపంబునట్లు మీరు వేఱొకప్రతి లిఖించుకొనుటవలన మాగ్రంధమ్మున కేవిధమైన యపకారమును గలుగదని ప్రియవాక్యమ్ములాడి యభినందించిరి. 57

తే. గీ. పదపడి యతండు దానిలోఁ బొదలు ధర్మ
ములను దనయింటి యరుగుఁపైఁ బలుపురేగి
వినఁ బురాణంబు చెప్పెడివేళ నొక్క
బచ్చు శ్రద్ధగా నెపుడునువచ్చి వినుచు. 58

వ. అమ్మహనీయునియం దెక్కుడు శ్రద్ధాభక్తులుగల్గి వర్తించుచుఁ దనకు భగవంతుఁ డిచ్చినంతలో నేదియో "పత్రం పుష్పం ఫలంతోయ" మని యయ్యనఘునకు సమర్పించి నమస్కరించుచుఁ దనవృత్తియందు న్యాయంబుగాఁ బ్రవర్తించువాఁ డొక్కదినంబున సమీపస్థమ్ముగు పల్లియకు బేహారంబునకుంజని స్వగ్రామమ్మునకుం జనుదెంచు నప్పుడు. 59

చ. వినఁబడె నొక్కనిస్వనము వీనులవిందుగ నద్దికోకిలా
స్వన మనుకొందమన్న నెటు? వర్ణవిభాగము గోచరించె వి
న్వెనుకొవిఎత్తు రమ్మనెదవే? యనువాక్యము బచ్చువీనులం
దునఁబడె వాఁడు భీతిమెయి తొందరగాఁ జనె వింటికెట్టులో. 60

ఆ. వె. వాని నెమ్మనమున "వచ్చెద"నన్నది
దయ్యమనెడి భీతి తట్టుకతన

నయ్యవారి కెఱుకయగుట మంచిదియని
యెఱుఁగఁజేయ నొజ్జ యిట్టులనియె. 61

తే. గీ. భస్మరుద్రాక్షధారివి పరమశైవ
భక్తుఁడవు నీకుఁ బైశాచభయముకలదె।
యెవ్వరవునీవు నావెంటనేలవత్తు
వనుచు నడుగుము భయము రవంతవలదు. 62

వ. ఆవాక్యము నీకూర్ధ్వమునుండి వినఁబడియెనో ప్రక్కలనుండియే
వినఁబడెనో కనిపెట్టితివా। నావుడు వైశ్యుండు. 63

కం. వెనుకఁ బొదరింటిలోనుం
డిన చెలివాక్యం బటంచు నెమ్మదికిఁ దో
ట్టినది వెనుదిరిగి చూతున
విన ధైర్యములేమిఁ జూడనేను మహాత్మా. 64

కం. "గళగళ" మనియందెలసడి
వలనన్ గళవిస్వనంబువలనఁ లలనా
కలనాదంబుగఁ దోఁచిన
దెలనాగయొ। దయ్యమో। మఱింకెయ్యదియో. 65

తే. గీ. బీదవాఁడను బెండ్లముఁబిల్లజెల్ల
లెట్టులో పొట్టఁబోసుక యింటనుంటి
మిట్టి నన్నుఁ బీడించుట కెవతెయో పి
శాచి వేచియుండిన దెట్లుసైఁచువాఁడ. 66

వ. అనుటయు నాబ్రాహ్మణుండునవ్వి నీవు నావిమచుశివకథలు వినుట
శివభక్తి గల్గియుండుట భస్మరుద్రాక్షధారణపరుఁడవగుట శివభక్తుల
నాదరించుట లోనగు గుణంబులు గల్గియుంటచే నీయందుఁ బరమే
శ్వరున కనుగ్రహంబు కలిగి నీకు నైశ్వర్యంబు ప్రసాదింప నెంచె

నవియు వియ్యది దానికి సూచకంబనియు నాయభిప్రాయ మని
వెండియు. 67

కం. శివభక్తి నిర్గుణముగాఁ
ప్రవహించెడినేని ముక్తిఫలమగు సగుణ
ప్రవణుల కైశ్వర్యంబుగా
శివుఁడిచ్చి పరీక్షసేసి శివమిడుఁబిదపన్. 68

వ. శివమన మంగళమగు మంగళము లన్నిటియందును బరమంబగు
మంగళంబు మోక్షంబగుటంజేసి మొదట భక్తున కైశ్వర్యమ్మొసంగి
వాఁడు దానినధిగమించి యుక్తప్రవర్తన కలిగియున్నప్పుడుగాని
మోక్షమ్మున కర్హుండుగాడని యెఱుంగుము. నీవు విశేషజ్ఞానివి
కాకున్నను విశేషధనివి కాకున్నను జన్మాంతర సంస్కారవశంబున
నీకు శివభక్తుల నారాధించుట యలపడినది. శివానుగ్రహసంపాదకం
బులు పెక్కులుపాయములున్నను శివభక్తసమారాధన మన్నిటికన్న
మిన్నయని పురాణమ్ము లుద్ఘోషించు. నీయర్థమ్మునుదెల్పు నితిహా
సంబు కలదు వినుము. 69

కం. కల దొకకులాలకామిని
కులటయది కుశీల దాని కులుకునడకన
వ్వులతళతళ పక్కుల తీ
పులు మేనిబెడంగు శివు విమోహితుఁ జేయున్ 70

తే. గీ. దాని సొబగును గనినచో ధాతసృష్టి
కాదనియు మన్మధుండు నిక్కముగ నన్న
కన్న మిన్నయనెడి పేరు గాంచదలఁచి
తాను సృష్టించెననియు నెదకు స్ఫురించు. 71

కం. అచెలి రోచెలియున్బలె
ధీచాతుర్యంబు మాటతేట సురతవి

ద్యాదాకచకియు గాన
ప్రాచుర్యము గలిగి విటుల వలపించుఁబోరిఁ. 72

సీ. పాడెనా। గంధర్వపాటలాధరల వీ
ణానినాదంబు చిన్నతనమూను
ఆడెనా। రంభాముఖాప్సరోభామినీ
వర్గమెల్లను దలల్వంచుకొనును
కూడెనా। యక్షేశుకొడుకైన ఋణవిము
క్తికిఁ దగ్గనమిచ్చి తేలలేఁడు
పేడెనా। వేదాంతవిద్యావిశేషజ్ఞు
డైనను మాఱుమాటాడలేఁడు
తే. గీ. బోగముకొలమ్మునం దదిపుట్టలేదు
గాని దానికిఁ జాల రేసానులేవి
యెందఱో దాని వలఁజిక్కి నృపులయట్టి
వారలు పకీరులై రోడ్లఁబలుకనేల। 73

కం. కుమ్మరికొలమునఁ బుట్టిన
దమ్మగువ యగుటనా। యేమొ। అ పురువులబలెన్
గొమ్మ చరియించుఁ బూరుషు
నమ్మదు తనపేర్మి వానినంటఁగనీదున్. 74

కం. ఇదియొకటితప్ప వింకవే
ఱెదియును గుమ్మరిది యనెడి యించుకగుర్త
మ్ముదితకడఁ గానరా ద
య్యది మోహినికన్న మిన్న యన్నంజాలున్. 75

వ. దక్షిణకైలాసంబనఁదగు శ్రీకాళహస్తిక్షేత్రం బద్దావి వివాసంబు ఆపట్ట
ణమ్మునఁ బలువురు సంపన్నులున్నను వారియైశ్వర్యంబెల్లఁ గలిసి
యొకతలయు పీకులాలకులట యైశ్వర్యంబొకతలయు నవిచెప్పఁదగి

నంత కలిమితోఁ దులఁదూఁగు నజ్జగవీలిపిసాశిజంతకుఁ బ్రాగ్జన్మ
సంస్కారవశంబున నిట్టి యాలోచన కలిగె 76

ఉ. ఎందఱ మోసపుచ్చితినొ। యెందఱ జోగులఁజేసియుంటినో।
యెందఱు విందపాలగుచు నేగిరొ। నా గృహమేగుదెంచి నా
డెందమెఱుంగు ద్రవ్యము గడిందిగనున్నది లోటులేదు నా
యందముఁజంద మెప్పటికి నాఁగునె। లోఁగక శాశ్వతంబుగన్.77

కం. పరమోత్కృష్టక్షేత్రము
పరమేశుఁడు శివునకిద్ది ప్రాగ్జన్మమునన్
గరముఁ దపించినకతమున
దొరకిన దిటనుండికూడ దురితముతగునే। 78

కం. కృతమేమో। కృతమయ్యెన్
గతమునకున్ జింత సేయఁగా నేల। యికఁన్
సితికంఠు మెప్పునకుఁ బా
త్రత గడియించి తరియింతుఁ దక్కు భవంబున్. 79

వ. అని కొంఁదొక యోజించి. 80

కం. తరియించు మార్గములలో
హరభక్తుల సేవకన్న నన్యమురవుగా
దెఱుకగలవారు బోధిం
తురు దానికతాన నడఁగు దోసములనుచున్. 81

కం. ధనమున్నది చక్కని జ
వ్వనమున్నది యీవ్వయంబువలనఁ దరింపం
గ ఘనపుణ్యము వెదకెద
నవి యాలోచించుచుండె నా చెలిమదిలో. 82

వ. అంత నొక్కశివయోగి నవనవోన్మేషయౌవనుండు సుందరుండు
తీర్థయాత్రలు సేవించుకొనుచు నాదక్షిణకైలాసమ్మునకేగి సువర్ణ

ముఖీతటమ్మునఁ దపం బొనరించుకొనుచుండ నాతని యందచంద
మ్ములు నచ్చి యానెలంత. 83

ఉ. ఈయనఘుఁ వరించితినయేనియు నాదగు పుట్టు సార్థకం
బై యభవుండు మెచ్చికొనునట్టిదియై గతమందొనర్చు పా
పాయుతముల్ నశించి పరమబ్బు విహంబున కుండఁబోదులో
టీయన నాకు వశ్యుఁడగునే నఖిలంబు ఫలించినట్లయా. 84

వ. భగవంతునంతవాఁడు భక్తికి వశుండనిన నిఁకఁ దద్భక్తులంగూర్చి
వచింపనేల। బలిమిచేఁ బాలుగూడఁ ద్రావించుట దుష్కరముగావి
చనువుచే విషమైనఁ ద్రావింపవచ్చునుగదా। యనియెంచి యా
నెలంత యకృత్రిమంబగు భక్తితోఁ గొన్నినాళ్ళు యువకశివ
యోగిని ఫలక్షీరప్రముఖంబులగు నుపాయనంబు లొసంగి సేవించుచుఁ
గొండొక చనవు సంపాదించి యొక్కనాఁడు సాహసించి యిట్లు
విన్నవించె. 85

మ. కలదానఁ ధనమెంతయేనియును భోగంబుల్ మహోద్యానముల్
గలదానన్ శివయోగులన్న యెడ వాలాయంబుగా భక్తియుఁ
గలదాన న్నను దాసిగాఁగొని సదా కాలంబు నాయింట మీ
రెలమింబుచ్చి తరింపఁజేయుటకు మిమ్మే వేడుచుంటింబొరిన్. 86

కం. శివయోగుల సేవించిన
శివుఁడు తనున్నిల్పి పూజసేసినటులె మె
చ్చి వరమ్ములిచ్చు మీరే
శివు లా శివుఁ డెట్లుదొరకు స్త్రీశూద్రులకుఁ. 87

తే. గీ. ఉట్టె కెగురంగనేరవి యట్టివవిత
స్వర్గమున కెట్టు లెగురఁగాఁజాలుఁ గరచ
రణములున్నశివులు మీరు రండు మద్గృ
హమ్మునకుఁ గొందు నాదు దాస్యమ్ము నెమ్మి. 88

వ. ఇట్లకృత్రిమంబగు భక్తితో నమ్మగువ యయ్యోగిని వశపఱచికొని తన యింటికిం గొంపోయి సాక్షాత్కరించిన శివునిగా సకలోపచారంబు లొనర్చి పూజించి పరమేశ్వరుని మెచ్చునకుఁ బాత్రంబై తరియించె ననివిందుము. అయ్యది కులటయయ్యుఁ దుదకు శివభక్తికతన దుర్లభంబగు మోక్షంబునకుఁ బాత్రం బయ్యెఁగదా? నీవు సత్కులోత్పన్నుండవు శివభక్తారాధకుండవును. ఇట్టి నీకు నైహికసుఖప్రదంబగు నైశ్వర్యమును బరమేశ్వరుం డనుగ్రహించుటలో వేమివింత గలదు. కావున నీ యింటికి రానున్నది లక్ష్మిగాని దయ్యమ్మను గియ్యమ్మను గాదుగావునఁ దప్పక రమ్మనిచెప్పు మనవుడు నా వైశ్యుం డందులకు సమ్మతించుచు నా బ్రాహ్మణున కిట్లనియె. 89

తే. గీ. కులట శివయోగియును దగఁ గూడిమాడి
నల్లె మీ మాటలందు వ్యంగ్యముగఁ దోఁచె
నాపె తరియించుఁగాక యయ్యలఘునకు స
మస్తమర్పణఁజేసి శివాత్మబుద్ధి. 90

తే. గీ. వేశ్యకన్న నెన్నియొరెట్లు వృజినవృత్తి
మెలఁగు నద్దాని పొందు విప్కలుషఁ దాతఁ
దొంది శివుని యంగీకృతి నొందఁగలఁడె
సందియం బిదితీర్పు మాశ్చర్య మనఘ! 91

వ. ఈ సందియంబు నీకుమాత్రముకాదు నాకును గల్గుచున్నయది. లోకమ్మున భక్తులందఱికిని విషయయోగ్యులగు గురువులు దొరకరు. గురువులనియు శిష్యులనియుఁ బీఠమ్ములనియు నేర్పడుటకుం గత మెల్లరకును దక్షిణోపాయమ్మకాని వేఱొండుగాదు. శిష్యునిగాఁ జేర్చికొనుట కొఱకై గురుఁడెంత పరీక్షింపవలసియుండునో గురువునుగా వరించుటకు శిష్యుం డంతియ పరీక్షింపవలసియుండు నట్లు పరీ

షించినను శిష్యాభిలషితంబులగు గొనంబులుగలగురువులు లభించుట
దుర్లభంబు. 92

చ. గురువు దురీహుఁడైనను నగున్ మన కేమియుఁ బోదుదానఁ ద
ద్దురితము వానినే చెఱిచి దూరగుఁజేయుఁ బరింబుపట్ల దు
శ్చరితుఁ బతివ్రతల్ పతిని సర్వవిధాలభజించి పొందుచుం
దురుగద! యుత్తమంబులు గతుల్ ప్రకృతంబునుగూడ నట్టిదే. 93

వ. ఇయ్యది నా బుద్ధికిఁదోఁచిన తెఱంగు. ప్రకృతవిషయంబును గూర్చి
యింకను బెద్దలనడిగి తెలిసికొందము. నీవు మరల నా త్రోవనచవి
ఆ విధమైన ధ్వని వినవచ్చినచో నా చెప్పినచొప్పునం బొనర్పు
మనుడు నా కోమటి మరల గ్రామాంతరంబేగి పూర్వపువేళకే
యా మార్గంబున వచ్చుచుండుటయు మరల నదేతీరున వినఁబడియె
నంత నతండు. 94

చ. ఎవరంవునీవు! నా యెదుటికేటికివచ్చివచింప? వేలచా
టవునెదఁ బొంచిపల్కెదు? గృహంబునకుం జనుదేరనున్నదా
నవుగద! కంటి కేటికిఁ గనంబడకుంటివి "చల్ల కేగి ముం
తెవరును దాఁచి"నట్లు విన మేటికి దోఁబుచిదొంగబూచియు౯. 95

వ. అట్లు సధైర్యమ్ముగాఁ దనకుఁ బ్రత్యుత్తరంబిచ్చు నాబచ్చునం దాధన
లక్ష్మికి నెక్కుడలేని యనుగ్రహంబువుట్టి. 96

శా. మేనెల్ల౯ రతనంపుభూషణములన్ మేల్పట్టుఁబుట్టంబులో
కానంగానఁగరాని తీరుఁ బొలుపా కస్తూరికావాసనల్
జానొందంగలసొరుతో మెఱుఁగు లాశాచక్రమువ్నింద ల
క్ష్మీనారీతిలకంబు దర్శనమునిచ్చెన్ వాని మేలెట్టిదో! 97

వ. అట్లు లెదుయెదుటం బొడకట్టిన యమ్మహాలక్ష్మి తేజంబు విద్యుదు
ద్వల్లతలకును మించుటంజేసి యక్కోమటి చూడంజాలక కన్నులు
మూసికొనె. 98

## దండకము.

అమ్మా! మహాలక్ష్మి! లోకంబుసర్వంబు నీయంద వర్తించు నీచూపు లెందుండు వాఁ డెంతనీచాత్ముఁడేయయ్యు లోకోత్తరుండై ప్రకాశించు నందంబుఁ జందంబు శీలంబు నవ్వానియం దంతకుమ్మన్ను లేకున్న నీపాద మేనాఁడు తద్గేహమం దుంతు వానాఁడె యవ్వాని యందున్న యట్లొ మహాపండితుల్ సత్కవీశానులున్ సానులున్ మౌనులున్ గాయనుల్ గాయకుల్ సర్వులు న్వాని సేవింతు రవ్వాని పేరెల్లచో విశ్రుతంబౌను గాసంత దాతృత్వ మవ్వాని యందుండెనా! యింక నవ్వానికిం గీర్తి విస్తారమై విస్తులంటౌ నిహంబున బరంబున్ గనం జేయు నీ యున్కిచే సర్వముంగూడఁ గల్గుఁగా గొఱంతన్నదే యుండఁబో డొక్క సంతానమే కల్గనీవంచు నింగూర్చి దుష్కీర్తి యొంటున్న దెల్లన్సుఖంబిచ్చి యేమమ్మ? సంతీవు? నీకే యపత్యంబు లేదన్న నీభక్తులౌవారి కాభాగ్య మెట్లబ్బు! నీవాసకి న్వాణికి న్నికునుం గడ్పునం గన్న సంతానమున్నట్టు లేగాథలం గానఁగారాదుసూనాస్త్రుఁడుం బ్రహ్మయున్ స్కందుఁడున్ విఘ్నపుండున్ ఋషుల్ గడ్పునం గన్నవారౌదురే! కారుగా! వీరలంబోలు సంతానముల్ నీ కటాక్షచ్ఛటల్ నిండు నవ్వారికిం గన్పడున్ దీనికేమంబరో! వచ్చుచున్నాను నీయింటికంచుం గనుంబిల్చి వాక్రుచ్చి తే ధన్యుఁడ న్నినొ్కకందేను బ్రశ్నించెదన్ వత్త నన్నల్లె నీవేగునవ్వేళ వాక్రుత్తువో? లేదొ! వాక్రుచ్చెదే! తల్లి! నీచైదముల్ నమ్మచో ముప్పగుంగాన నేనిట్లు ప్రశ్నించినా నన్యథా యెంచకే యమ్మ నాకుత్తరం బిత్తఱిం జిత్త మానందముం గాంచెనోయమ్మరో పకిదే మ్రొక్కెదం మ్రొక్కెదన్ మ్రొక్కెదం మ్రొక్కెదన్. 99

వ. ఇట్లు మూసినకన్నులు మూసినట్లుంచి ప్రార్థించు నాబచ్చు పరమేశ్వరి భక్తుం డగుటంజేసి వానికిఁ దనతేజుఁ జూపనెంచి దివ్యదృష్టి నొసఁగి యభయహస్తమ్ముతో నిట్లనియె. 100

కం. తుది నీవడిగిన ప్రశ్నము
మదికి స్మృద మొదవఁజేసె మత్కృప మిగులన్
మదము గలిగించు నవి బెద
రెద పీ విటువంటివిఁ సిరియెటుల్ విడుచుఁ. 101

తే. గీ. ఎవని కిటువంటిబెదరు లే దించుకేని
వానికిఁ సిరియల సన్నిపాతమట్లు
వికృతులకుఁ గారణంబయి వెతలుగుడిపి
తుదకుఁ దానేగు వానివి బ్రదుకనీదు. 102

వ. కొంచటివి బ్రదుకనిచ్చుటయుం గలదుగావి యా బ్రదుకుకన్న శత విధంబుల మరణంబే వరమన్నట్టులుండు నదియట్టులుండె నంపత్కారంబులైన గుణంబులు సంగ్రహమ్ముగాఁ గొన్నిటి వ్రాసుత్తు వీని వివికివలనఁ దదితరంబులు నిప్పచ్చరమ్మునకుఁ గారణంబు లగునవి చెప్పక చెప్పినట్లగు. 103

సీ. దేవతాభక్తి భూదేవతాసక్తి స్నా
నంబు సంధ్యావందనంబు శాంతి
దాంతి పెద్దలయెడఁదద్దయువినయంబు
పితృమాతృభక్తి సుస్త్రియెడ వియతి
మంగళకరములౌ మంచిపదార్థమ్ము
లింటనెల్లెడ నుంచునెలమిగనుట
అర్ధాంగియందు దేహంబునందుంబోలెఁ
దగినంత మరియాద దవిలియుంట

తే. గీ. అతిధిపూజనాసక్తి యభ్యాగతార్చ
సత్యశౌచసదాచారసంగ్రహంబు
మొదలగు గొనమ్ము లెచ్చోటఁ బొదలుచుండుఁ
బొమ్మవినఁబోదు లచ్చి యా యిమ్మువిడిచి. 104

వ. దీనులయెడల నార్తులయెడల రిక్తులయెడల దయగలిగియుండుట, ఆశ్రితపక్షపాతము, నౌకరులయందుఁగరుణ, వృద్ధసేవాసమాదరము లోనగు గొనమ్ములన్నియు లక్ష్మీకరంబులు, కడుంగడుఁ గ్లుప్తీకరించి వచించితి వింకను విట్టి వనేకంబులు గలవు. "అనుక్తమన్యతోగ్రాహ్య" మ్మనుటంజేసి సర్వమ్మును జెప్పవక్కఱలేదని యాపె యంతర్ధినందె, ఆ మఱునాఁటినుండి యా వర్తకుం దేవర్తకం బొనర్చినను వేలపెట్టుఁబడితో లక్షలకొలఁది లాభం బగుపట్టుచుండె నంత నాకృతజ్ఞుండు. 105

సీ. రెండులక్షలువెట్టి శ్రీకంఠునకు నాల
యమ్ము గట్టించె బ్రహ్మాండముగను
వేలకొలందిగా బీదసాదలు తిన
సత్రముల్ వెట్టె విచ్చలురహింప
వేదంబు శాస్త్రంబు విద్యలన్యమ్ములు
పాఠశాలలువిల్పి పాడుకొలిపె
నాత్మీయమౌపంక్తి ననుదినంబును బెక్కు
బందుగుల్ దిన నేరుపాటొనర్చె

తే. గీ. దీపమున్నప్డె మేల్కొంట రేపదెట్టు
లుండునో। మనమెట్టుగా నుండఁగలమొ।
యవి మదిఁదలంచి యా కమలాలయుండు
కోరి ధర్మకార్యమ్ము లెక్కుడుగఁజేసె. 106

వ. తన యైశ్వర్యమ్మునకంతకును దనకు శివమహిమ నుపదేశించి భక్తిమార్గమును బోధించిన యప్పండితుండు కారణంబని యెఱిఁగి యమ్మహనీయుని మహైశ్వర్యసంపన్నుఁగా నొనర్చి యాయనకుఁ జోరునివలన లభించిన తాళపత్రగ్రంథమునకుఁ బాలప్రతులు లిఖింపించి వానినెల్ల నర్హులగు పండితులకు బహుళంబగు దక్షిణలతో

దానంబొనంగి వ్యాపింపఁజేసె. సన్నిదానమ్ములకన్నను విద్యాదానంబు పరమోత్కృష్టంబు. విద్యయన్నను జ్ఞానంబన్నను నొక్కటియేయని మున్నే వివరించి యుంటి ననుడు శౌనకాదులు సూతుంగాంచి యా బ్రాహ్మణునకు శివభక్తి ప్రతిపాదకంబగు గ్రంథమ్ము దొరకుటంజేసి గదా ! యీ యైశ్వర్యమ్మున కంతకుఁ గారణంబయ్యె నా గ్రంథ ప్రదాత కేమేవి యైశ్వర్యంబు పట్టెనే యనుడు సూతుం డిట్లు వక్కాణించె. 107

తే. గీ. ఎప్పు డావిప్రునకుఁ బొత్తమిచ్చెవాఁడు
తత్ప్రభృతి చౌర్యబుద్ధి యంతర్ధినొంది
మూఢభక్తియొకండు శంభునెడఁ గలిగె
నదికతంబున వాఁడు కృతార్థుఁడయ్యె. 108

వ. వాని యవసానకాలమ్మున జమునిదూత లేతేర శివదూతలు వారల వారించి యిట్లనుడు. 109

తే. గీ. పరమదుర్మార్గుఁడగు వీనిఁబట్టి తెండ
టంచు మా ప్రభువిడియె మాకాజ్ఞ మీర
లేల ! మమ్ము వారింతురో ! యెఱుఁగరాదు
పొరఁబడితి రంచుఁదోఁచెడిఁ బొందుపొందు. 110

తే. గీ. ఇట్టి ఘాతుకులెల్లరు మృడుని లోక
మునకు నర్హులగుదురేని మునులు ఘనులు
భక్తులును దాతలును గృపాపరులు నేడ
కేగువారలొ మీరు మాకెఱుఁగఁజెపుఁడ. 111

వ. అని ధిక్కరించి ప్రశ్నించు కాలునిదూతలకుఁ గం తేకాలుని దూత లిట్లనిరి. 112

కం. ఇతఁ డెంతతఱచి చూచినఁ
బతితుం డనుమాట నిజమ పల్కితి రీరల్

సితికంఠుమహిమతో నం
కితమగు పొత్తమ్మును నొసఁగెం దానముగన్. 113

తే. గీ. అకృతమ్మన సమసె నఘౌఘమెల్లఁ
బుణ్యమును సంభవించె శంభుండు వీనిఁ
దనదు సన్నిధికిం దోడికొనఁగరండ
టంచుఁ బంపినవచ్చితి మవలఁజనుఁడు. 114

వ. ఇట్లు శంకరువిదూతలు వచించి వానిని విమానసంగతుంజేసి శంకరు నికటమ్మునకుం గొనిచనుటయు శంకరుండు ప్రమథులతో పాటు వానిం బ్రేమించె నిది శివజ్ఞానదానమహిమంబు దీని శ్రవణపఠన మననాదు లనామయాయుర్భాగ్యకరంబు లని సూతుండు శౌనకాదులకు వక్కాణించె. 115

కం. దేవా! "యావత్తైలం
తావద్వ్యాఖ్య" ముదుకండఁ దావకసేవా
భావుకు నొనర్చితివి నా
కీవొనరించు నుపకృతికి నేమిదుదు? శివా!

శ్రీ శివజ్ఞానదానమహిమ
సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# పరశురామచరిత్ర

కం. శ్రీవాణీశాదిశర
స్సేవితపదపద్మ ! యిందుశేఖర ! త్రిజగ
త్పావన ! దీనావన ! లో
కావన ! కవిజీవ ! మల్లికార్జునదేవా ! 1

వ. అవధరింపు మట్లు పురాణశ్రవణకుతూహలులకు శౌనకాదులకు
మునీశ్వరులకు సూతుం డిట్లు వక్కాణింపఁదొడంగె. 2

తే. గీ. మొదటిరాముఁడు జమదగ్నిమునికొమరుఁడు
శివు నుపాసించి పరశువు చేకొని తన
జనకుఁజంపిన హైహయార్జును నేకాక
క్షత్రియుల నెల్లఁ జంపుచరిత్ర వినుఁడు. 3

తే. గీ. రాముతల్లి రేణుకపయి నా మహాము
నీశ్వరుఁడు జమదగ్నికి హెచ్చుకోప
మంకురించి కుమారుల "నాపెఁజంపుఁ"
డనుచు శాసింప నటు సేయరైరివారు. 4

తే. గీ. ముని పిదపఁ గడగొట్టురాముని వియుక్తుఁ
జేసెఁ దల్లిని నన్నల శిరముఁద్రుంపు
మనుచు జనకాజ్ఞయని యతం డట్లచేసి
తండ్రియాజ్ఞ నిర్వర్తించి ధన్యుఁడయ్యె. 5

కం. తనయాజ్ఞను నిర్వర్తిం
చిన రామునిఁ జిన్నికొమరు శిష్టమునిజనా

గ్రణి జమదగ్ని కనుంగొని
యనియె న్నీకేమివలయు నడుగుము తనయా! 6

కం. తనయా! తనయుఁడవన న
చ్చినవాఁడవునీవె తండ్రిచెప్పిన మాటన్
విని యొనరింపని తనయులఁ
గని యేమిఫలంబు! నిన్నుఁగని కృతినైతిన్. 7

తే. గీ. బ్రతికియున్నప్డు మాటను బాటిచేసి
మృతిగనిన తద్దినమున విస్తృతముగాఁగ
నన్నదానంబొనర్చి గయయెడ విష్ణు
పాదమునఁ బిండమిడినట్టి వాఁడె సుతుఁడు. 8

వ. కావున నీవొనర్చినపని ఘోరంబైనను నాయాజ్ఞను నిర్వర్తించుటం
జేసి నీవలనం బ్రసన్నుండనైతి నీకేమివరంబు గావలయుఁ గోరికొ
మ్మనవుడు రాముండు. 9

కం. జననియు నన్నలు బ్రదుకం
గనున ట్లొనరింపుమనుడు ఘనుఁడు మునీంద్రుం
డనుకంపితుఁడై బ్రదికిం
చెను మును లొనరింపలేని చేఁతయుఁగలదే! 10

కం. రాముఁడు తండ్రిశక్తిని
నామూలాగ్రముగ నెఱిఁగినట్టిఁ డగుటఁదా
నామాడ్కిఁజేసె నేటొకఁ
డామహితుంబోలెఁ జేయుటతిఘోరమయా. 11

ఆ. వె. తండ్రి చెప్పుఁగాక తాతయే చెప్పును
గాక యట్టిపనికిఁ గడఁగరాదు
ఒక్కొకప్డు కోపమునికి చెట్టకుఁదార్పు
మాతృహత్య యదినమంజనంబె! 12

తే. గీ. అట్లు తల్లిని నన్నల నలఘుఁడు జమ
దగ్ని బ్రదికించినను రాముఁ డట్టిచెట్ట
పని యొనర్చిన చేతుల పాపము౽క
సురుఁగ దనియెంచి కుడిచేయి నఱికికొనియె. 13

కం. దానికి జమదగ్ని కడుఁ
దూనమనస్కుఁడయి కొమరు దోశ్శాఖను దాఁ
దోన మొలచున ట్లొనరిచి
సూనుని నాశీర్వదించి సుఖితునిఁజేసెన్. 14

వ. పదంపడి రాముండు తపం బొనరింపనేగిన కొంతకాలమ్మునకు నప్పుడు పరిపాలకులుగానుండు హైహయులు జమదగ్నిహోమ ధేనువు నపహరింపఁగడంగుటయు. 15

ఉ. దాని శరీరలోమము లదభ్రముగా నదలింప మ్లేచ్ఛసం
తానము పెల్లుగాఁబొడమి తత్క్షణ మా నృపసైన్యమున్ లవం
బేనియుఁ బ్రిక్కకుండ వధియించిన హైహయుఁ డర్జునుండు దు
ర్మాని వృథాగఁ దా ననపరాధిని నా జమదగ్నిఁ జంపుడున్ 16

చ. ఇరువదియొక్కసారులు మునీంద్రుకళత్రము రేణుకాంబ తా
నురమునుమోఁదుకొంచుఁదనయుణాగుఱియించి యలోః హాలోః యటం
చఱచుచునేడ్వ నారుదిత మల్లన రాముఁ డెటో యెఱింగి యా
మొఱకుల సంహరించుటకుఁ బూనెఁబ్రతిజ్ఞ మహోగ్రకోపుఁడై. 17

ఆ. వె ప్రతిన వట్టినంతఁ బవినెఱవేఱునే ?
యింటి నలికినంత నెట్లుపండు
గగునటంచుఁదెలిసి యా రాముఁదరిగెఁ బు
రారిఁగూర్చి తపము నాచరింప. 18

ఉ. ఘోరతపంబొనర్చు మునికుంజరుఁ డా జమదగ్ని సూతిపైఁ
గారుణికత్వ ముప్పతిలి కాలగళుం డరుదెంచి నీకు నే

కోరికదీర్ప వచ్చితిని గొంకకదెల్పుము నాఁగ నాతఁడం
బారుచిరార్ధదేహున కపారభక్తి నమస్కరించుచున్. 19

కం. అగమసూత్రంబుల న
య్యాగమవేద్యు నుతియించి యడిగె వరము నాఁ
కిఁగావలె నీపరశువు
భోగివిభూషణ ! యటన్నఁ బురహరుఁ డిడియెన్. 20

చ. అతులపరాక్రముండును మహామహితాత్ముఁడు నైన రాముఁడా
సితిగళుఁడిచ్చు నప్పరశుఁ జేకొని యర్జునివేయుబాహువుల్
ధృతిమెయి నంటికంబములరీతిని ఖండనఁజేసి శీర్షము
ద్ధతి నఱకెన్ గళద్రుధిరధారలు పాఱెస్రవంతులై ధరన్. 21

వ. అట్లాశ్రమమ్మున నఱకి యచ్చటంగల క్షత్రియవీరులం గాంచి
వెండియు. 23

ఉ. రాముఁడుగాఁడరే! పరశురాముఁడువీఁ డిఁకరండు దుర్జన
గ్రామణులార! మీరలును క్షత్రియులొక్కొ ! విరాగసున్ మునిన్
నేమముపూని కన్మొగిచి నిశ్చలుఁడై తప మాచరించు ని
ష్కామువిఁ జంపికూడ బ్రదుకం దలపెట్టితి రెట్లుసైచెదన్. 23

కం. గొఱిగించుకొనుఁడు మీసలు
పరదారాసక్తులగుచుఁ బరమెఱుఁగని మీ
దురితోత్కరమెల్లను మ
త్పరశువు దెగనఱకుఁగాక బ్రదికెదరె ! యిఁకన్. 24

ఉ. రాముఁడుగాఁడు చెప్పెడిది రామునిచేఁగల యాయుధంబు మీ
కీ మదమెందుకెక్కినదొ ! యింకఁగఁజేయకతప్ప దీపయిన్
భూమి యరాజకంబగుత భూసురులేలికలౌత మాఁడువాం
డ్రై మననెంతురేని మనుఁ డన్య ముపాయములేదు మీకిఁకన్. 25

ఉ. పాఱులనంగ నాయుధము పట్టరటంచుఁదలంచి మీసముల్
బారెఁడు వ్రేలుమాకెయను భావముతోఁ గడువిఱ్ఱవీఁగు మీ
పౌరుషమెట్టిదో! శిరలఁబట్టి వధించెద మిమ్ముఁజంపెదన్
నారుల ముండమోపుల నొనర్తు మిముఁ గుఱిచేసియేద్వఁగన్. 26

కం. పుఱిటిఁడ్లుగూడ వెదకెద
నఱకెద మగనిసువు నాకు నగుపడునెడ నె
వ్వరు మిమ్ముఁగాతురో! శివు
పరశువు నెవఁడెఱుఁగఁ డెవఁడువచ్చు నెఱిఁగియున్ 27

మ. అరరే! యెంతటిదుర్మదాంధ్యము! తపమ్మందున్న వృద్ధాత్ము ఘా
సురశీర్షాభరణంబు హోమగవి కీసుంబూని ఉద్ధాత్ములై
నఱకం గేలెటుసాఁగె జ్ఞప్తిగలదే! నాకున్నకోపంబు మీ
పురువు వ్విల్పక చంపినప్పుడుకదా! పోకాలునామూలముల్ 28

మ. పొగరెక్కెంగద క్షత్రజాతి తుదకున్ బోఁగాల మేతెంచి గా
క గొనంబిట్టిది పుట్టునే! యొరుల కేకష్టంబు గల్పింపకా
భగవంతుల్ జపియించుతాపసులపై బాహాబలప్రౌఢిఁ జూ
పఁగ నేయుత్తముఁడొప్పు నక్కటకటా! పాపంబు పండెన్ జుఁడీ.

శా. మీ దౌర్జన్యము మేరమీఱె నవియే మృత్యుంజయుండిచ్చె నా
కీదుష్టాసురమారకాయుధము; నే నిద్దానితో మిమ్ములన్
ఛేదింతున్ బితృతృప్తికై విడిచెదం జేయాఁదద్రక్తమా
హ్లాదంబొప్పఁగఁ దర్పణం బెఱుఁగుడీ అస్మత్ప్రతిజ్ఞోక్తులన్. 30

ఉ. ఎందుకటంచు బ్రాహ్మణు లుపేక్ష వహించుటచేతఁగాని మీ
రుందురె! రాజులై! ద్విజులు హోమముచేయుట నేయిమాత్ర మ
న్కొందురుగాక మీమదము నొందొకనేయిగఁజేసి వేల్చు నా
ముందఱ విల్చువాఁడెవఁడో! మోఱకులార! యిదే వధించెదన్. 31

కం. గుదిగా నిలఁబెట్టి మిముం
బదు లిరువదులుగను మునుముబట్టి వధింపం
బదునుగల పరశువునకుఁ
గుదురుఁ సంతుష్టి గండ్రగొడ్డలిఁగనుడీ. 82

వ. అవి గండ్రగొడ్డలి జళిపించుచు నఱుకనుద్యమించు నప్పరశురాముని యెదుట నిలువనోపక హైహయులెల్లఁ బంచబంగాళమై పులిఁగన్న మేకలచందంబునం బరుగిడఁజొచ్చిరి 33

చ. పరుగిడునట్టి శత్రువులఁబట్టి వధించుటపాడిగా దటం
చెఱిఁగియు రాముఁ డప్పనికి నేవముపూనక దావవహ్నిపై
కుఱుకువిధాన వెంటఁబడి యూడనిఁబాదెడి తేండ్లఁజంపి నె
త్తురుమడుగుల్ పొనర్చె నదిదోసమొ! పున్నెమొ! రెండునౌనొకో!

చ. పితరులఁదృప్తిసేఁత దలపెట్టుట పుణ్యమయయ్యు రక్తమా
కృతికయి వాడుకొంట యది కిల్బిషహేతువు కాకతీర ద
ప్పతితులు దపొ్పనర్చినను భార్గవరాముఁడు సైఁచుటొప్పు వి
ప్రతకు శమం బలంకృతి కృపన్ ద్యజియించినవాఁడు విప్రుఁడే! 35

మ. ఒకదుర్మార్గ మనేకదుష్కృతుల నెట్లో పుట్టఁజేయుఁ గదుఁ
సుకృతాత్మున్ జమదగ్నిఁ జంపుకతనఁ సూనుండు రాముండటుల్
వికృతిఁజెంది యెవండుమెచ్చని యఘావిర్భూతికిన్ మూలమై
సకలక్షత్రకులాంతకుండయి నృశంసప్రాయుఁడై వర్తిలెన్. 36

ఉ. తేవికి నావులే కలవె! రేపుమాపును హవ్యవాహనున్
బూనుచు నావె కావలెనె! భూభుజుఁ డర్జునుఁడేల లోభమున్
బూనవలెన్ సమస్తగుణముల్ చెడు లోభముగల్గుచోటఁ బా
పానకు లోభ మొక్కటియెచాఁ; దదియే కులనాశక మ్మిటఁ. 37

ఉ. ఆవది లోకమందుఁగల యావులవంటిది గాకపోయె దు
ర్జీవివశాత్ముఁ డర్జునుఁడు తేఁకువఁదక్కఁ దదర్థమై మనో

భావము వెల్లడించె నది పాపకత్రృప్తికి హేతువౌటచేఁ
దా విడువందు మౌని యది తన్ను వధింపఁగఁజేసె నీసుతో. 38

ఆ. వె. అది యరాజకత్వ మార్జించెఁబురమికి
నఖిలరాజకులము నట్లుచంపి
యిచ్చె బ్రాహ్మణులకు నేఁడ్యేప్పడి వీర
లేఁగలరె। రాముఁడిచ్చెనేని. 39

ఉ. పాలకతాభరం బనఁగఁ బైపయి నున్నదె : యెన్నియేని పా
పా లొనరించితీరవలెఁ బాలకుఁ డెంతటివిజ్ఞుఁడేని ము
క్కోఁ లిని మూసికొంచుఁ దపమో। జపమో। వొనరించు బ్రాహ్మణుల్
బేలలు శీలవంతులు దపింత్రు జపిం త్రవనిన్ భరింతురే। 40

కం. ఎప్పు డదిసేయనేర్తురొ
తప్పక బ్రాహ్మణ్య మపుడె తముఁ ద్యజియించున్
ము ప్పిట్టిదుండుకతమున
నెప్పుడు నద్దానివంక కేగరువిప్రుల్. 41

వ. అదియునుంగాక. 42

తే. గీ. పరశురాము నంతటివాఁడు పైనిజూచు
చుండఁగఁ బ్రభుత్వమును విప్రులొనరుపంగ
భయపడి కుయుక్తి నొక్కండుపన్ని యతని
వెడలఁగొట్టి రతండు శపించియరిగె. 43

వ. వారుపన్నిన కుయుక్తి తెలుంగు వివరించెద. 44

మ. ధరణీదాన మొనర్చితన్పిన మహాదాతన్ గృతఘ్నుల్ ద్విజుల్
విరసుల్ భార్గవుఁగాంచి లోవివెఱపు వ్విప్పింపకోరామ। యీ
ధర మాకిచ్చియు నీకు నింద వికెటుల్ ధర్మ్యంబగున్ దెల్పు మె
వ్వరుదాతల్ విరేనిమెత్తురెవిమన్ బ్రహ్మస్వ మందుందురే। 45

తే. గీ. విషముబ్రహ్మస్వ మనుమాట వినఁగలేదొ।
వివియు నెఱిఁగియు దీవిని వీడలేక

పట్టి వ్రేలాడుచుంటివో। బ్రాహ్మణీత
నూజుఁదవుగామి తెల్లంబు నూనమింత. 46

కం. "నమమ" యని పల్కుదురు దా
నిమొసంగెడిచట్ల నది తనకుఁగల స్వీయ
త్వముఁ బాఱఁద్రోయు నెఱుఁగవొ।
"నమమ"యని యొసంగవో। యనంత నిడునెదన్. 47

కం. తన స్వత్వముదొలఁచుట యు
న్యనిస్వత్వము జేర్చుటయును నొప్పినయప్పు
ట్టుననే దానంబని చె
ప్పనగు స్నివిదఁగలేదె। బ్రాహ్మణులకటుల్. 48

తే. గీ. దానశబ్దార్థ మెఱిఁగిన ధన్యుఁదెవఁడు
గాని ఆ వస్తు వొరులభుక్త మనుకొనును
తాను నద్దాని భుక్తికి దాత సిద్ధ
పడుట విన మీవెటుల్ సిద్ధపడితివొక్కొ। 49

ఉ. ఈవిడు భూమిదాన మదియావెకొనందగు విచ్చుచుంటి మే
మేవిధినో కుటుంబముల నీఁదుచు ముక్కులుమూసికొందు మా
ర్యా। విను "కానిబాటి కిటులగ్గమి యౌదుముగాక" ఆత్మస
త్తావశమౌటలేని ప్రభుతాపద మేటికి మాకుఁగాల్పనే। 50

కం. స్వాతంత్ర్యములేని ధరా
నేతృత్వముకన్న మున్నె నేమొనరుచు భి
క్షితత్పరతయె మేలుగ
దా। తేఁకువగలుగునట్టి తజ్ఞులెఱుఁగరే। 51

తే. గీ. భూమి నీవుమాకిచ్చినఁ బొంగిమేము
బికిర మెత్తుసంచులు పాఱవేయలేదు

ఉపనయనమునప్పుడు మాకుఁ గృపమెయి గురుఁ
డేదిచెప్పెనొ యది యిప్పు డేదకేగె. 52

కం. పంచమహాపాతకముల
కించుక జంకొాదవనట్టి దృప్తుఁడె రాజై
కాంచనసింహాసనమునఁ
గొంచక కూర్చుండు నీవ కొను మీభూమిన్. 53

కం. ఇచ్చితివి పుచ్చుకొంటిమి
యిచ్చటనేయుంటి మాకు నెవ్వండువినున్
బుచ్చినవక్కయుఁ బన్నని
యిచ్చిన రైతొాకఁడుగాని యిలపైఁ గలఁడే. 54

తే. గీ. గట్టిగా నడుగుటకు నధికారమేది ।
మాకు నీవిక్రైదనె యున్నమాట మఱప
వచ్చునే । నీదు పరశువు బ్రాహ్మణులకుఁ
బుట్టకున్నను భయ మెట్లుపుట్టకుండు. 55

కం. ఎందుకువచ్చినదానము
మందమతుల మగుచుఁగొన్న మమ్మనవలెఁ గా
కిందున్నదె । నీ దోస మ
వింధితచరితుఁడవు నీవు నృపకులశమనా । 56

వ. అదియునుంగాక. 57

తే. గీ. బ్రాహ్మణుండవె జనకువిఁబట్టి నీవు
తల్లిఁబట్టియో । క్షత్రియతల్లజుఁడవు
భూమినేలుట నీకెట్లొ పోలుఁగాక
మాకుఁబోలునె । శుద్ధబ్రాహ్మణులమేము. 58

వ. అని వెండియు. 59

ఉ. పుట్టినదెందుకో ! తెలిసి పున్నెము ప్రోగొనరించుకొంచు నీ
పుట్టువునుండి మోక్షమును బొందెడి విద్దియ నభ్యసించుమా
కెట్టిదిగాని యడ్డు లవమేనియులేక తపించుమాకు నే
చెట్టయొ కూర్చు పాలనము సేయుట యెందుల కోమహామహా ! 60

కం. ఎన్నివిధమ్ములఁ జూచినఁ
గన్నులు పౌరగ్రమ్మి చెఱుపు గలిగించెడి రా
జోన్నతి మాకేటికి ము
న్నున్నట్ల చరింతు మిందు కొప్పుకొనఁగదే 61

తే. గీ. ఇందులోఁ బ్రవేశించితిమేని కుట్ట
లేస్గునెక్కి తిరుగు టొక్కటేఫలంబు
గావి వేదశాస్త్రమ్ములు కదకు శూన్య
ములయి కులము లధోలోకమునకుఁ బోవు. 62

ఉ. ఏనుఁగు లెందఱెక్కి రదియెంతమహోన్నతి ! దోమ లీఁగ లం
దే నివసింపవే ! తఱచహీనతకయ్యదికారణంబె ! వి
జ్ఞానములేమి నప్పదము గైకొన నెంతురుగాక పల్వు రా
త్మానుభవంబు గల్గు ననఘాత్ముల కప్పద మెంతప్రాఁతియా. 63

తే. గీ. ఇంద్రు నంతటివానికి నెప్పుడేమి
ముప్పు మూఁడునో ! యన్ భయమ్ము గఱదన్న
నస్మదాదుల కప్పద మందునునికి
సుఖద మెట్లగు నో మహీసురవరేణ్య ! 64

వ. అవి యంతంబోక. 65

తే. గీ. కార్తవీర్యార్జునుం డెంతఘనుఁ డతం డ
నఘుఁడు మునికి దత్తాత్రేయునకు విధేయ
శిష్యుఁ డాతండు నీ తండ్రి శిష్టుఁజంపి
తానునుం జచ్చెఁ జంపె క్షత్రకులమెల్ల. 66

ఉ. ఇంత యశాశ్వతంబయిన యీపద మెందుకుమాకు ? క్షత్రజా
త్యంతకుఁడైన నీవయిన నయ్యది విల్చెది; విప్పు దోడి కు
ద్ధాంతములందు డాఁగిన నృపాధములే సమయమ్ముఁజూచి మ
మ్మంతము నొందఁజేయుదు రటంచు భయం బుదయించుమామదిన్.

కం. ఎన్నో భయములు గలయది
మన్నినితనంబు తపము మానికొనుచు దీ
వి న్నెఱవేర్పఁగవలయును
మున్నే బ్రాహ్మణులు దీని ముట్టంజనిరే। 68

వ. ఇట్లనేకవిధమ్ముల సంశయంబు ప్రకటించు విప్రుల హృదయం బెఱింగి వారలకుఁ దనయునికి బొత్తిగా గిట్టదని కనిపెట్టి యమ్మహనీయుండు దత్తాపహారదోషమ్మునకు వెఱచి పశ్చిమసముద్రమ్మునఁ గొండొకనేల సముద్రుని బ్రార్థించి యార్జించి యందుఁ దపం బొనరించికొనుచు నివసించె మఱియుఁ దా నివసించుచోటి కేతెంచినివసించిన బ్రాహ్మణులకును నన్యజాతులకును గొన్ని యాచారమ్ము లితరదేశవిలక్షణమ్ము లేర్పఱచె నా యాచారమ్ములు పరశురామస్మృతి యనుపేర నా దేశీయు లాచరించుచుందు రనిచెప్పు సూతుం గాంచి శౌనకాదులు. 69

తే. గీ. పరశురాము నెదిర్చిన బల్లిదుండు
క్షత్రియుల యందులేఁడె యొక్కరుఁడుగూడ
నంతటి మహత్త్వ మతని కెట్లబ్బెనొక్కొ
వినఁ గుతూహల మయ్యెడి వినుచు మనపు। 70

వ. నావుడు సూతుండు. 71

తే. గీ. అతఁడు క్షత్రియజాతి సమస్త మంత
రింపఁజేసి పితరులఁ దరింపఁజేసి

తపసియై వృద్ధుఁడై యున్నతఁడివి భీష్ముఁ
డతని శిష్యుం డతనిగ్రోల నాఁగె నాజి. 72

ఉ. అంతకుమున్నె దాశరథి యాతని కోల్తల కాఁగె నింక క్ష
త్రాంతకుఁడైన యల్ల జమదగ్నితనూభవు నాఁగఁజాలు వాఁ
డెంతగణించినన్ దొరకఁడింకొకరుం డతఁ డచ్యుతాంశజుం
డంతకవైరిశిష్యుఁ డెవఁడాఁగెడి నాతనిగ్రోల నాజిలో? 73

కం. ఇతఁడును దశరథరాముఁడ
వతరించిరి విష్ణునంశవలనన పిదపన్
గృతకార్యుఁడగుట జమద
గ్నితనూజుఁ డొసంగె నాతనికిఁ దేజంబుల్. 74

తే. గీ. అట్లు తన తేజమిచ్చి త్రేతాదియందు
ద్వాపరాంతమునం దాహవమున భీష్ము
తోడ సమముగాఁ బోరాడె పూర్వహుండు
పరశురాముని జెప్పి చెప్పవలెనెవని? 75

తే. గీ. విష్ణుతేజము గలయప్డు వృద్ధుఁడైన
కతన యువకుఁడు రాముతోఁ గృతసమీకుఁ
డగుచు నోడండె భీష్ముతో నాజి నల్పు
నాఁటికో వృద్ధతయకాదు నాఽస్త్రి తేజ. 76

వ. మఱియు రాముఁడు దశరథరాముని బరీక్షించెనే కాని నిజమునకు యుద్ధ మాచరించినట్లు లేదు. విష్ణుచాప మెక్కిడినంతన విష్ణ్వంశ సంభూతుండని యెఱింగి తాను వృద్ధుండ నైతినని యరసి చాపంబుతోఁ దన తేజం బతనికిడి సమ్మానించె. భీష్మునితోఁ గేవలమనుజ మాత్రుండును, అతివృద్ధుండును నగు రాముం డిరువదియెనిమిది దినంబు లేకరీతిఁ బిఱుతివియక సంగరం బొనర్చుట యెంతయేని

గణనీయంబకాని యొండుగాదు. అప్పుడేవి రాముఁ డోడినట్లులేదు—
ఓడలేదు సరిగదా? ఓడునను సంభావనగూడ భీష్మునకు లేశమును
లేదు కావునసే. 77

కం. "ఉడుగుడుగు" మనుచు మౌనులు
పెదబొబ్బల విడుచురాఁగ భీష్ముఁడు విడువన్
గడఁగె నలమోహనాస్త్రము
విడువరు శూరు లలదాని విఖ్యాతులెటన్. 78

కం. అదివిడిచి జయముగొవఁ ద
ప్పిదమగుఁ ద్రావించి శత్రుబీర మడఁచువం
టిదియగు భీష్మం దయ్యది
తుది విడుచుట యోడిపోకతోఁ దుల్యమగున్. 79

కం. పరిశీలించక కొందఱు
పరశుధరునిగూర్చి వింతపలుకులు పలుకం
దొరఁకొందు రతవి ముందఱ
హరుఁడువినా నిఱవనేర రన్యు లెఱుఁగుఁడీ. 80

కం. హరపుత్రుఁడు తారకు సం
గరమున నిర్జించినట్టిఘనుఁడు కుమారుం
డెఱుఁగు నతవి దోర్విక్రమ
మెఱిఁగి వచింపంగఁదరమె యితరుల కతవిఁ. 81

చ. కొమరుఁడు రాముఁడున్ శివువిగూర్చి రణాగమ మభ్యసించు నాఁ
డుమతనుజుండు రామునకు నోడిన రాముని మెచ్చి యెంతయో
ప్రమదముచెంది పక్షమును బల్కక రాముని గౌరవించు చై
దములు కవీశ్వరుల్ నుడివి ధన్యత గాంతురుగాక పిఁకమై. 82

ఆ. వె. ఎప్పుడిచ్చెఁబరశు పీశ్వరుం డదిమొదల్
పరశురాముఁడగుచుఁ బ్రబలి సకల

రాజకుల మడంచి రహియించు పరశురా
మునిచరిత్ర దోసముల నణంచు 83

తే. గీ. ఆయురారోగ్యముల నిచ్చు నఖిలశుభస
మృద్ధి నొదఁగూర్చు ధనధాన్యవృద్ధి గూర్చు
నీశ్వరువిశిష్యుఁ డల్ల రమేశునంశ
మెవరుసాటి రామునకు మునీంద్రులార । 84

కం. దేవా। "యావత్తైలం
తావద్వ్యాఖ్యా" యనురీతిఁ దావకచరితన్
సేవకుఁడు వేంకటేశుఁడు
కావించెన్ గావ్య మీవు కావుము దీవిన్. 85

పరశురామ చరిత్ర

సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# అగస్త్యచరిత్ర

వ. మల్లికార్జునదేవా! అవధరింపు మనంతరంబు శౌనకాదులు
సూతుం గాంచి యిట్లు ప్రశ్నించిరి. 1

తే. గీ. అల యగస్త్యుఁ దేకతమున నాలితోఁ
దక్షిణాశకు వచ్చి యుదగ్దిశకు మ
రల నరుగఁడయ్యె నీవృత్త మెలమి మాకు
నానతి మ్మనుటయు నాతఁ డాదరమున. 2

వ. ఇట్లు చెప్పందొడంగె. 3

కం. పరములకునెల్లఁ బరమగు
హరుని పరిణయంబు మీర లందఱు వినియుం
టిరి మున్ను మునులు దేవత
లరుదెంచిరి యా వివాహ మారయుపేర్మిన్. 4

కం. హిమవన్నగాధిరాణ్నగ
రము క్రిక్కిరిసియుటటుదుండ గ్రావపుగుహలె
ల్ల మునులు దేవతలును నై
ప్రమదం బొనరించెఁ జూచువారికి విందై. 5

సీ. ఏకందరముఁగన్న నృత్యవాద్యములతో
వలరారు నప్సరఃకలకలమ్ము
లేలోయవీక్షింప వింపుసొంపులు గుల్కు
కిన్నరీగానసంకీర్తనమ్ము
లేకుంజములఁగన్న నాకౌకసుల కుటుం
బములు గ్రిక్కిరిసియు సమ్మర్ద మెలమి

నేకోనఁగనుఁగొన్న లోకోత్తరంబగు
గంధర్వగాంధర్వబంధురత్వ

తే. గీ. మెచటఁగనఁగొన్న మునులు మఱెచటఁజూడ
సిద్ధులును సాధ్యులును గాఁగఁ జెలువుమీఱు
సంభ్రమంబున నుత్తరాశాధరాపు
రంధ్రి భరియింపరాని భారమున నొరఁగె. 6

కం. ఒరఁగుటయు బ్రహ్మమొదలగు
సురలును మునివరు లిదేమిచోద్యమని మహే
శ్వరుని గని విన్నవించిరి
పరమేశ్వరుఁ డభయమిడియెఁ బ్రమదంబెసఁగన్. 7

వ. అట్లభయం బొసంగి మునిపరిషత్తులోనున్న నగస్త్యునిదిక్కై కృ
ప్రసాదభూయిష్ఠంబులగు దృష్టుల నా యలఘు గౌరవించుచు సమంద
హాసమ్ముగ నిట్లను. 8

తే. గీ. కల "దగస్త్యుండొకెత్తు నయ్యలఘుతరు క
మండలం బొకయె" త్తనుమాట జగతి
నీవు దక్షిణదిశ కేగినిలిచితేని
భూమి సమముగా మట్టమై పొలుపుమీఱు. 9

వ. నాపుడు నగస్త్యుండు కటకటంబడి పరమేశ్వరునకు నమస్కరించి
విషాదంబుకలిమిని వాక్కుతడఁబడ గద్గదస్వరంబుతో దీనదీనంబుగ
నిట్లను. 10

చ. పరములకెల్లనుం బరము పావనమున్ శుభదంబు గేస్తులం
దఱకును నొజ్జబంతి సురనాధముఖామరవంద్యమాన మీ
పరిణయ మిట్టి దేయుగమువారును జూడరు చూడఁబోరు నే
నరయఁగ నోఁచికోనె ! తప మంతలఘీయమె నాది ? దేవరా ! 11

తే. గీ. బ్రహ్మచారుల నాదిమబ్రహ్మచారి
వైన నీవును గిరికన్య యతిముఖిఁ దలఁ
బ్రాలు వోసికొను మహోత్సవంబు నేను
మత్తలోదరి చూడనోమమె ! మహేశ ! 12

చ. హరికి వివాహ మైనటులె యాద్యమునుల్ వచియింపలేదు పా
గరమునఁ బుట్టెఁ గేశవుఁ గైకొనెఁ బెండ్లి యదేటిపెండ్లి యా
సరసిజసంభవుండయిన శాస్త్రవిధిన్ గయికోఁడు వాణి నీ
పరిణయమే శ్రుతిద్య మనివచ్చితిఁ బోలెఁడుకోర్కెతో శివా! 13

తే. గీ. ఎందఱో యున్నవారు నీ వేగుమన్న
నేగుదురు భూమి యొరఁగుట నాఁగఁగలరు
నన్నుఁ బొమ్మని యిట్టు లనదను జూచు
నట్లు చినచూపు చూచితే మభవ ? దేవ ? 14

కం. తలఁబ్రాలు వోసికొను న
న్విలాసమేవియును జూచి వేవేగమ నేఁ
దొలఁగిచనెద నాకిడుము ము
దల విన్నన్ వేడికొందుఁ దరుణేందుధరా? 15

వ. ఇట్లు సారెసారెకు నతిదీనంబుగా వేడికొను నక్కలశభవునకు
నభవుం డిట్లను. 16

చ. ఇతరులు కోటిమంది చనిరేవియు మట్టముగాఁగ విల్వదీ
క్షితి యిది నీవుదక్క సరిసేయఁగ నొడ్లపశంబు గాదు వాః
పతిఁ జుళుకీకరించిన ప్రభావముగల్గు భవత్తపంబు స
మ్మతి కిదికూడఁ దోడుపడి నూత్నయశంబు ఘటించు నీకిటన్. 17

వ. ఇదియునుంగాక వింధ్యంబు సుమేరునగంబు నందలి యీసుం
జేసి పెచ్చుపెరింగి యున్నయది ఇంకను బెరుంగుచున్నది. నేఁట

రేపట సూర్యచంద్రుల గమనంబునకు నడ్డంకి సంఘటించు నాయీ మహోపద్రవంబు నీవలనంగాని యుపశమింప దనివెండియు. 18

కం. నాపరిణయంబు సర్వము
నీ పురతోభాగమందు వివ్వటిలు విధం
బాపాదించెద జ్ఞానపుఁ
జూపు గలుగునీకు నెదియుఁ జూడ్కికి దవ్వే? 18

వ. బ్రహ్మాదినిలింపులెల్లరు వింధ్యకృతోపద్రవం బింతకుమున్న విన్నవించి యున్నవారు మనమున్న భూచక్రం బొరఁగియుంటంజేసి మన కిక్కడ నింకను దదుపద్రవం బంతగా గోచరించుటలేదు. నీగమనంబు "ఏకాక్రియాద్వ్యర్థకరీ" యనుచొప్పున నీ రెండుకార్యములను జక్కఁజేయుమాత్రమకాదు. మఱియుంగొన్ని లోకోపకృతులకుఁ గారకంబగు నని బుజ్జగించుటయు నగస్త్యుండు వల్లెయని యంగీకరించి క్రొత్తపెండ్లికొమరునకు నీశ్వరునకు సభార్యుండై సాష్టాంగ దండప్రణామం బాచరించి మధ్యేమార్గంబునఁ గాశికింజని యచ్చట నన్నపూర్ణావిశ్వేశ్వరులయుఁ గాలభైరవగణేశ్వరులయు దర్శనం బొనర్చి వారల యనుజ్ఞను బడసి కతిపయప్రయాణంబుల వింధ్యగిరి దరికింజనుటయు. 20

కం. ఆ పర్వతరాజం బల
తాపాయుధు భక్తివినయసంభ్రమములతో
నేపుడిగి వంచి శిరము
లావట్ల నమస్కరించె నచలానమమై. 21

వ. అట్లు నమస్కరించి. 22

చ. పరమమునీంద్ర! నీదు ననుభావము నీమలవిందుగాఁగఁ గి
న్నరవరగీతికల్ వొగడినఙా వినియుంటి సముద్ర మాచమిం

చిరహికినెక్కు నీమహిమ శేషుఁడనేఁ పొగడంగఁ; గ్రౌంచునిన్
గిరిగ నొనర్చితీవు పరికించి దురాత్మకు రాక్షసాధమున్. 23

చ. కలరు తపస్వులెందఱొ జగంబున నాకము నందుఁగూడఁ జె
ల్వలరుదు రేరు నీకుసరియౌనమరె ! మంత్రములెల్ల నిట్లు టా
పొలసిన సిద్ధమూర్తివి మహోబల మెంతయులేక వార్నిధుల్
ముకకములో నిముడ్చఁగల చోద్యపుశక్తి యెటుల్ ఘటిల్లెడిన్ ! 24

తే. గీ. నేఁడు నీరాకతన మునిజనవంద్య !
జన్మసాఫల్య మొదవె వంశము తరించె
నూరకేపత్తురే ! మహోదారులైన
నిన్నువంటి మహాత్ములో నియమిమౌని ! 25

తే. గీ. యాగ మేదేని తలపెట్టి యరుగుదెంచి
నాఁడవో ! యేమొ ! కలవు రత్నంపుగనులు
కలదు బంగారు వెండియుఁగలదు సర్వ
మఖిల మిచ్చెద నన్యు నింకడుగవలదు. 26

కం. మేరువు పేరేగాని వి
దారించిన విచటఁగల్గు సద్రత్నములుఁ
గారుడమణులుఁ మఱిబం
గార మ్మచ్చోటఁగలదె ! కనుఁగొను మనఘా ! 27

సీ. అదె వజ్రపున్గని యందు వేలకువేలు
వజ్రముల్ దొరకుఁ దాపసవరేణ్య !
అదె రత్నపుఁగని యందు లచ్చకులచ్చ
పద్మరాగములబ్బు బ్రహ్మమూర్తి !
అదె హేమపున్గని యందుఁ గోటికిఁగోట్లు
బారువుల్ హేమంబు పఱలమౌని !

అదె వెండిగని చూడు మందు నర్బుదముల
సంఖ్య వెండిలభించు సాధుమౌళి।

తే. గీ. ఇవ్వియునునివి నీవాఁడనేను నీవు
వేఱొకరి యాగభిక్షకై వేడవలవ
దఖిలమున కేనెయున్నాఁడ నద్రులేవి
గూడ మత్తుల్యములు గావు నేఁడెఱుంగు. 28

కం. అల హిమవంతమునందుం
గలవఁట। యజ్ఞాంగములు పొకాలుతమచటఁ
గల వియ్యేడ దూరపుఁగొం
డలు నునుపని యచటికేగుటల్ మునిచంద్రా। 29

ఆ. వె. ఉత్తరాశ నెచటొ యున్నవి యా గిరు
లెవరొగాని చూచియెఱుఁగ రిచటి
కేగుదెంచెనేవి యెవరిగొప్పఁదనంబు
లెల్లఁ దెలిసివచ్చు నింతలోన. 30

కం. ఎత్తున నయ్యవి చాల వి
యత్తలమును నలమెననట యాలించితిఁ ద
త్పత్త్ర గనిపెట్టుటకు నే
నెత్తెదిగితి నీకుమ్రొక్క విప్పుదఁ గితిన్. 31

తే. గీ. ఊర్ధ్వముగఁ బ్రాణములువోవునుద్ధతులగు
వారువచ్చిన గేస్తుకు వారలకు న
వారిపూజ లొనర్చిన వచ్చిమరలఁ
బ్రాణములు బొంది నలరించునంద్రు బుధులు. 32

తే. గీ. అక్కటమ్మున నామేను నక్కళించి
నీకు మ్రొక్కితి నా యెత్తు నీకుగొచ

రించెనో । లేదో । సూర్యుండరిగెనె । విన్న
మొన్న పడమటిమలకు నో మునివరేణ్య । 33

కం. తూఱుపున వెలుఁగు పడమట
నారయ గాఢాంధకార మలముఁగ సంధ్యల్
వారిచిరే । మౌనులు నా
పేరును బెంపేను వేఱ పేర్కొననేలా । 34

చ. అదె చనుచున్నవాఁడు సమయంబు లభించెనటంచు నేఁడు నా
యెదుగుట నీకు మ్రొక్కెనెద నిట్టులు తగ్గుటఁజేసి యేగుఁగా
కెదిగెద రేపు దాఁబదమురే శరణంబుగ వ్రేలునట్లుగా
నుదయము నస్త మొక్కెదెస నొప్పుత మేదెసనైన నేమిఁకన్. 35

కం. నారదుఁడుచెప్పె నా కా
మేరువు గర్వంబు వింటి మీరుఱుఁగుదు రా
మేరువుపెక్కువ యెప్డే నా
రవిగమనంబు దాననాఁగెనె చెపుఁడా. 36

తే. గీ ఇంతలోఁ దాము దయచేయరేవి సూర్య
చంద్రగతులేమిబ్రాఁతి నక్షత్రగతులు
సైత మాఁగకయున్నె । యాజ్ఞదయసేయుఁ
దంఘ్రిసేవకుఁ దేదిసేయంగవలెనొ. 37

వ. ఇట్లు తన గొప్పఁదనంబును దానపొగడికొనుచు నాతిథేయమర్యా
దయం దప్రమత్తుండై వినయభయసంభ్రమాయత్తుండై గర్వధూర్వ
హుండై యొప్పు నా వింధ్యభూభృచ్ఛేఖరు వైఖరికి మెచ్చుగదిరియు
లోకోపకారకం బగుకతన నొచ్చికొనుచు నగస్త్యుండు తనలో. 38

తే. గీ. యుక్తమేగాని భూభృత్తు లున్నతి గను
టది పరాపకృతికి హేతు వగుటదొసఁగు

కాన నీశానుఁ డీతని గర్వభంగ
మునకు నాకు నొసంగెను ముదల మొదల. 39

కం. అగు విద్య వివాదకు ధన
మగు మదమున కాత్మబలము నన్యులఁ బీడిం
పఁగ దుర్జనులకు సుజనుల
కగు నివి జ్ఞానవితరణపరావనములకుఁ గా. 40

తే. గీ. ఎట్టు విష్ణుండు సంపత్సమృద్ధుఁ డేని
కనులు గానని గర్వానఁ దనువు మఱచు
నీతఁడు శిలాప్రకృతిగదా ! యితనికి గరు
వంబు మొలకెత్తి మినుముట్టఁ బరువులిడదె? 41

తే. గీ ఈసు కతమున మినుముట్టెనేని ముట్టుఁ
గాక తానేద? నల్ల బంగారుకొండ
యదియు నేద? దిక్పాలుర యుదవసితము
లెన్మిదియు దానియందకా? యెసక మెసఁగు. 42

కం. పులిఁగని యీసున మెయి న
క్కలు వాఁతలు పెట్టుకొనెడిఁగా కవి హాస్యం
బెలయించు వీనిగరువపుఁ
బలుకులు నావిధమ యయ్యెఁ బరిశీలింపన్. 43

కం. మును లొనరుచు సంధ్యావం
దనాదులకు నడ్డుదవులు దనయున్నతి వా
రు నిమేషములో నడఁగిం
ప నేర్తురని యెఱుఁగవలదె ప్రాజ్ఞతయున్నఁగా? 44

తే. గీ. ఎవ్వరో చేయఁదగినదే యితనిగర్వ
భంగ మయ్యది నా పాలఁబడినయది !

వాఙ్మకతమున నని వింధ్య మగముగని య
గస్త్యుఁ డనియె నుపాయమ్ముగడలుకొనఁగ 45

కం. ఓయీ ! నీవెంతయును వి
ధేయుఁడవై నాకు నొసఁగితివి సర్వస్వం
బేయదియు నిపుడు వలప దు
పాయంబుగ నిట్లయుండు మటు చనివత్తున్. 46

కం. నేనుజని వచ్చునంతకు
నీ నియతినె యుండు మవల నెదుగుదుగా కం
చా నియమివతంసుఁడు చనె
నా నియమముదాఁటవెఱచి యగ మటులుండెన్. 47

తే. గీ. అతఁడు దక్షిణమునకేగి యవల మరలి
రానులేదు వింధ్యంబు శిరంబువంచి
నది మరల నెత్తనున్ లే దనంతరంపుఁ
జరితము వినుండు సంయమివరులు పేర్మి 48

వ. అగస్త్యుం డిట్లు వింధ్యంబువలని యుపద్రవంబు లోకమ్మునకు రాకుండ నాఁగి దక్షిణదిశామార్గంబునఁ బత్నీసహితుండై యేగు చుండ మధ్యేమార్గంబున నారికేళపనస జంబూ కదళీ తాల హింతాల పున్నాగ చంపకాది బహు భూమిరుహ శోభితంబగు నొక్కవనం బగుపట్టుడు దాని రామణీయకంబున కచ్చెరువడుచు నవ్వనంబు ప్రవేశించుటయు నందు విల్వలవాతాపు లను రక్కసు లియ్యురు కపటజటిలాకృతితో నెదురువచ్చి వేదచోదితంబుగ నర్ఘ్యపాద్యాదు లొసంగి సుఖాసీనులం జేసి యాదంపతులకు వినయనయసంభ్రమం బులతో నిట్లు విన్నవించిరి. 49

కం. ఇప్పటికి నేము ధన్యుల
మెప్పుడు మీవంటి యతిథు లేతేరరిదే

చప్పున వంటకమగు మీ
రిప్పాట విటనె భుజింపుఁ డింపెసలారన్ 50

వ. అని యాతిథేయులపోల్కి నాదరమేదురంబగు తియ్యనిమాటలతో బ్రార్థించుటయు నట్లయగుంగాకని నాతిదూరమ్మున నున్న నదికి స్నానార్థం బరుగుటయు నా యిరువురలో విల్వలుండు తనసోదరు వాతాపి నొకమేఁకగా నొనర్చి ఛేదించి యథాపూర్వంబుగ వండి సర్వంబు సిద్ధంబని మునికి విన్నవించుటయు నయ్యనఘుండు స్నాన సంధ్యాదులు ముగించికొని యేతెంచుటయు హస్తోదకంబిచ్చి భుజింపఁజేసి తన యెప్పటి యాచారంబు చొప్పున. 51

శా. వాతాపీ! చనుదెమ్ము మౌనిజఠరద్వారంబు భేదించి స
ర్వాతిథుం డిటువంటివాఁడు మనకి ప్డభ్యాగతుండయ్యె నెం
తో తృప్తింగనవచ్చు నీతనిపలం బొక్కుమ్మడిన్ మెక్కి యం
చాతం డాతనిఁ బిల్వ మౌనిహృదయం బా కీలకంబుం గనెన్. 52

వ. అట్లు జ్ఞానదృష్టింగని యోహో! వీరలిరువురును బరమదుర్మార్గులగు రక్కసులు వీర లియ్యెడఁ గపటతాపసులై యెందఱినో ఆతిథ్య వ్యాజంబున మోసగించి భక్షించుచున్నవారని యావత్సందర్భంబును గనిపెట్టి వెండియు. 53

ఇంద్రవజ్రావృత్తము. "వాతాపిజీర్ణం" బనిపల్కి పొట్టం
జేతో ముదంబొప్పఁగఁ జేతితోడన్
భూతేశభక్తుండు విభుండుప్రామన్
వాతాపి జీర్ణించె తపస్వికుక్షిన్. 54

వ. ఇట్లు వాతాపిని గాలుప్రోలికనిపి యిల్వలుని మంత్రోదకప్రోక్షణం బున గతాంసుజేసి లోకమ్మున కా రాకాసులవలని భయంబుడిపి కాశీ నివాసంబునందుఁ బ్రీతిగలిగియు నీదిశనుండి మరల నుదగ్దిశాప్రయా ణంబు సేయుచో వింధ్యంబు దగులకమానదనియు నట్లుదవిలిన దాని

వతిక్రమించుపిదప దానికి నొడివినయేర్పాటు చెల్లించినయట్లగుటం జేసి యయ్యది యథాపూర్వకంబుగఁ బెరుఁగమొదలిడి లోకోప ద్రవంబు గల్గించుననియుఁ దలంచి దక్షిణదిక్కునంద యాశ్రమంబు గల్పించికొని యావత్కాలమ్మును గడపనెంచి యాదిక్కునం బెద నెదంగల తీర్థరాజంబుల సేవింప మొదలిడియె నందు ముఖ్యంబు లగు కొన్నిక్షేత్రమ్ములు వివరించెద నాలింపుఁడు. 55

సీ. యాత్రలలోనెల్ల నధికప్రయాససా
ధ్యమ్ము శ్రీశైలయాత్ర నొనరించె
కొమరుసామికి నివాసముగాన సామిమ
లయనుచోటికిఁ దిర్మలకునునేగె
నారసింహస్వామి యారంగనుండు న
హోబలక్షేత్ర మా యోగియేగెఁ
బానకాలనృసింహు పట్టణంబగు మంగ
ళగిరి సేవించె నా నిగమవేత్త

తే. గీ. పదియునెన్మిదిపీఠముల్ పరమశక్తి
కొప్పుఁగద। వానిలోనెల్ల మన్నతమగు
పీఠమనఁదగు తీర్థంబు విజయవాడ
దుర్గనిలయంబు గనియె బుధుం డగస్తి. 56

వ. పదంపడి కృష్ణానది కిరువలంకుల నక్కడక్కడనున్న యమరావతి ముక్తిల లోనగుక్షేత్రమ్ములును సాగరసంగమప్రాంతంబునందలి హంసలదీవి లోనగుక్షేత్రములును మఱియరామేశ్వరమ్మును సేవించుచు వచ్చుటకి నాతిదూరంబ యగుటంజేసి గోదావరీపరిసరంబునం గల క్షేత్రరాజంబు లవలోకింపనెంచి యటనుండి తూర్పుగామరలి గౌతమీతీరంబు చేరి కొండొక యుత్తరంబునంగల పట్టిసవీరభద్రే శ్వరు క్షేత్రంబునకేగి. 57

కం. ఇరువంకల గోదావరి
వఱలఁగ మధ్యముననున్న పర్వతమున భ
క్తిరతుల కొంగున ముళ్లియ
కరణినలరు వీరభద్రుఁ గనివినుతించెన్. 58

వ. అటనుండి వెనుకకుమరలి కోటిలింగక్షేత్రమ్ము సేవించి యక్కడన యున్న మార్కండేయు సందర్శించి తత్సమీపమ్మునసున్న ధవళగిరి యందలి నవజనార్దనంబులలో నాదిజనార్దనమూర్తి నాలోకించి యాకొండ యుపత్యకయందుఁ దనపేర నగస్త్యేశ్వరుండను లింగంబుస్థాపించి తూర్పుగామరలి కడియమ్మునందలి జనార్దనమూర్తినిగూడ సేవించి యటనుండి ఆసముద్రపర్యంతమ్మునుగల సప్త గోదావరక్షేత్రంబులు చూడుతలంపుతో నరుగుచున్నంతటఁ గాశిక నుండి యీశ్వరునిచే నిష్కాసితుండై కాశీనివాసవిరహాభరంబునఁ గరంబుఁ గుందు వ్యాసుం డగుపట్టుటయుఁ దత్తాలోచితాన్యోన్యపుర స్కారంబులు ముగిసినపిదప నగస్త్యుం గుఱిచి వ్యాసుండు. 59

శా. ఏమయ్యా! యిటులేగుదెంచితివి నీయేణాక్షియున్నీవు గా
శీమాహాత్మ్య మెఱింగి ముక్తిఘని వర్జింపంగనేలయ్య! యే
సీమం గాశికిఁబోలు పుణ్యదములౌ క్షేత్రమ్ములున్నట్లులే
దేమో! యెందుకు వీడివచ్చితివొ నాకిరాక శోచ్యంబగుఁ. 60

వ. నావుడు నగస్త్యుండు గతంబువక్కాణించి శివాజ్ఞ నతిక్రమించుట త్రిమూర్తులకు నశక్యం బగుటంజేసి యిట్లు చనుదెంచితి ననిచెప్పి వెండియు. 61

ఉ. ఎందులకీవు కాశివిడి యీవలికిన్ జనుదెంచినాఁడవో!
విందు వచింపు నావుడును వించుట కొండొక సంశయించి నా
చందము చాలశోచ్యము కృశానుదృశుం డవమానిఁజేసి పం
పెం దనవీట నుండుటకు వీలిఁకలేదని హుంకరించుచున్. 62

కం. ఏపాటు దప్పినను నల
సాపా టెటుఁదప్పుఁ గాశి సాపదక యెటుల్
గాపాడవచ్చు దేహ మి
దే పరమార్ధము గణింప దిక్కగుసుగదా ? 63

ఆ. వె. ధర్మసాధనముల కాద్యధర్మసాధ
నంబు కాయంబు దాని ననామయముగ
రక్షసేయుచు దీక్షించి మోక్షపదవి
కేగవలయు నియ్యది లేక యేగుటెట్లు? 64

వ. ఏమిదుష్కాలమో ? లేక నన్నుఁబరీక్షించు నుత్సాహమో ? కాశిలో నొకనాఁడుగాదు రెణ్ణాళ్ళుగాదు మూడురోజులు నాకును శిష్యులకును నుపవసించు దౌర్గత్య మేర్పడినది యేమనుకొనవలయును? 65

తే. గీ. ఎంత దుర్భిక్షకాలమందేని రెండు
జాములకు మించకుండ నీకాని యన్న
పూర్ణ యెల్లసాధువులకు భుక్తి తృప్తి
గా నొసంగుట కలదల్ల కాశియందు. 66

తే. గీ. తఱచు "యజ్ఞోపవీత" సంతర్పణములు
నిత్యమును భోజనముపెట్టు నృపుల సత్ర
ములును గల్గిన కాశిలో ముట్టదయ్యె
నాకు శిష్యులకును భోజనంబు మౌని ! 67

వ. అట్లు మూఁడుదినము లుపవసించి యశనాయానలమ్మునఁ బెచ్చు పెరుఁగు నమర్షానలంబు నాఁగనేరక శిష్యుల భిక్షాపాత్రమ్ములతో సహితమ్ముగా నా భిక్షాపాత్రమ్ము నొకరాతిమీఁద బగులనడిచి కాశి కను శపించుటకై శాపోదకం బందికొని శపింపమొదలిడి కొందొక నోరు జాఱవిడుచునంత. 68

కం. ఉడుగుడుగు మనుచుఁ గొండొక
సడి వినఁబడె సడిఁబట్టి శాంతిగదిరి యె
క్కడిదిదియని కనుఁగొన నే
బిడయో ముదుసలిపడంతి వెనుకఁ గనఁబడెన్. 69

వ. అట్లు గనంబడి యేమిటికయా ! యిట్టు లాఁకటికిలోఁగి పుణ్యగుణం
బుల రాశియగు కాశిని దూషించెదవని వెండియు. 70

కం. పెట్టవి దినములలోపలఁ
బుట్టదు పెట్టుటకు సాక్షి పుట్టుటయే నీ
యట్టి మహానీయునకు నీ
గుట్టెఱుఁగన్‌రాదె ! కలరె ? కోవిదులింకన్. 71

తే. గీ. గతిముగతమయ్యె నేల ! వగచినఁగూడి
వచ్చు స్నానాదికృత్యముల్ వరుస ముగియఁ
జేసికొని రండు పద్దనఁజేతు ననుచుఁ
బ్రాణములు గూటఁబడెఁ బదంపడి వచింతు. 72

వ. ఆపె కపటబ్రాహ్మణీరూపంబున సాక్షాత్కరించిన యన్నపూర్ణయే కానగుఁగాని అన్యపురంధ్రి కానొప్పదని నాకు మొదటనే సందియంబు తట్టినది. దానికిఁ దార్కాణముగా నానాఁటివిందు కనుపట్టినది 73

ఉ. వండినజాడ గన్పడదు వార్చినజాడయు లేదు విస్తరల్
బండెడుమాత్ర మున్నయవి పాత్రము వేసినయంత భోజ్యము
ల్నిండును గామధేనువట నిక్కము లోపలనున్నదేమొ ! యిం
కొండు విచిత్ర మొండొకటి కొంటికిఁ బోలిక గానరాదటన్. 74

వ. ఎవని మనస్సున నేపదార్థమ్ముపైఁ గోరికపుట్టునో వాని పాత్రమ్మునందయ్యదియ ప్రత్యక్షం బగుచుండుకతన నావిందుచందం బిదమిత్థమని వర్ణింప నాకకాదు మఱియేరికిని నశక్యంబ దానింబట్టి యాగే

స్త్రీరా లన్నపూర్ణయేకాని ప్రాకృతాంగన గాదని తుదకు నిర్ణయించి కొని సంతసించుచుఁ దృప్తిగా భుజించి యా మహాభవనంబునందలి వేదికలపై విశ్రమించునంత. 75

ఉ. ఆపెనుభర్త యేఁబదికి నర్వదికి న్నడిప్రాయ మొప్పువాఁ
డే పురుషోత్తమోత్తముల నీడుపడింపఁగరానివాఁడు ము
క్కోపియెగాని లోన దయకు న్నిలయంబగువాఁడు బ్రాహ్మణుం
డాపెనుబిల్చి యిట్లనియె నాదరమేదురమైన వాక్కుతో. 76

తే. గీ ఇతఁడు కవి భారతముగట్టె నితఁడె రెండు
భాగవతములు రచియించెఁ బదియునెనిమి
దీతఁడె పురాణములు సృజియించె నతివ!
యితఁడె లోకశాంతికి హేతు వెంతయేని. 77

తే. గే. ఇట్టి యతిథికి నీవు సంతృప్తిగాఁగ
భోజనము పెట్టితివి నీదు పుణ్య మెంత
యని పచించెద! నీవకా దతిపమిన్న!
నేనును దరించితిని నీకు నేతనగుట. 78

వ. ఇట్టు లాగృహమేధి యాపె నగ్గించువాక్యములు నాకించుక సందియంబు గలిగించుచున్నను నయ్యది నా యొనరించిన తత్త్వపాటు వలనఁ గలిగెనని సరిపెట్టికొని ఆపెకునట్లె నాయనకుఁగూడ నాయం దనుగ్రహ ముదయించెనని సంతసించునంత నామహా మహుండు పేరుపెట్టి నన్నుంబిలిచి రోషరూషితంబులగు వాక్యంబుల విట్లు మందలించె. 79

సీ. కలగూరగంపగాఁ గలసియుండిన వేద
ములు విభజించితి వలఘుచరిత!
భారతంబేకాక పదునెన్మిది పురాణ
ములు రచించితికదా! బుధులు మెచ్చ

వాల్మీకినాఁ డుద్భవంబు నందినకైత
సీనాఁడు వర్ధిల్లె నిక్కమిదియు
వినుఁజెప్పి పేఱొక్కని వచింపఁగారాదు
సర్వథా నీపుట్టు శ్లాఘ్య మరయ.

తే. గీ. ఇట్టి నీవు పొట్టకునయి నెట్టన శపి
యింపఁ బూనితి కాళకయెవ్వరనుచు
నీకుఁదోచెనా ! యొక్కింత నాకు విప్పి
చెప్పనేర్తువె ! అలింతుఁ జెవులుదనియ. 80

తే. గీ. వారిభజులు లోనైనవారు మునుల
యందుఁ గలరవి నీవకా ! అందునందుఁ
బలికియుంటివి నీ వట్టివారిలోనఁ
జేరుచో నాఁకలికి నింతభీరు వగుదె? 81

కం. నాయట్టి కవులులేరని
నీయంతఃకరణము తెగనీల్గెడి దొనఁగుల్
ద్రోయఁగరానివి కలవె
న్నో యెఱుఁగవుగాక నీవహో ! మునిచంద్రా ! 82

వ. ధృతరాష్ట్రుండు తన కొమరులకుఁ బెట్టిన నామధేయములలో దుఃఖ ద్యోతకమగు దురుపసర్గంబుతోఁ గూడివట్టివియేకదా ! నూటికిఁ దొంబదులు; అట్టిపేళ్ళను మహారా జెవ్వండుగావి తన కన్నసంతాన మ్మున కిడికొనునే ! యవిప్రశ్నించినచో నీచెప్పు నుత్తరం బెట్టిది? యది యట్లుండుగాక. 83

కం. ఒకచో శివుఁడు పరుం డనె
దొకచో విష్ణువని వ్రాతు వొకమాటకు వే
ఱొకమాటకుఁ బొసఁగదు వి
న్నకటా ! యేలాటికవిగఁ నభినందింతున్ ? 84

కం. ఏదో బోలెఁడు వ్రాసిన
చేద స్తపుఁ గవిలెకట్టచేఁ గవియగుచో ?
నీదాఁకనేల ? భువిని భ
వాదృశు లిఁక "రామకోటి" వారలు లేరే ? 85

కం. ఓపికపట్టితి వ్రాసితి
వేపొత్తములైననేమి ! యెన్నిటినో ! యం
దేపొత్తము రుచియించు ? వృ
థాపడితి పరిశ్రమంబు తథ్యమెఱుఁగుమీ. 86

వ. ఏదో ఛందోబద్ధంబుగనేకాదు గద్యరూపంబున నేని గ్రొంతరచన సాఁగించిన మానిసిని గవియనుటకు సందియంబు లేదుగాని పూర్వో త్తరసందర్భంబులు శబ్దార్థదోషంబులు స్వోక్తిదోషంబులు లేనివక్కఁని రచించినప్పుడకదా! వాఁడువిద్వత్కవియగు? నట్టిదోషంబు లన్నియు నీకవనమ్మునఁ గుప్పతిప్పలుగాఁ గనుపడుటంజేసి నీరచన విమర్శ నను సహింపదని యెఱుంగు మని వెండియు. 87

కం. ధీవరసూతి గనుటనే
ధీవరుఁడవుగావి తెల్వితేటలకలిమిన్
ధీవరుఁడ వీవుకావని
దేవర కోపించి నన్ను ధిక్కృతుఁజేసెన్. 88

వ. ఇట్లు తేలంబలికి పండితంమన్యునిగా నిరూపించి యిట్టినీవు కాశియం దుండఁదగవని సిద్ధాంతీకరించి వెడలిపొమ్మనుడు శివాజ్ఞంజేసి యిట్లు వచ్చితి వచ్చునప్పు దండికమాత్రము శీతలాపాంగంబుల నాదరించి ఆయాదేశమ్మునఁ గాశితోఁ దుల్యమ్ములగు క్షేత్రమ్ములు గొన్ని గలవు పొమ్ము విన్నక్కడివేల్పు లాదరింతు రనిచెప్పి వాత్సల్యంబు చూపించె ననివెండియు. 89

సీ. సేవించినాఁడఁ గాశీవిశ్వనాథుఁడే
యగునను శ్రీకాళహస్తిదేవు
కాంచిలో మామిడికడనున్న నేకామ్ర
నాథుఁ గామాక్షీసనాథుఁ గంటి
రామేశ్వరము మధురాపురిఁ బక్షితీ
ర్థమ్ము లోనైనక్షేత్రములు గంటి
సప్తసాలాంతరస్థాయియై పిదురించు
రంగనాయకుని నారంగఁగంటి

తే. గీ. స్కాందనిలయంబు తిరుమలయందుఁ గొంత
కాలము వసించితిని నాకుఁ గాశికావి
యోగదుఃఖంబు వోదయ్యె యోగివర్య!
యెట్లు చిత్తంబు శాంతించు నెఱుఁగఁజెపుమ? 90

వ. మఱియు వ్యాఘ్రపురంబు జంబుకేశ్వరం బరుణాచలంబు మేలుకోట
యుడిపి యొక్కండవి విడఁదీసి వక్కాణింపనేల? దక్షిణదేశంబునఁ
గల క్షేత్రమ్ములన్నియు సేవించితి గాని యవియన్నియు నుత్తమో
త్తమంబులును నపవర్గప్రదంబులును నయ్యుఁ గాశింబలె జీవన్ముక్తి
సంధాయకంబులుగా నాకుం దోఁపవయ్యె నవివెండియు. 91

తే. గీ. తిట్టె విశ్వేశ్వరుఁడు భిక్ష పెట్టదయ్యె
మూఁడునాళ్ళన్నపూర్ణ యో మునివరేణ్య!
అట్టులయ్యును గాశికయంద నాకు
మనముపరుగిడు రానీఁడు మన్మథారి. 92

కం. శివుఁగూర్చివ్రాసితివి గే
శవుగుఱిచియు వ్రాసితివి ప్రసక్తి కలుగ నె
క్కువతక్కువలవి వారికె
యవగతమగుఁ గవులకెట్టు లవగతముఁగున్? 93

వ. దుర్గమంబగు నీవిషయంబునఁగూడ నా రచించినపురాణంబులలో నేను జాలభాగము మహేశ్వరు నధికరించియే ప్రవర్తించితి నంతియ కాదు, ఇతరదేవతల నధికరించి రచించిన పురాణమ్ములందుసైతము పరమేశ్వరునికి భాగంబుగల్పింపక యుపేక్షింపలేదు. ఐనను మహేశ్వరుండు నన్నేకాక నాకవనంబుంగూడ నధిక్షేపించె. 84

ఉ. వేదములెల్ల నేవెదకి వేద్యమెదో యిదమిత్థమంచు స
ర్వాదరణీయమైన పథమారసి చెప్పమి నాదుతప్పొ? ఆ
వేదము తప్పిదంబొ! సువివేకివి నీవవచింపుమయ్య? కా
కోదరభూషణుండు ననునూరక దూఱిన నేనునంగలఁజా? 85

వ. కొన్ని శివుని గొన్ని విష్ణువును గొన్ని పరాశక్తిని బరవస్తువుగా నావేదంబునందలి భాగంబులు వక్కాణించుట పరమేశ్వరుం డెఱుఁగని విషయంబు కాదుగదా! ఇంతకు నా యొనర్చిన కాశీదూషణంబు నాయందలి గుణంబులనెల్ల దోషమ్ములుగా మార్చివేయుటంజేసి పరమేశ్వరుండు నన్నట్లవమానించెఁగాని నిజమ్మునకు నారచన సర్వమ్మును దోషదూషితంబని యాయన యభిప్రాయంబు కాదు భవతు!

కం. "కర్తు మకర్తు మితరథా
కర్తుంచ" సమర్థుఁడైన కాలగళుఁ డుమా
భర్త ననుఁదిట్టినను నే
నార్తివడఁగ గాశివిడువ మది యనకున్నన్. 87

వ. పరమేశ్వరుండు సర్వస్వతంత్రుఁడు ఆయన యైనదికాదనికాని కానిదియౌననిగాని సమర్థింపఁగలఁడు ఆయనను కాదనువారెవ్వరు? అట్టివాఁడుకనుకనే ఈశ్వరశబ్దం బమ్మహాదేవున కన్వర్థంబు. 88

కం. అల మార్కండేయుని కేఁ
డులు పదియాఱాయు వమనొదువు కల్పంబుల్

నలిఁజనినం దీఅనిన
వ్వల నెటులయ్యెఁ ? వచింపవలయునె ! మౌనీ ! 99

వ. ఒక్కవిశేషంబుమాత్ర మమ్మహేశ్వరునందు గమనింపవలయు. 100

తే. గీ. పైకి ముక్కోపిగతిని గన్పట్టుఁగాక
ఉగ్రుఁ డనుపేరు దాలిచియుండుఁగాక
అంతరంగంబు సత్త్వమయం బెఱుంగు
మట్టిదేవర నన్నేమియనిన వగవ. 101

వ. ఇంక నెందులకు వగచెదననినఁ గాశీవియోగమ్మునకే వగచెదనని కంటఁ దడిపెట్టుకొను పారాశర్యుంగాంచి యగస్త్యుండు. 102

కం. అవమానము సమ్మాన
మ్మివి యుపసర్గములకలిమి వించుకభేదం
బు వెలారించిన విరువుర
కు విశేషములేదు కాశిఁ గోల్పోవుటలో. 103

వ. నీవు నెఱింగినదియే యైనను నవమానదుఃఖభరాక్రాంతంబగు నీమనంబునకుం బొదకట్టలే దనుకొందు నని వెండియు. 104

తే. గీ. సప్తగోదావరమ్ముల సన్నికర్ష
మభవుఁ డటమందు భీమేశ్వరాహ్వయమున
దక్షుఁడు మఖం బొనర్చినతావు దక్ష
వాటి కాశిక కొందొకవాసి హెచ్చు. 105

వ. దానికి నెటుచూచినను బంద్రెండామడమేర వరమపవిత్రమ్మనిచెప్పి యగస్త్యుండు వ్యాసు నోదార్చి ద్రాక్షారామంబు ప్రవేశించి మాణిక్యాంబానాధు భీమనాధు సందర్శించునంత వ్యాసునకుఁ గాశీవిరహసంజనితంబగు దుఃఖంబు శాంతించెఁ బదంపడి దక్షిణసముద్రతీరంబునకు నాతిదూరంబుననున్న కోనసీమయందలి బ్రాహ్మణాగ్రహారంబు

లును నంతర్వేది లోనగుక్షేత్రంబులును సేవించి పల్వల (పలివెం) పురంబునందలి కృపేశ్వరునీక్షించి వ్యాసుండు ద్రాక్షారామమ్మునకును నగస్త్యుండు కేటశదేశమ్మునకును జనిరి. అట్లుచని యగస్త్యుండు దండకారణ్యమ్మున నొక్కెడ నివాసంబేర్పఱచికొని పత్నీసహితుండై తపంబుండునంత నాదేశవాస్తవ్యులు ద్వాదశవర్ష క్షామపీడితులై యమ్మహామహుని బ్రార్థించిరి. 106

ఉ. ఈ పొనరింపలేనిపని యేయదియుం గనరాదు నంద్రముల్ వావిరి గ్రోలి యింద్రపదవల్లభు నన్నహుషున్ గుదించి యా గ్రాపము వింధ్యముం జదిపి గండదగించిన మేటివీవు మా కీ వెతమాన్పి నీరయినవిచ్చి కృతార్థులుగాఁగఁ జేయవే? 107

వ. అట్లు తన్నుఁ బ్రార్థించు నాదేశీయుల దుస్సహ పాపునుద్దేశంబుతో నగస్త్యుండు సకలారిష్టనివారకుండగు పరమేశ్వరుంగుఱించి యిట్లు ప్రార్థించె. 108

చ. హర ! జగదీశ ! నీజటల యందలి గంగకుఁజెప్పి కొన్నితుంపురు లిటుపంపితేని యవియొండొకయాపగయై రహించి దుర్భరమగు క్షామబాధమెయి బాములపాలయి కుందు నీదిశా సరసిజనేత్ర భూప్రజలసాఁకి సుఖంపడు నీదునర్మిలిన్. 109

ఆ. వె. అనెడియంతలోన నంబరకేశుండు
వ్యోమవాణికతన నో మునీశ?
కలదు నీదు చేతికలశమందున గంగ
యదియచాలు నెన్నినదులకేని. 110

వ. ఇట్లు లాకాశవాణీముఖంబున నీశ్వరుం డుత్తరంబిచ్చు సమయమ్మున నొక్కకాకి యకృంలశభవు కమండలముపైనెక్కి యద్దాని బోరగిలఁద్రోసె నంత నందున్న పరిమితంబగు జలం బపరిమితంబయి కాకంబు నిమిత్తంబుగానుండి ప్రవర్తింపఁజేయుకతనఁ గావేరి

యనుపేరం బరఁగె వింతకుమున్న యీనదికినై కవేరుం డనుముని చిరంబునుండి తపించుటంజేసి తత్తపంబు కారణంబుగా నవతరించినయాపగ యగుటంజేసియు దీనికిఁ గావేరీనామం బన్వర్థంబు నావుడు శౌనకాదులు సూతుంగాంచి. 111

తే. గీ. కలశజు కమండలము చాలబలుపుకలది
పక్షి కాకంబు శక్తమే పాఱఁద్రోయ?
నేదొ ! కీలక మియ్యెడ వితర ముండి
తీరవలయు నటన్న భూదేవులార! 112

వ. వినుండని సూతుం డిట్లువక్కాణించె ఆ కాకంబు కాకంబుగాదు గజముఖుండు. అతం డింద్రప్రేరితుండై లోకహితార్థం బట్లొనరించె. పదంపడి ముని శపించుననియెంచి స్వస్వరూపంబుతో మునికట్టెదుటఁ బ్రత్యక్షంబై తనతుండంబుతో భూమింబడిన జలమ్ముNeత్తి మరలఁ గమండలువు నింపుచున్న గణనాధుంగాంచి కలశజన్ముండు మహేశనందనా ! యేనీ దేశప్రజల నిప్పచ్చరము తొలఁగింపనెంచి దానికి జలసమృద్ధి సాధకంబగుటచే మహేశ్వరునర్థింప నా భక్తమందారుండు మత్కమండలమ్మునఁ గొన్ని గాంగేయబిందువులు సన్నిహితంబు లొనర్చె నీవవ్వాని బహిర్గతంబులుగాఁ జేసి యుపకృతినే పొనర్చితి వని వెండియు. 113

కం. కొమరులు తంద్రులయెడ భ
క్తిమిగులఁగలవారు వారు దేవినొనర్పం
గ మొదలుపెట్టుదు రా కా
ర్యము సాఁగఁగఁ జేసి యశము నందుటుచితమే. 114

వ. అని గణపతి నభినందించి యానదికతంబున నాదేశదారిద్ర్యంబు వాపి యాదేశస్థుల మన్ననకుఁ బాత్రుండై యాదేశమ్మునంద చిర

కాలం బరీక్షించి తద్దేశీయులయందలి యనుగ్రహమ్మునం జేసి యవ
విషదర్థం బెల్ల సుబోధం బగునట్లు ద్రావిడభాషలోని కనువదించి
పరమోపకారం బొనర్చి యెప్పటికి నాదేశమ్మునంద యుండి యీశ్వ
రానుగ్రహమ్ము కలిమిని దేహోరూపం బునొంది యాకసంబున నలరారు
చున్నవాఁ డెఱుంగుదురే కద। యని పక్కాణించుటయు శౌనకాదులు
సూతుం గని. 115

కం. వినినారము నీకతమున
మునికలశజు వృత్తమును బ్రమోదమ్మున మా
మనములు విలసిల్లెను గ్రౌం
చుని చరితము వినెడికోర్కి చొప్పడె ననఘా। 116

ఆ. వె. క్రౌంచుఁ డేమిచేసెఁ గలశజా? వానికి
నట్టిశక్తి యెట్లు ప్రాప్తమయ్యె?
వినఁదలంతు మనిన విప్రపుంగవులకు
వ్యాసశిష్యుఁ డిట్టు లని వచించె. 117

తే. గీ. క్రౌంచుఁ డనువాఁడు బలియుఁడు రక్కసుండు
కామరూపి కడుం గ్రూరకర్ముఁ డధ్వ
గులఁ బ్రతారించి భక్షించు కొంటె మొఱకు
కలశజమ్ము వంచించె మార్గమ్మునందు. 118

వ. హరిద్వారప్రాంతంబునఁ బత్నీసహితుండై యీశ్వరాజ్ఞం జేసి వార
ణాసి కేగి యటనుండి వింధ్యపర్వతమార్గంబున దక్షిణదేశంబునకుఁ
జనుతలంపునఁ బ్రయాణించు నగస్త్యునిఁ ద్రోవదప్పించి క్రౌంచుండు
తద్రూపంబున గిరిరూపంబు నొందియడంగె. 119

కం. ఎడనెడ నపూర్వమగు నది
కడురమ్యములై తనర్చు క్ష్మారుహములు నె

కన్గఁడఁజూచిన నక్కఁడఁ గ
న్పుడునట్లోనరించె గ్రౌంచపలలాశి వెసన్. 120

వ. చతుఃపర్వంబుగాఁ బర్వేడి యాదృశ్యంబునకు వశంబైన చిత్ర
మ్ముతోఁ ద్రోవదప్పి కలశోద్భవుఁడు చాలదూరం బరిగినపిమ్మటఁ
గ్రౌంచుండు భయంకరమ్మగు స్వరూపంబుతో నెదుటంబొడకట్టి
మ్రింగనుంకించుటయు నాచుళికితపాథోధి వాని కపటప్రవర్తనంబు
గనిపెట్టి. 121

కం. కలశంబునఁగల జలమున్
జిలికించి దురాత్మ ! చెట్టుచెయ్యులుడిగి యీ
యిల మలవై యుండుము ని
న్నలమి విభేదించు నభవునాత్మజుఁ డవలన్. 122

వ. ఇట్లు శపించుటయుఁ గ్రౌంచుండు గిరియై గరువంబుడిగి యుండెఁ
బదంపడి యగస్త్యుండు యథేచ్ఛంబవి వింధ్యాద్రినడంచి యాయా
క్షేత్రంబులు సేవించినవిధంబెల్ల మున్నువక్కాణించినదియు అనం
తరం బమ్మహాత్మ్యం దెప్పటికివి దక్షిణదిక్కునంద సుఖంబుండై
వియ్యది యగస్త్యచరితంబు దీవి శ్రవణపఠనాదులు సర్వశ్రేయంబులు
గలిగించునవి సూతుండు శౌనకాదులకు వక్కాణించె. 123

కం. దేవా ! "యావత్తైలం
తావద్వ్యాఖ్య" విను నేవిధంబుననైనఁగా
సేవించుకవితఁగట్టిన
ధీవరులకు లోటులేమి తెల్లమ యెందుఁగా. 124

అగస్త్య చరిత్ర
సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః
శుభమస్తు - అవిఘ్నమస్తు

# భద్రాయుశ్చరిత్ర

కం. శ్రీసూక్తపురుషసూక్తవి
భాసురనిజతేజ! వామభాగకళత్రో
పాసితగుణగణ! సదృషి
వ్యాసవిదితభావ! మల్లికార్జునదేవా! 1

వ. అవధరింపుము పురాణకథనోన్ముఖుండగు సూతునకు శౌనకాది
మహామును లిట్లుప్రశ్నించిరి. 2

తే. గీ. మంత్రపూతంబైన భూతిమహిమవలన
భూతములు జ్వరపీడలు పోవు నినువు
లకని విందుము పోవుజీవకళ మరల
వచ్చునే చంటిపిల్లల కెచ్చటేని—? 3

వ. అని ప్రశ్నించు మునివరేణ్యులకు సూతుండు సమందహసితమ్ముగా
నిట్లు వక్కాణింపందొడంగె. 4

చ. పరమమునీంద్రులార! యిటుపల్కుట ధర్మమటయ్య? మంత్రముల్
పఱలెడి మీ యధీనమున వానికి శక్యముగాని కర్జమెం
దరయము వ్యక్తిసంగతము లైన దొసంగులఁబట్టి వాని పెం
పఱి యని వ్యర్థమైచనుట యన్నదియుం గల దందుకొప్పితిన్. 5

చ. కలదు దశార్ణనామకము కల్మికిఁ దానకమైనదేశ మా
యిల నలి వజ్రబాహుఁడను నేలిక యేలుచునుండు వానికిం
గలసతులందుఁ బెద్దయగుకాంతమ గర్భిణిగా నెఱింగి య
క్కలికి సపత్ని గర్భ మఱఁగా విష మెట్టులో పెట్టఁజేయుడున్. 6

కం. సుమతియను నత్తలోదరి
కమితంబగు బాధకలిగి ప్రాణము నిలిచెన్
గ్రమముగ గర్భము పొదలెద
శమమాసమునందు శిశువు జనన మ్మందెన్. 7

కం. విసము తినియుఁ బ్రదికిన యల
ప్రసవిత్రికిఁ బొడముకతనఁ బలుపీడల కా
విసువు నిలయమై చూపఱ
కెసకము కలిగించు తేజ మెనయక చిక్కెన్. 8

తే. గీ. తేని కీభార్యపైఁ బ్రీతిలేనికతన
సూనునింగూడ శ్రద్ధతోఁ జూడఁడయ్యె
"మగఁడు గొట్టినఁ గొట్టును మాధుకరపు
వాఁడు" రాట్పుతునకు నింక వైద్య మెట్లు? 9

తే. గీ. అన్నియుం గల వేలాథ మల్లునోట
శని యటన్న లోకోక్తికి జనని తాను
లక్ష్యమై గర్భరిక్తయా లలన గన్న
విసువుకన్న హీనంబుగ విసువు చిక్కె. 10

తే. గీ. సవతు లీనిసు వెప్పుడు చచ్చునా య
టన్నకోరికతో మంది రవనిపతికి
పీనిపుట్టుక తెలియునో? విన్నయపుడె
మఱపు దవిలెనో? తెలియదు మహిషికకట. 11

తే. గీ. శుక్లపక్షపు జంద్రునిఁబలె శోభనంపుఁ
దేజుతో నలరారి వర్ధిష్ణుఁ డగుట
కా విసువు నోచఁ దరరె కర్మానుభవము
కతనఁ గృష్ణపక్షపు శశిగా క్షయించె. 12

జనియించిన సంగతి యెఱు
గునొ లేదో యన్నకరణిఁ గుంభినిపతి మ
న్నన యుండె రాజపుత్రుం
డనినంతనె లాభ మేమి యన్యుఁడె మెఱుఁగ ? 13

సీ. గర్భదరిద్రుని కడుపునఁ బొడమినఁ
దల్లి వైద్యుల సవిధమున కరిగి
బతిమాలి మందులు ప్రతిదినమ్మును దెచ్చి
దేవళమ్ముల కేగి దేవుఁ దాను
మ్రొక్కి మ్రొక్కించి యేచక్కి నే బైరాగి
కలఁడన్న వీఁక నక్కడికి నేగి
వేర్లు వెల్లఁకులను వెలిబూఁదియను దెచ్చి
పలుపాట్లుబడి పుత్రు బ్రదుకునటును

తే. గీ. జతన మొనరించుఁ గాని ఘోషాకుఁ బుట్టి
యిల్లగు నరేంద్రమహిషికి నేవిధమున
విసువు ప్రతికించుకొనియెడి యెసక మమరు
నంతిపురమున విసువుతో నతిప్రమఱుఁగు. 14

తే. గీ. పెద్దరాజేంద్రమహిషికి బిడ్డయయ్యె
జాతకర్మ మెఱుంగఁడు నరియె నామ
కరణ మెవ్వఁడొనర్చు భూకాంతుకన్న
కొమరునకుఁ దల్లియే పెట్టికొనియెఁ బేరు. 15

కం. భద్రాయువగుతమంచు ద
రిద్రాంగవగాని యా దరిద్రాంగవ త
ద్భద్రమ్ముఁగోరి పేరిడి
ముద్రవపు సముద్రమందు మునుగున్ దేబున్. 16

తే. గీ. పిట్టరూ పూసరిపు(డుంట్లు పితరజఠర
మదరు నా కుట్టనిం జూడ నదరు నేవ
మఱియుగ్మంబు నాసనొం పమరియేమి
సేయు నామయ మఖిలమ్ము చెఱుపకున్నె? 17

కం. అయతి శివమగు వానికి
నేయందము(జంద ముండ క్షేమగు? నా సు
శ్రీయెల్ల నామయముతటి
బాయున్ బాయకయు( బైకి( బాసినయట్లై. 18

తే. గీ. ఈశ్వరుని యంతవానికి వించుకంత
కంఠమందే యటందుము గరళచిహ్న:
పాయ దిప్పటికిని వీని(బాసి చనునె?
కడుపులోనున్న నా(దట్టి కస్తి తవిలె. 19

తే. గీ. భావికాలంబు మంచిదై పరగువార
లెల్ల నిట్టి యిక్కట్టు లెన్నెన్నొ కడచి
పైకివత్తురు విషము గర్భమున(బడిన
పిదప(గూడ( జాకుండుట వింతగాదె? 20

కం. విసువో లేకుండినచో(
బ్రసవిత్రియొ ముందు( జమ్పపయి విర్వ్యరకున్
బొసగుణ మృతి యాయతి కడు
పసిగా నున్నప్పు డెవరిశక్యముచంపన్? 21

తే. గీ. వహ్నిలో(ద్రోయ నదిచల్ల(బడును జలధి
జొనుదఘ్నంబ యగును విసమ్ము వెట్ట
నయ్యదియు జీర్ణమగు నేరి కాయతి శుభ
దంబుగా నుండు వార లెత్తటిస్(జెడరు. 22

కం. రానుండిన సుఖములరుచి
యేనరుఁడు క్రమించుఁ బూర్వ మెఱుఁగునవాఁడై
యేనరుఁడు కష్ట మెఱుఁగడొ
యానరునకు సౌఖ్యమిడునె । యానందమ్మున్? 23

వ. ఒక్క కష్టసుఖమ్ములం గూర్చియకాదు. జ్ఞానాజ్ఞానానుభవమ్ములఁ గూర్చినైతము విజ్ఞులట్లే వచింతురనివెండియు. 24

కం. విద్యన్ దెలియుటకొఱ క
వ్విద్యాకార్యముల ననుభవింపన్ వలె సూ
ర్యద్యుతి బడలని వానికి
హృద్యంబై చెట్టునీడ యెసకం బిడునే । 25

వ. ఇదియిట్లుండె నా రాజనందనుండు మృతుండుగాకున్నను, సర్వదా వ్యాధిజనితపరితాపంబుకతన రోదనంబొనర్చుట తండ్రికి విద్రాభంజకంబుగాఁ దోచుటయకాక యందుఁకుఁ బరమదుశ్శీలయగు సపత్ని దుర్బోధంబు తోడై యక్కతినుండు పట్టమహిషిని బుత్రసహితంబుగఁ బురంబునుండి యవలకిం గొంపోయి వనంబున డించిరమ్మని రథచోదకున కాజ్ఞాపించుటయు వాఁడా రాజపత్నిని బుత్రసహితంబుగా వరదం బెక్కించుకొని చని యట్లొనరించియు, సుశీలం దగు కతన దనయొనర్చిన దుష్కృత్యంబునకు దన పరాధీనతయకదా కారణంబని వగచుచు నమ్మహారాజ్ఞి చరణంబుల పయింబడి యేడ్చుచు నిట్లు క్షమాపణంబు వేడికొనియె. 26

కం. నృపునుప్పు దినుకతంబున
నపకారం బేనుజేసి యఘమునఁ బిదపఁగా
దపియింతు రౌరవమ్మునఁ
జల్లుఁడ నపరాధి నన్ను సైఁపుముతల్లీ । 27

కం. నృపుఁ డలఘుఁడయ్యుఁ దల్లీ!
సపత్ని యొనరించు నా యసద్వ్యధలు త
ప్పపచారమనక నీకి
యపకృతిఁ గల్పించె నేమియనఁగా నేర్తున్? 28

ఆ. వె. అంతిపురమునంద యాత్మజుతోఁగూడ
నుండ నీకుఁ జోటు కొండొకందు
లేదె! లేదయమ్మ పోఁదరుమఁగనేల!
కోటలోన పేఁటుపోటులేదె! 29

చ. పురమున వేఁటుపో టొసఁగఁ బోలదె? యీసిరి నేఁడొ రేపొ ని
ర్జరపతి స్వర్గముం బలె శిరంబునఁ దాల్చెడి యీనిసుంగు కా
పురమొనరింపఁ గొప్పగజముల్ ధరయే కలవయ్యెనే! నిరా
దర మిటు సేయుకారణము తప్పయి భావిశుభాన కంటొ! 30

ఆ. వె. పత్ని వీవు పరమపాతివ్రత్యధరి
శాంతిరంగ వేసు నధిపులెంక
వనముగాక నృపతిననటన్నె! లోకమ్మ
మూకుమన్నె దావిమూయుపోఁడె. 31

కం. పగపట్టుము తల్లి! యొకచో
"నగునూకలెయగునుబట్టణమ్ములు" నాకు
భగవంతుఁడు తోఁపించె
న్నిగమంబిది నీను తుండు నృపుఁడయితీరున్. 32

ఆ. వె. ఏమి మునలినాదు నీయనంతము నా
చిన్నికొడుకుదోలు సిరియు దెల్లఁ
గనుంకెదుట నాకుఁ గట్టిన ట్లగుపట్టుఁ
గష్టకాల మెల్ల గడచిపోవు. 33

చినయైశ్వర్యము వలదను
కొనుమణ వనమున మెలంగెఁ గోమలివనటన్. 40

చ. విసువులఁ జంకఁబెట్టుకొని నెత్తిని మోపునుబూని యిండ్లకున్
వెసఁజను కూలిమాలెతల వీఁకఁగనుంగొని బౌర ! యేటిరా
జనములు ? కాలుసేతుల నొసంగినవెందుకు దేవుఁడన్న నీ
రసులకు నున్నయుత్తరము రాజుల కుండదటంచుఁ దోఁచెడిన్. 41

ఆ. వె. కన్నచిన్నివిసువు గరిశంబుకతమున
బక్కచిక్కియున్నవారిఁ జంకఁ
దాల్చి నడువలేనివానికి నైశ్వర్య
ముంచెనేమి లేక మందెనేమి ? 42

తే. గీ. ఎపుడు లెంకలపైఁ దనయెల్లభరము
పెట్టి కాల్సేతులకుఁ బనిపెట్టకుండ
బ్రదుకువారలఁగని మెచ్చువారి నేమి
యనిన ననవచ్చు మోజకు లల్లవారు. 43

కం. నడువంగఁ గాళులును బని
వడుచోఁ జేతులును నటు లవయవతతిని దే
వుఁడొసంగె నెందుకెందుకొ ?
ముడుచుకొనినఁ బలువిధముల ముప్పగుఁ బిదపన్. 44

కం. తన యాత్మకుఁ దనయాత్మయె
పనివడ నుద్ధారకంబు పరులంగుమరొకో ?
తన యాత్మకుఁ దనయాత్మకు
ననదకు నుద్ధారకత్వ మదియెటులొకదా ? 45

మ. చనలే నీయటవీప్రదేశమునఁ బాషాణంపుఖండంబులెం
దును దర్భాంకురముల్ పొరింబొరిగ నన్నున్ జాలఁ దూలించు నా

తమవే నాకుభరంబు, దాసినయినం దాఁదోడుగా నీఁడుగా ?
జనపాలుం, డెటుకుఱ్ఱనెత్తికొని నే సాఁగింతు యాత్రార్థినై. 46

ఆ. వె. దారిఁబోవునట్టి దానినేఁ బిల్చిన
వచ్చెఁగాక, దానికిచ్చి చిఱుత
నడుతునన్న దానికిదఁగనేముండె నా
యొద్ద, నెట్టికష్ట ముప్పతిల్లె? 47

వ. ఇట్లు పలుతెఱంగుల నాక్రోశించుచు నూరిదారిం బట్టిపోవు కాపువెలందులతోఁ బుత్రసహితంబుగా నొక్కపట్టణంబుచేరి నాఁటిరేయి నొక కాపుగేస్తునింట నతనియిల్లాలిడిన క్షీరంబులచేఁ బిల్లండును దానును బ్రాణధారణంబు చేసికొని మఱునాఁడు చంటిపిల్లనితో నేమియుం దోఁపక వెఱ్ఱిమానిసితెఱంగున పిదింబడిపోవు నాయమ్మంజూచి పౌరులతమలో. 48

చ. ఎవరయియుండునీపె. యిటకేటికివచ్చెనొ ? పల్లకీని డి
గ్గవిడిచి వచ్చినట్టి నృపకాంతునికాంతయె. నందియుంబులే
దవనిపుకాంతయే యయిననందఱ కిట్లగుపట్టనేం ? తో
డెవతెయులేదుదాసి. శిశునెత్తికొనెన్ పతియే స్వయమ్ముగన్. 49

కం. అడిగినఁజెప్పునొ ? ఉత్తర
మిదదో ? యేభూమిపాలునింతియొ ? మనయూ
ర్పుదమికి నేకారణ మీ
బిడవిచ్చేసినదొ ? చంకబిడ్డనితోడన్. 50

వ. ఇట్లు పరుపురు పలుతెఱంగులఁ దన్నుంగని గుసగుసలాడుచుండ నారాణివాసంబు పరవశంబగు మనంబుతో నేవిషయముంగాని గమనింపకయే ముక్కుసూటిగాఁ బోవుచుఁ దనలో. 51

చ. పతి త్యజియించెఁగా యనెడివంతకుఁజింతిల. మత్పతిన్నిచే
వెతగుదిపింపలేక యిటువీడుట లగ్గనియెంచఁబోఁ, నీ

సురుసరు నెప్పుడో విన మసూయమెయిన్ దివిపించుచో ధరా
పతి తదధీనుఁ దప్పుదెటు జాలవిప్రాణము లాఁగఁజాలెదిన్. 52

ఆ. వె. ఆఁడువాండ్రలోన నందఱుఁజెట్టలే
యవిన నాకుమాత్ర మది సమున్వ
యింపదోక్కొ ? సవతియెద మాత్ర మేపాప
మేని చేయఁగొంక దింతివిజము. 53

తే. గీ. కైక మంచిదిగాదనఁగలరె ? యెవరు
రాము నెద నాపెకుఁగాలేదె ? ప్రేమమకట ?
ఆపె కౌసల్యకుసపత్ని యగుకతమున
నంతటి దురంతమునకుఁ దా నగ్గమయ్యె. 54

కం. కౌసల్య కైకకంతటి
యాసునకుఁగా దగినదోస మేమొనరించెన్ ?
దోసమ్మెయ్యెద నొక్కవి
కేసతులగుటయె మఱొక్కఁ డెందులకింకన్. 55

కం. తనపత్ని నతిధికదకున్
బనిచిన ప్రతిశీలురు వినఁబడుదురు పురుషుల్
తనపెనిమిటి విఁకనొంటొక
వనితకు విడిద్రమకలేమ వనితయెవతెయున్. 56

తే. గీ. ఎంత శాంతిదాంతులు గల యింతియేవి
యెంత పరుల శ్రేయము సైఁచునింతియేవి
యెంతపరమార్థ మెఱిఁగిన యింతియేవి
సవతిశ్రేయంబు సైఁచుట "సర్వకల్ల". 57

---

టిప్పణి : 57 వ పద్యములోనున్న "సర్వకల్ల"కు—శ్లో॥ లోకోక్తిరాం లవే ద్యోగో యరావ మ్పృతిరంజనమ్. (ఆహోబల మా.)

కలిమిలేములనంగను గావడిపట
ములఁగదా ? యబ్బుస్రుక్కుల మునుఁగనేల ? 62

వ. ఇట్లోదార్చి సుతానిర్విశేషంబుగా నావైశ్యసత్తముం డాపె నాదరించుటయు నా మహారాజమహిషి గతంబు మఱచినను మఱపువగులని కతన నప్పుడప్పుడు స్మరించి వనరుచుఁ దనూజునితో శుభకాలం బెప్పుడువచ్చునో ? యనికొనుచు సుఖంబుండె. 63

కం. కొమరుని యారోగ్యమ్మువి
షము గర్భమునంద తవిలి జనియించునిమి
త్తమున నొకమాదిరిగ నుం
డి మహారాజ్ఞికి ముదంబు నెగడక యుండెన్. 64

కం. ఆ వైశ్యకులోత్తంసుం
డావిర్భూతానుకంప నా పిల్లనికై
తా వైద్యులఁబిలిపించున్
దేవు మహేశ్వరు యజించు దినదినముఁ బొరిఁ. 65

కం. దశదప్పివచ్చెఁ దత్తా
దృశభూమిపు కొమరుఁడయ్యు నిమ్మెదకని త
ద్వశమైన మనసుతో నా
విశుఁ దప్పిల్లనికిఁ జేయు వివిధోపకృతుల్. 66

తే. గీ. ఎన్నివిధముల మందుల నీయఁజేయుఁ
గాక విషముపిండమునకె నోఁకినట్టి
దాని బ్రదికింపఁజేయుట వశముగామి
నొకట నప్పిల్లఁ డంతమ్ము నొందుటయును. 67

వ. తల్లి యెన్నోవిధమ్ముల విలపించుచునంత నా వైశ్యభూపతిభార్యయుఁ దక్కుంగలవారును పలువిధముల నోదార్చుచుండిరి. అట్టితఱి దైవ

ప్రేరితుండై ఋషభుం డను నొక్కమహామునిపుంగవుండు శివయోగి
యేతెంచి. 68

కం. జననమృతికి వేద్యెర
రేవాఁడు జనింపఁ బ్రాణి యెపుడో మరలం
బ్రాణమ్ము విడుచుఁ గావున
దానికిఁ జింతింపరాదు తజ్ఞు లవవరులా. 69

వ. విని యావైశ్యవరుండు మహాత్మా! యెంతటివిజ్ఞానులకేని పైకి
మాటుమాటలు చెప్ప వలనగును గాని యావిధమున సంచరించుట
సంఘటింపదుగదా! యని వెండియు. 70

కం. తమవంటి మహామహులకు
నమనస్కజ్ఞానధనుల కబ్బెడి విజ్ఞ
త్వము సంసారుం డేగతి
సమరున్? జావన్న నేడ్చుటది సహజంబే. 71

తే. గీ. చావుకన్న విచార మెచ్చటను లేదు
పెండ్లికన్న సంతోష మీపృథివి లేదు
అనెడి లోకోక్తి మీ రెఱుంగనిది కాదు
మీరుదలఁచినఁ గానిదేమియును లేదు. 72

కం. శివయోగుల మహిమమ్ములు
కవులు లిఖించిరి పురాణగాథలలో న
య్యవి తథ్యములే యగుఁగా
ని వృథావాక్యము లటంచు నేఁ దలపోయన్. 73

తే. గీ. అయొ వైద్యమ్ములన్నియు వమ్ముకున కా
కింతయేని యుపకరింప దేదికూడ
నెందు కేతెంచితిరొ? తమ రిట్టివేళ
మీరు తప్పెమ్మనంగిన మృతుఁడు బ్రతుకు. 74

తే. గీ ఏదియో భాగ్యముండుటయే ధ్రువంబు
కానిచో మాకు నీదృశకష్టకాల
మందు మీవంటి యోగుల దైవ దర్శ
నంబు చేకూరుటకు నిమిత్తంబు గలదె ? 75

కం. అని యావైశ్యోత్తంసుఁడు
తన తనయునిఁ బోల్కి- విసువుఁ దనతొడపై మిం
చిన పేర్మిఁ బెట్టుకొని య
య్యనఘునిఁ బ్రార్థింప మునికి నాత్మగరంగెన్. 76

వ. అట్లార్థించెైన మనమ్మతో జ్ఞానదృష్టికతన గతవృత్తాంతమ్ము
సర్వమ్మెఱుంగుటేకాక భావివృత్తాంతమ్ముసైతము విశేషమ్ముగా
నెఱింగివెండియు. 77

మ. ఎవరికోమటి ? యర్భకుండెవఁడు ? నీఁడీరితిఁ దాఁగన్నబి
డ్డవలెం బ్రేముడిఁజూపు నిట్లుఁ దితఁ దేడంబంబునుగా లేదు. పే
దవలెన్ వర్తిలు, నీనివర్తనము తద్దన్నుత్య. మీయర్భకున్,
శివమంత్రమ్మునఁజేసి యేను బ్రదుకఁగాఁజేతున్ గతప్రాణునిన్. 78

కం. అని తన శ్రీఫలమున నుం
డినభూతినిమీదఁజల్లి డింభకుప్రాణం
బును రాఁజేసిన నప్పటి
జను లాశ్చర్యంబు నొందపాఁగిరివేడ్కన్. 79

వ. తల్లియు నయ్యార్యుజభూస్వామియు నయ్యనఘు ననేకవిధంబులఁ
బ్రస్తుతించిరి. అనంతరం బా శివయోగి యాబాలకు జననికింగూడ
విభూతిమహత్త్వమ్మునం జేసి విషదాధానోదనంబు కటాక్షించి
పాదరాలోకనంబుల నాపె నాలోకించి యిట్లనియె. 80

ఉ. ఏనిటు నీతనూజునకు నిచ్చితిఁ బ్రాణములన్న నందుకుగా
మానిని ! హేతువున్నయది మంచియుఁబెద్దయుఁ బూర్వజన్మ త

దృతి కెదలోఁగి నీసుతునకిచ్చితిఁ బ్రాణము, బాహ్యమన్నదో
సతి! కతమిద్దియే యితరజన్మపు సంగతు లబ్బెయుండఁగన్. 87

కం. గతజననిలోఁ బొనరించిన
సితికంఠువిపూజ నరుదిఁజేయు ధనికుఁగా
నితికర్తవ్యం బెఱుఁగని
మతిహీనులు భోగములను మరగుదురు వృథా. 88

తే. గీ. స్రక్సుగంధకాంతాదుల రాణఁదలఁచి
జ్ఞాని యదిక్షణికంబని గనువిరక్తి
కల్పనారుచులందు నజ్ఞాని తవిలి
యానురణను భ్రమించు నిరర్థకముగ. 89

ఉ. అక్కజమయ్యె విద్యుఁ డితఁ డయ్యె బరార్థనియుక్తవృత్తియై
"దిక్కనుమొక్క" లేని విను దీనను గన్నతల్లిఁబోలె వె
ల్లక్కటికంబుతోఁ బెనుచు టంతటఁబోక మృతుణ్ శిశున్ దయా
వృత్తియి యింతిమందున ధరించెనె? యెంతటిసజ్జనుఁ డహో! 90

తే. గీ. పెండ్లిజరుగుచోటి కెల్లరుఁ బేర్మినేగి
చూతు రెవఁడేని మృతిచెందుచోటి కేగ
రవలిపీఠిని బోము రీతీ నను చెయిది
ఋషులకేని చేసెడి నొజ్జటీకము వెండి. 91

తే. గీ కనుఁడవోఁగొట్టి దేవుఁడు జ్ఞానమిచ్చె
నన్నయట్టులు రాజ్యసుఖాదికంబుఁ
బాపినను నీకుఁ జక్కని ప్రాపొసంగె
నితనిగృహమంద యుండుమీ నేగివత్తు. 92

వ. మరల నావశ్యకతంబట్టి యేనువచ్చి నీకొమరునకుఁ గావలసిన మం
త్రోపదేశాదికం బొనర్పఁగలవాఁడ నిందులకు నాంతరంగికంబగు
హేతువుకలదు. గతజన్మంబున నీ వివ్వాని యుపకారంబు వడసి

వను యుక్తవయస్కుండయ్యె నంత ఋషభయోగీంద్రుండు మరల నతనికి శోపపన్నుండుగా దర్శనంబిచ్చి శివకవచం బుపదేశించి మంత్ర పూతంబగు భస్మమ్ముచే నతనికి సర్వాంగరక్షణం బాపాదించి వెండియు. 98

కం. ఒకఖడ్గంబును శంఖ
మ్ము కటాక్షించి యిట్లనియె, భూపాలకపు
త్రక ! నీవు వింక రిపులె
రికి నంకవు నీకుజయ మరిందమ ! చమూ ! 99

కం. అని పనిచినఁబని మాగధ
జనపాలుం దపహరించు జనకుసిరిని జ
య్యన మగుడఁదెచ్చి యిది తం
డ్రిని సంతసపడఁగఁజేసె నృపసుతుఁ డెలమిన్ 100

వ. పదంపడి ఋషభయోగిపుంగవుండు వీఁడు నీకొమరుండు గర్భమ్మున నున్నతఱి వీనికి విషదోషంబు తగిలి యయ్యెడి తుదకు మరణం బాపాదించె భగవంతు ననుగ్రహమ్మునం జేసి యెట్టకేలకు బ్రదికె వీనిని వీనితల్లిని నీవు నిష్కరుణుండవై సపత్నీదుర్బోధంబునకు లోఁగి యారణ్యంబున దించి రమ్మని రథచోదకునకు నాజ్ఞ యిచ్చిన వృత్తాంతమ్ము జ్ఞప్తికిం దెచ్చికొమ్మని వెండియు. 101

కం. భూమీశులు బహుపత్నుల
నేమముడిగి కట్టుకొంట నేఁటిదిగా దె
ప్డో ముసుపే కలదందుకు
నేమియు ననఁగాని యొకటి కేవందు వినుఁడా 102

తే. గీ. గర్భవతిగాఁగ నుండినకాలమందు
విసముపెట్టించె వేఱొక వనరుహాక్షి

యెల్లా రావక ప్రవహించె నితవితల్లి
వదలిపెట్టుదురే ? పుత్రవతినిఁ గల్సి ? 103

తే. గీ. ఏమిదోషమ్ము చేసిన దీవెలంది
దాని బ్రదుకుట యగునె ? దోషము. నృశంస
కృత్య మొనరించితివి రాజ నేఁగదా ? య
టంచు. రాజైనయంత నేమయ్యె నకట ? 104

కం. రాజయినయంత నంతయు
యోజన యుండంగవలదె ? యొరు లవరము ము
ద్వేజితులుంగు కతమున నీ
తేజమునకు. వెఱపవాగ్గా ? దేషం దరరే ? 105

తే. గీ. ఎందఱో యేలినారు మి న్నేగినారు
పేరు మారుమలేక నీతిరు గూన
నట్టులే యయ్యెఁ, జూడు పిఁవద్దఁదఁద
యేపి కారాగృహంబున మృతుఁదవాడు. 106

తే. గీ. పిరిగలుగుఁగాక యబ్బురపౌరతనంబు
పాపకార్యంబుఁవొనర్చి వరమెకాక
యిహమునైతము, జెలుపికొం డేటికిలవి
పుత్రువిం దల్లి వెదలించె పురమునుండి ? 107

మ. దర వత్యుత్కటపుణ్యపాపములకుఁ దత్తత్ఫలావాప్తి చే
కుఱు వెన్వెంటనె యంద్రుకోవిదులు. నీకున్ వారివాక్యంబుచే
దురితం బయ్యెరిరూపమై యదరిమే దుఃఖంబుగల్పించె. నె
వ్వరికిం దప్పునె? కట్టికుర్పక యహంప్రాగ్భార మూర్వీశ్వరా । 108

వ. అని వెండియు నీయొనర్చిన దురితంబుకతన వనయుకుఁద నమగ్ర
హించి నీ జాయాపుత్రులం గాపాడినవాఁ డెవ్వరో నీ కిప్పటికిని
దెలియదుగదా యనివెండియు 109

చ. కలరిలఁ జెక్కుపాతకులు కశ్మలచిత్తులు, పుణ్యమూర్తులున్
గలరు; కతమ్ము లందెవరొ! కాంచితిఁ, గాంచుచునుంటి, నీవలెన్
గలుషులు, వారిఁబోలు ననుకంపితచిత్తులు మృగ్యులెందు, రా,
జాలు వినుగౌరవింతురని చూచితె? నిష్కరుణుండ వెమ్మెయిన్. 110

కం. ఏకోమటి నీతనయుఁ
సాఁకెనొ నీభార్యతోడ జనకుఁడబలె, నీ
వా కోమటికి క్షమాపణ
మీఁకం బొనరింపు, కొంత వృజినం బడఁగున్. 111

వ. శత్రుకృతపరాభవంబుకతనఁ గొంతయఘంబు సురిఁగెఁ దక్కిన
యఘం బవ్వైశ్యోత్తంము సందర్శించి 112

తే. గీ. రాజ వేసనునట్టి గర్వంబు విడిచి
వేడికొనుము క్షమాపణ, వాఁడొసంగె
నేని కామదుఘిఁగైకొని పృథివికి నధి
పిష్టుఁ జేయుము, వాని ధిక్కింపు మరిగి. 113

వ. నావుడు వేఁడు పశ్చాత్తప్తుండై యమ్మహాయోగి కాళ్ళపయింబడి
యిట్లు ప్రార్థించె. 114

ఉ. చేసితిఁ బాపకృత్యములు, సిగ్గుదయించెడి నాకునెంతయో:
దోసమొనర్చి యేమొగముతోఁ గనఁజాలుదు నింతిమోము? మీ
దాసుఁడ నా విదగ్రసరు దర్శన మేగతిఁజేతు? మీరె నా
దోసములన్ క్షమించి దయతో పమకూర్పవలెన్ సమస్తమున్. 115

కం. చేసినపాపము చెప్పిన
నోసరిలు నటంచ్రు పెద్ద లగ్గురిబోధం
జేసి యఘ మాచరించితి
వాసతికింజెప్పి మీరు నను మనువఁదగుఁ. 116

వ. అని వెండియు. 117

కం. ఆ నిష్కారణబంధున
కేనేమియొసర్పనేర్తు? నిర్మలచరితా! మీ
రో విప్రవరా. యిరువురకును
నే ననుమర్త్యుండ, నెట్టి నృపుండ నధముండనగా. 118

ఉ. ఏకణ మేని యాననమునెప్పుడు వాడిబుణంబు దీర్పఁగా
జేకుఱు భూమిపాలురకు. పీ! యని సర్వము రోయువారికే
ప్రీక ఋణంబుదీర్పఁ, బృథివీపతుండ గొంచఁ జాలనట్టి ము
క్తికునకే యుపాకృతిని జేసి తరించెడి రెండు వట్టివే. 119

కం. కావున మీకు ఋణస్థుఁడ
నేవిధమునఁగాని దీర్చుటియుణము సమన్
భావితుని జేయుడని మీ
పావనసేవనమః వేఁడెడ మేది? యుంకన్. 120

వ. అని చరణమ్ములం బడి లేవక యత్తుకణమ్ములఁ బరిషేకించు నాపత్రబాహానిమోదం గడుణించి యా శివయోగి యా వైశ్యోత్తముని గృహమ్మునకున్ దీసికొని చనుటయు నతఁడు రాజమర్యాదలతో సత్కరించి గౌరవించెఁ బదంపడి. 121

చ. నృపమహిషి గోమాత్ర నెటులెప్పుసిరుల్ గంపుట్టినింటివా
రపరిమితంబుగా వరిణమయ్యని యిచ్చి తగంగ పంపి దుః
ఖపడుదు రట్లనే నిరుఁడుఁ గాంతయు నెంతయుఁ జింతనొంది రా
నృపతి పతిసమేతముగ వేగ సుతుంగొని రాజధానికిన్. 122

వ. పదంపడి ఋషభయోగీంద్రు ననుమతంబునఁ దన తనయుండు జయించి బంధనాగారమ్మున మంచిన మగధేశు విడిచి సగౌరవంబుగాఁ దత్పురంబునకనిపి తన కొమరునకుఁ బట్టాభిషేకం బొనర్చు

నంతఁ జంద్రాంగదుండను రాజు తన కొమిరె కీర్తిమాలిని యను కన్నియను మీకొమరునకుఁ బెండ్లి చేసికొనవలయునని కోరుటయు ఋషభయోగీశ్వరు ననుమతంబునంజేసి యట్లనొనర్చి రాజ్యభారం బెల్లఁ బుత్రునందయిడి తాను బూర్వరాజర్షులంబోలెఁ దపంబునకుఁ జనియె. వియ్యది శివయోగుం మహత్త్వంబు దెలుపు పుణ్యచరిత్రంబు దీని పఠనశ్రవణాదులు నిరామయాయురారోగ్యభాగ్యప్రదంబులని సూతుండు శౌనకాదులకు వక్కాణించె. 123

కం. దేవా! "యావత్తైలం
తావద్వ్యాఖ్య" యని నే మొదలుపెట్టితి నీ
సేవకుఁడ వేంకటేశుఁడ
నీ వాత్సల్యమ్ముఁజూపి నెగ్గింపు శివా! 124

భద్రాయుశ్చరిత్ర

సమాప్తము.

వందమైన జంగమాకృతిఁ దోఁద పా
లాక్షిఁ దాపె యింటి యంగణమున. 6

ఆ. వె. పిలిచి యాదిగంపుఁ జెలిఁ బిల్చి మారాక
తెలిపి లోనికేఁగ వలనుపడునొ ।
వలనుపడదొ ? త్వరగ వార్తనందిమ్ము మా
కనుచు నదియు లోనికరిగివచ్చి. 7

కం. మునిమునినగ నలరఁగ న
క్కుసుమాయుధజేతఁ గాంచి కోమలి యిట్టుల్
రసికావతంస । మీసం
తసమున్ విని వార్తనంపె దానిన్ వినుఁడీ? 8

తే. గీ వచ్చెనేనియు విటకురావలదు రాక
యున్నచోట రావచ్చు నిందొచ్చెమించు
కేని లేదనిపల్కె మా యెమ్మెలాడి
యర్థమెఱిఁగి లోపలికిరం డనఘ ! మీరు. 9

కం. మానూఁగుమీసముల గరు
ణానగువగుమోము వొలుచుజాణ శివున క
జ్ఞానవమాటల చాతురి
లోనర్థంబై గమించెలోనికి నెలమిన్. 10

కం మీసము పూర్తిగ వచ్చిన
చో నరనకు రాఁగనీను సుందరుఁడగుఁగా
కే నరుఁడు మానూఁగున్
మీసలవాఁ డతఁడ నాకు మింతంతగుతన్. 11

తే. గీ వేశ్యకూఁతు సూత్రమునకు విశ్వవిధున
కర్థమంతకుఁబూర్వమ యైనకతనఁ

దగినప్రాయమ్ముతోడను దగినరూపు
తోడఁ బ్రత్యక్షమయ్యె నా దొంగవిటుఁడు 12

ఆ. వె. తనదు సూత్రమునకుఁ దగుణుఁ డవ్విటునకు
నర్థమైనయట్టు లబ్జముఖికి
వచ్చిరానిమీన లిచ్చెఁ బ్రత్యుత్తరం
బతనిఁ గాంచి మెచ్చి యతివమున్న 13

వ. ఇంతకుమును పూఁదిగపు వెలందుం జేయుంచు పాదప్రక్షాళనంబు
స్వయముగా నెఱపి తన్నీరంబు శిరమ్మునం జల్లుకొన్నంత. 14

కం. శివభక్తురాలి కాపెకు
శివుఁడేమో యన్నయంత చేతోమోదం
బవిసిన మఱలిచికొని తన
దివ్యవృత్తినియమము లతనికిది తనఁజెప్పెన్. 15

వ. కేళిగృహాభ్యంతరమ్మునందుంగల దారుఫలకమ్మునందుఁగల యక్షర
మ్ములనెల్ల నట్టహాసవిటుండు పఠించి యెలనగవలరు నవ్వేళ
వెలందిమిన్నకుఁ జెలువవ్వతో నిట్లను. 16

తే. గీ. మూఁడురోజులు నేను నీతోడ నుందు
రోజ కివేరుపఱచిన రో యొనంగు
వాఁడ నివృదకైకొ మ్మవం బలసిన
మఱల నేర్పడుఁగావుత మనకు గఱువు. 17

వ. అనేకకారణమ్ములంబట్టి విటవిటులకు మనంబులు మొదట నను
కొన్నకంటె నెక్కుడుగా నేకీభవించుటయుం గలదు. విడిపడుటయుం
గలదు. తత్కారణంబులు కామకలాభిజ్ఞాలవగు నీకు విస్తరించి
వ్యాకరింపంబనిలేదు. నీవు నీ నియమమ్ములకు భంగంబు గలిగింపవని
నాకు గోచరించుచున్నది నీ కులవృత్తియందలి కాపట్యమ్ములెల్ల

ననుభవపూర్వకంబుగ నెఱిఁగి "వాదివదపోసి" యుంటంజేసి కొం
డొక వక్కాణింతు నన్యథా తలంపకుము. 18

ఆ. వె. "అంతఃపురంబుకన్న నాదివి విష్ఠు
రంబు మేలు" గాదె? యంబుజాక్షి?
మూడురోజులేను ముగుదమగండ నీ
వాలుసుమ్ము మఱచె దతివమిన్న? 19

కం. లక్షలిడు తేండ్లువచ్చిన
వీక్షింపఁగరాదు వారివించుకయుఁ గటా
క్షేక్షణములఁ బిమ్మటరం
డీక్షింపదటంచుఁ జెప్పుచేతగుఁ జెలియల్. 20

కం. వలసినచో మఱికొండొక
వెంధన మిపుడిదెవఁగోరు వెలవెలఁదివి నీ
కెలజవ్వనమే జీవన
మెలతనమిది నడలవచ్చు నెవ్వండటుపై. 21

తే. గీ. యౌవన మ్మొక్కటియె వయఃప్రాయమునను
రెంటిఁ బోషింపవలయు నీరేరుహాక్షి?
కాన నధికంబుగోరెడి దానవేవి
తప్పులేదిత్తుఁ గోరుము ధనము తరుణి? 22

తే. గీ. అందగత్తెవు కడుమరియాద గలుగు
దాన వన్నియు నటులుండ సూనశరువిఁ
బూజసేయు కుతుకమునఁ బొల్చుదాన
వయ్యుఁ దద్వైరియెడ భక్తురాల వతివ? 23

కం. విమవంటి మగువ వేశ్యా
జనముల నొక్కంటఁగాదు జలజానన! శ్రీ

సీ. స్వీయాసుఖం బెట్టిదెల్వారునో ? పార్వ
తీదేవిఁ బెండ్లాడి తెలిసికొనియె
పిరుపురుకాంతల మరిగుగేస్తుసుఖంబు
గంగామహాదేవి కతవనరపె
దారుకావనమేగి తన్మునిస్త్రీం భాం
దసప్పుఁజైదముల తత్త్వమ్మెఱింగె
వాఁడుదై మగవాఁడు పొడిఁదప్పించు న
య్యెమ్మె పీకించె మోహినినిగూడి
తే. గీ. కాని వేశ్యాసుఖం బెఱుంగఁడు హరుండు
నేఁటి కమ్మాఁడు తెలుఁగుల బోటులెవ్వి
ధమున వర్తింతురో ? మంతనముల నెఱుఁగు
రసికజనచక్రవర్తియై యెనకమెనఁగె. 31

వ. ఇట్లు రెండురాత్రులు జరుగుటయు మూఁడవనాఁటి యుదయమ్మున నా గుహనాథుజంగళేశ్వరుఁడు మాటలాడుచునాడుచు. 32

ఉ. కన్నులు తేలవైచి విఱుగంబడి ప్రాణములన్ త్యజించె నా
యన్నులమిన్న పట్టికొని యాఁపగనాఁగక నేలఁగూలె న
య్యన్నులమిన్న తల్లిగని యాతురయై భిషజాళి సమీపసం
పన్నగృహస్థుఁ బిల్చుటయుఁ బ్రాణములే దనిచెప్పె నాతఁడున్. 33

వ. అంత నత్తలోదరియుఁ దన యేర్పాటుచొప్పున నమ్మాఁడుదినమ్ములలోఁ దనకాలింపు భర్తయగుటంజేసి యాతనితో సహగమనంబొనర్ప నుద్యమించుటయు నందుకు రోయుచుఁ దల్లియుఁ దక్కుంగల బంధుగులును ననేకవిధమ్ముల నందలించి నిఫలమనోరథులై యుపరమించిరి. మరలఁ దల్లి చేఁదీసి యిట్లనియె. 34

కం. ఇదియేమి ? వెఱ్ఱి నీ కో
మదవతి ? లోకమున వేశ్య మగఁడంచొకనిన్

మదినెంచికొనుట గాదే ?
అదియుండినయేని చావనగునె ? యతనితో. 35

ఆ. వె. పుస్తె గట్టినట్టి పొలఁతులందఱు పోవు
చున్నవారె ? మగఁడు చన్నపిదప
నట్టెయుండువనిత లనినెందఱులేరు
సహగమనము వేశ్యసతికినేల ? 36

ఆ. వె. వచ్చెమొన్న నేఁడుచచ్చెఁ గాలముమూఁడి
జంగమయ్య ? యేమిసల్పవచ్చు
వైద్యుఁబిలువనంప వచ్చె లాభములేక
పోయె నేమిసేతు ! పూవుఁబోఁడి! 37

తే. గీ. పట్టులో పిరవదలించి యింటికుద్ద
చూచుకోవలె నంతియె సుదతిమిన్న !
వెట్టిమొట్టిపనులు చేసి వెకలియన్న
పేరుతెచ్చుకొనుట మెరె ? బేలవగుచు. 38

వ. నావుడు నప్పడఁతి యిట్లనియె. 39

కం. అమ్మా ? నన్నెఱుఁగవు నీ
వెమ్మెయి బాల్యమ్మునుండి యీవృత్తికి నా
సమ్మతి లేశములేకయుఁ
గిమ్మనుటకు వీలులేమిఁ గిద్వడితిఁజామీ ? 40

ఆ. వె. పెండ్లియాడు నాఁడుబిడ్డలఁజూచి నే
నెంతొ సంతసింతు నీవు నాకు
నందకత్తెనగుట నాభాగ్యమున కొప్పు
ననుచుఁ గోరనైతి నవియెఱుఁగుము. 41

ఆ. వె. ఎట్టిదానవైన నీవుగంటివి నన్నుఁ
దల్లి మానవీయ తనకటన్న

బుట్టఁజేసియు శివశక్తిపూరితమగు
కోటఁ బుట్టించె లింగముచూచి మనుము 48

కం. మునిపూర్వులెప్పుడో జంగమ
మును లెస్స శిష్యులయి నేను గడతేఱుటకున్
గనఁజేసినారు మును ? చ
క్కని త్రోవను దెలిసికొంటిఁ గడుచిన్నపుడే. 49

తే. గీ. పట్టలింగమ్ముగాదు నేఁ గట్టికొన్న
దిందుఁగలఁడు మహేశ్వరుం డదియేను
జేసినను దోసమని యిందుఁజెలఁగు నీకుఁ
దనవి గతి జేసి తత్పదం బందికొందు. 50

కం. అని పట్టయించికొని యె
ప్పని నేనంగీకరింతు వానినిఁ బతిగాఁ
గనుసన్నినాళ్లు మొదలను
కొను గడువునుబట్టి యెంచికొని చరియింతున్. 51

కం. ఆ గడువు ముగియులోపల
రాగిలి ననుఁ బ్రదిపినేని రాజకొమరుఁడే
భోగార్థియగుచుఁ గోరిన
నేఁగక్కుఱితి వదిమేగు తెలుఁగుదె ? జననీ ! 52

తే. గీ. నా యదృష్టము మంచి దేనాఁడు గాని
నాదు నియమభంగమును బొనర్పసంపు
టనము ఘటియింపలేము పటాలనేత్రుఁ
దక్కతన నీకు నాకు లేదయ్యెఁ గలఁత 53

కం. ప్రతిప్రాతఃకాలము నే
సితిగళుఁ బ్రార్థింతుఁ బుట్టఁజేసితి వెట్లో

పతితులకొలమ్మునఁ బురా
కృతమును నిందించికొందునే? నినుఁ దెగడన్. 54

కం. అవములకేవి "స్వధర్మే
నిధనంశ్రేయః" యని ఘనమనీషు లనుటఁ ద
త్పథమునఁ దరింపనెంచితి
వ్యధఁగూర్పక సాఁగనిమ్ము పట్టినప్రతినన్. 55

వ. నేను నిన్నుఁ బ్రార్థించునది యింతమాత్రము నాకుఁ బాతివ్రత్యమ్ము నందు సుస్థిరమైన యభిలాషగలుగుట నీవెఱుంగనిది కాదు. అందచందమ్ములును తెలివితేటలును గలదానిఁగాఁ బుట్టించుటంజేసి నాకా యభిలాష తీరుట యసంభవము. మాజాతిలో నే కాణవరాకికో తప్ప వివాహభాగ్యమ్ము చేకూరదని నీచిత్తమ్మునకు విశదమే యని వేఁడియు. 56

ఉ. ఏనాఁడెఁగోరి జనయిత్రిని పెండ్లియొనర్పుమన్న నా
పై నెనరున్నదయ్యు నది భావికి నష్టియొనర్పునంచు న
మ్మానిని సమ్మతింప దిఁకమాననుగాక యటంచుఁ బంతముం
బూనినఁ గోకిలమ్మ నయిపోయిను గాకులమూఁక నీశ్వరా! 57

తే.గీ పనికిమాలు నాదాఁకముల్ ప్రాజ్ఞులై యిటు
వెట్టినారు వారలఁగాని పెట్టినట్టి
వారిఁగాని విమర్శింపఁ బూనుకొన్న
తేల ముపయోగమును లేదు దేవదేవ! 58

కం. ఇతరకులాంగనల పతి
వ్రతమునకున్ భంగము కలరాజుల దుర్మా
ర్గతికతన రాకయుంటకుఁ
గత మీదృశమైన కులమొకం దుండుటయే. 59

కం. కేదారమునకుఁ గంచియ
మాదిరి నేర్పడినకొలము మాదంద్రు వివా
హాదరము గల్గినతుల క
నాదిగ సమ్మతియుఁగలద యదిసాఁగముగా ? 60

కం. పరమవినీతులుగా సో
దరులుగ జూదరులుగా నమానుషచర్యా
పరులుగ నిర్భాగ్యులు సో
దరు లిందురు త్రాఁగుఁబోతు లభవా ? మాకున్. 61

తే. గీ. వారిపోషణ మాదు యౌవనముపైఁద
భారపడియుండు మాకు వివాహ మెట్లు?
కాన నేనుదానికి లేశ మేని యత్న
మాచరింపఁగ లేము నీ కదిం మెఱుక. 62

కం. సాఁగనియత్నం బెందుకు ?
భోగముదానిగ జనించి పుణ్యసతిగ నే
నేగతిమాఱుదు ? నన్నున్
భోగముదానిగనె యుంచిపోవుము దేవా ? 63

కం. ఒకఁడుండు దినమ్ముల గడు
వుకు లోపల వేఱొకఁడు ప్రభువుగా దిఁక నీ
వ కడఁగి శీలమ్ము పరీ
క్షకు వస్తువుగాక నేనుజంకను దేవా ? 64

కం. ఆదినములలో నొకచో
నేదేని నిమిత్తమున హృదీశుఁడు మృతుఁడౌ
చోఁ దప్పక సహగమనప
మాదృతి నీకెఱుకపఱతు వరయుము గిరిశా! 65

గో మలరువాఁడు ప్రాణము
లీమెయి నెటువడలె ? నాకునిది యక్కజమౌ. 72

తే. గీ. ఏడుపది వచ్చుటకుబదు లేమొ ? నాకు
నవ్వువచ్చెడుఁ బ్రాణ మున్నటులె తోఁచుఁ
గాని నాడిని లేశముఁ గదలిక గను
పడమి మృతిఁ జెందెనని విన్కిఁ బడఁగవలెనె. 73

కం. అగుఁగాక నేను సతమా
నగపంక్తిన్ హరుఁగూర్చి ప్రార్థించుట కీ
తగులం బేర్పఱచెనో ?
నగవాసియె వచ్చెఁగాక ? నను దరిఁ జేర్పన్. 74

కం. ఏమూరివి యడిగితి నే
బోమూరివి చెప్పఁ డేమి తోఁపదిపుడు నా
కామూరిపేరు మనమే
నాఁడది కాదంచటల్ గనంబడినమొదల్. 75

కం. పరమేశ్వరు లీలల కె
వ్వరి కర్థముగోచరించుఁ ? బరిహాసముగా
నొరులం దగుపట్టు వారికిఁ
బరిణామంబులు లేవు జనితమ్ములనేవిఁగా. 76

తే. గీ. నేను ధన్యాత్మురాల నీగానుఁ దచిర
కాలమున నన్ను దయఁజూచెఁ గాలిప్రోలి
కరుగ పనిలేదు జముని కింకరుల కేను
జంకఁ బరమేశ్వరుండు నా వంకఁగలఁడు. 77

వ. ఇట్లు పరమానందభరితమ్మగు మనమ్ముతోఁ దన్మయమ్మైన జ్ఞాన
మ్ముతో నేదియోపందుగు తారసించునప్పుడున్ బలె నాటోగిని భోగి
నికరభూషణు స్మరియించుచు నాడుచుఁ బాడుచు నేడుచుఁ దోడిచెలి

కత్తియలఁ గూడిమాడుచు భస్మావకుంఠితగాత్రయై యాజంగమ శరీరంబు సుస్నాతం బొనర్చి భస్మంబలంకరించి స్వమతాచారంబు ననంబయ్యును నయ్యది సహగమనంబున కనుకూలింపమిని దహనంబునకె తగినయత్నం బొనర్చి వెండియు. 78

కం. మలయపతి మలయజపుఁడు
నక్కలు వలసినయన్ని తేరఁగాఁబంచి ముదా
మలయుగుమఁ బిత్పృవనికివి గ
నరి చనె నా శవమువెంటఁ దత్పరమతియై. 79

ఉ. గ్రామమశేషముగా దరిలి కావిలమ్మునఁ బుట్టినట్టి యీ
లేమఁ బ్రాణమందు లవలేశముఁ దీపియెలేద యెవ్వఁడో
కాముకుఁడేగుదెంచి యెహా కాసిడి విద్యుఁకుండి చచ్చెనం
టీమె తదర్థమై మడియు నెంతవిచిత్ర మెవండునమ్మనే! 80

చ. ఇదియెదియో? విధంబనమ యెంచివరించినభర్త పుత్తెకో,
విదులుగనంగ గొంతునెడ వేసుకఁ గట్టిన భర్తపోవ నే
ముదితయొ నూటనాఁట నటుపోయిన దుండెనుగాక వేశ్య క
ట్టిదశ యుగాంతరమ్ముల ఘటించినటుల్ మును లానతిచ్చిరే? 81

కం. పట్టియబద్ధం బియ్యది
పట్టిబిభీషిక ప్రపంచము వగలాఁడి కెదో
పుట్టెనొ యున్మాదంబది
పుట్టించెడి నెట్టిమెట్టి బుద్ధులనేవిఁకా. 82

సీ. ఆబాలగోపాల మాయావిధమ్ముగా
ముచ్చటించుచు వెంటఁబోవువారు
ఊరకపోనేల? యున్నంతలో సాయ
మాచరించుట పున్నె మనెడివారు

అని నేతిగించిలు గొనువారు మించిగం
దంపుఁ దెక్కలుగొనం దలఁచువారు
దానికి మతిపోయెఁ దగుఁగాని పిచ్చఁడో
యెనె ? దాయని యిట్లు లేయువారు

తే. గీ. ఎంగదముతోఁ బనేమి ? యీవసిత చిన్న
నాఁటనుండియు శీలమ్మునకు నెంతి
నేఁటికి ఫలింపఁబోలు నానీతి వర్త
నం బనెడివారు నగుచు జనంబు వెంట. 83

కం. వేలము వెట్టిగఁ గంతే
కాలువి యుద్యానమునకుఁ గదలిచనుచు నా
భీలమ్ముగ నంటించిరి
కీల లుబుకుచుండెఁ జిత సఖి మదీ యంతన్. 84

చ. వలదని తల్లి వెంటఁబడి వక్త్రము గద్గదనిస్వనస్ఫుట
స్ఖలితముగాఁగ నేడ్వఁ జెలి తైల మమ్ములపిడి పోయవే ?
బలపదదృష్టకర్మ మిటుపాపపుజంగమురూపమై విసన్
గలఁచెనె ? యంచు వా విడిచి కన్నులనశ్రులుగార నేత్రలన్. 85

మ. గుములై పీడఁగలేక వెంటఁబడ జంకుఁగొంకు లేకంబులే
కమరుల్ మిన్నునఁజూడఁ దెల్లవసనం బాపాదముంగట్టి బొ
ట్టమరన్ బెట్టియు వేపమంద కిడిదౌ హస్తమ్మునం బట్టి యా
ప్రమదారత్నము దూఁకె జంగమునకున్ బార్శ్వప్రదేశాగ్నిలో. 86

ఉ. దూఁకినయంతలో సురలదుందుభి మ్రోఁతలనోరఁ గల్పమా
నాకులమైన పుష్పముల యంగన జంగముఁగూడ ముంచెఁ బై
నాకుఁ బృథ్విపైఁగల జనంబులు విస్మయమంద నేకమై
రా కలకంఠి జంగమువరాగ్రణి లింగముఁ దానువట్టమై. 87

కం. భక్తియె ప్రధాన మీభువి
శక్తి కొలఁది స్వకులపథము జాఱవిడువ కా
సక్తి భజింపుము శివు
రక్తి గలిగియున్న నెట్టిప్రాణి తరించున్. 88

తే. గీ. అన్నికాలముల బ్రాణుల కభవుభక్తి
భవవిముక్తికిఁ గడు మంచిబాట తనకు
నేరుపడు కులాచారము నెపుడు విడఁడొ ?
వాని శివభక్తుని శూలి తానుమెచ్చు. 89

కం. కులమని గిలమని యెంచన్
వలవదు శివభక్తి శీలవద్వర్తనమున్
గల ప్రాణి తరించెడి విం
దులకెన్నియొ ? లక్ష్యములు బుధులు చూపిరహో ? 90

వ. ఇయ్యది యప్పరమేశ్వరు ననేకలీలలలో నక్కజంబు గొల్పెడి శిల పరీక్షణలీల దీనివలనఁ దెలిసికొను సారాంశంబు తరించుటకుఁ గులంబు కారణంబు గాదనియు శీలమ్మును స్వకులాచరణావిరుద్ధం బగు భగవద్భక్తియును దక్క నితరంబుగాదను పరమార్థంబనియు నెఱుంగనగు ననివెండియు. 91

కం. ఏవృత్తి నెంచిచూచిన
నావృత్తిని దొసఁగులందు నమితంబులుగా
నో విబుధులార ? మానవుఁ
డేవృత్తియుఁ జేయకుండ నెటుజీవించున్ ? 92

వ. అట్లగుటం జేసి యెవ్వరుగాని తమతమ వంశపరంపరగా వచ్చు వృత్తుల దోషదూషితంబులని దూషింపంబనిలేదనియు నెఱుంగ నగుఁ గాని కులాచారప్రాప్యంబులే యయ్యు ఘోర చోరత్వంబు

లమసరణీయంబులుగావవి వ్యాఖ్యాతలు విశేషించి యున్నను విద్యా
తివ తనవృత్తి త్యజింపనలవిగాక యుండెయుండి తివత్తియు నటి
రారాత్రపత్రప్రాయమ్మగు శీలమ్మును గలిగి తిరిగె నటి యుంజెప్పి దివి
శ్రవణాదులవలన సమస్తబంధంబులు చేటాయినవి సూతుండు శౌన
కాదులకు వక్కాణించె. ॥

కం. దేవా! "యావత్తైలం
తావద్వ్యాఖ్యా"యగు నైనదప్పేమి? దివ
త్సేవారాధనఁ గవితా
ప్రావీణ్యవచస్సుమములఁ దవరింతు శివా!

మలయవతి చరిత్ర

సమాప్తము.



శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు - అవిఘ్నమస్తు

# శివపూజాఫలము

ప. శ్రీవిజయవాడపురవాసా! కృత్తివాసా! మల్లికార్జునదేవా! మహాను
భావా! అవధరింపు మనంతరంబున శౌనకాదులు సూతున కిట్లనిరి.

కం. రక్కసుఁడగు బాణునిపై
మిక్కిలిగా గౌరవంబు మృడునకునెట్టుల్
నెక్కొనె? వినవలయును బెలు
రక్కసులం దింతటి యనురాగము గలదే? 2

శా. కైలాసమ్మునఁబోలి యీదనుజు ప్రాకారంబునన్ గాపురం
బోలన్ శంకరుఁడాలితో సుతులతో నుండెన్ గుబేరుండునుం
బోలెన్ బాణుఁడు మిత్రుఁడే? తపముచేఁ బూజించెనేయంచు మే
కాలానం దపియింపరే! యితరరక్షస్స్వాము లీరీతిగన్. 3

తే. గీ. కోటలోఁ గాపురంబుం బొకొండెకాదు
వానిపై యుద్ధమున కేగువచ్చిరేని
తాను గలిగించుకొంచు యుద్ధమునజయము
గలుగఁజేసెడి శంకరుకరుణ యరిది. 4

తే. గీ. రావణాదులు కోరువరములకన్న
వీఁడుగోరిన వర మెంతవిలువగలది?
యెద ధరించుటవంటిది యిదియుఁగాదు
బరువుమోయక కోర్కులు వడయవచ్చు. 5

తే. గీ. ఎదను ధరియించెనో? లేదొ! యెఱుఁగరాదు
గాని యెదలోన ధరియించి కఠినతపము

వీఁడుగావించె లేకున్న వీఁడువీడి
కాపురంబుండునే ? కోటగోపురమున. 6

తే. గీ. అనినచో నిట్టు లపరాధమగునొ ? యేమొ ?
శంకరునకు బాణుఁడుగాఁడు లెంక శంక
రుండె బాణునిలెంక యంద్రుప్రజలెల్లఁ
దాఱుమాఱయ్యె స్వామిభృత్యత్వ మిచట. 7

తే. గీ. ఎంత భక్తాగ్రసరుఁ డతఁడేని వాని
ద్వారమందుఁ గాపురముంట తగనియెల్లి
దముగఁ దోఁచెడినయ్య ? సూత ! యదిమాకు
విస్తరించి వచింపుము వీనులలరఁ. 8

కం. ఇఁకనొకటి గృష్ణుతోఁ బో
రికి వీకొని యోడిపై బెఱిఁగిన మనీషి
ప్రవరుండు చెప్పికొనియెడిఁ
బకపక్షులకుఁ గతము బాణుభక్తి హరునకున్. 9

కం. శివవిష్ణుజ్వరములలో
శివజ్వరం బోడినపుడె చేతులు చక్రం
బవలీలఁ దున్మె నల దా
నవవిభునకు లేకయుండినం దరమగునే? 10

వ. అని వెండియు. 11

కం. భారతయుద్ధమునందుఁ బు
రారి త్రిశూలమ్ముఁ దూని యరులఁ గెరపి తాఁ
జేరొనఁగెఁ గిరీటికి నవి
పౌరాణికులందు రిదియబద్ధ మెటులగునా? 12

కం. శూలజయించెడి కృష్ణుం
డాలము వశిపించుచుండ నర్జునునకునా

ఖూలి జయషేలయూపలె ।
ఖూలమ్మున నరులఁగెరపి సూత । తెలుపవే ? 13

ఆ. వె. ఈశుగుణిచి తపము కృష్ణుండెకాదు శ్రీ
విష్ణువేపొనర్చె విష్ణునకు
జయముసంఘటించు చక్రమెవ్వండిచ్చె ।
నట్టిఁడెట్టులోదె నయ్య । హరికి 14

తే. గీ. ఫాలలోచన మేమయ్యె ? ఖూలమేమి
యయ్యె । హాలాహలముదిన్న యద్భుతంపు
శక్తి యేమయ్యెఁ గృష్ణుతో సంగరమ్ము
నర్చుచో నేలయోడె ననంగవైరి. 15

కం. ఇరువురు తనకుఁ భక్తుల
సురజాతి దురీహను మధుసూదనుఁడు నత
శ్రుదమాన్యుండని యిదెకం
కిరుఁడు హరికి జయమటన్నఁ గాదనరెవరున్. 16

వ. యధార్థంబు నీవలనం దెలిసికోవలయుంగాని మాలో మేమెంత చర్చించికొన్నను నయ్యది సిద్ధాంతమ్ముగా నేరదు. మాకు హరిహరులిరువురును బూజ్యులే వారిలో వారిఁ దారతమ్యం బుండినమందుఁ గాక మా యారాధనకు నిరువురును బాత్రమ్ములే పరస్పరవిరుద్ధమ్ముగా నుంటంజేసి ప్రత్యేకించి విన్నదుగవలసివచ్చినదని వెండియు.

తే. గీ. వీరభద్రుండు శివునవతార మతని
కోల్తలకు దక్షయాగమ్ముకొలకు వచ్చు
వెల్లసురలోడి పాఱి రిండీ రమాధి
నాయకుఁడు లేఁడనివచింప నమ్మునెవఁడు ? 18

కం. వరమేశ్వరు నంశమునకె
పరుగిడు సురలేమి వారిపైవాఁడగు శ్రీ

హరి యేమవి సాక్షిచ్చెం
కరు నోడించెనన నెట్లుగా నమ్మదుమో ? 19

వ. మఱియు శ్రీకృష్ణభగవానుండు నాకప్రి మహావిష్ణువుఁగారు తల్లే లేశాంశాత్మకుండు తనకుఁ బ్రకృతియాతుండైన శ్రీమహావిష్ణువు శివ లేశలేశాంశాత్మకుండైన పిండద్రుసిపాటికి నాఁగలేదనునది గమనింప వలసిన యంశము ప్రకృతము శ్రీమహావిష్ణువు లేశము సాక్షాత్రిమూర్త్యతీతుండగు పరమేశ్వరుని లేదా ? తత్ప్రియు కృశివర్యాయమును నాత్మయుద్భవముచే నోడించుచు తప్పక్క వధింపఁబూనుటకును పరమేశ్వరుని వధింపఁబూనుటకును మాఱు లవమ్మును భేదం బగుపట్టమింజేసి యింతగాఁ బ్రశ్నించు మనస్సుదు మాతుండు. 20

కం. అడిగితివి గర్వపృశ్నము
నౌయుపం రగినట్టిదివి యునుంగులకే చె
ప్పెదిదిది తక్కురులకు నే
ప్పుడుఁ జెప్పఁదగదు వినుఁడు మునివరులారా ? 21

వ. బాణుని పూర్వజన్మవృత్తాంతమ్ము నెడలఁ బౌరాణికులకే భిన్నాభిప్రాయంబులు గలవు. మనకుఁ బ్రస్తుతమువ్వానితోఁ బనిలేదు. బాణుండు సుప్రసిద్ధులగు హిరణ్యాక్ష హిరణ్యకశిపులను రక్షశ్చక్రవర్తులలోఁ బ్రహ్లాదుని తండ్రియగు హిరణ్యకశిపుని వంశమువాఁడు విరోచనుఁడను మహాదాతయగు బలిచక్రవర్తియు నేవంశమునఁ బొడమెనో అట్టి వంశమునం బొడమిన పుణ్యజనుఁడు సార్థకనామధేయుఁడు. 22

చ. తపమువ దర్పమందునను దానమునందున దేనియందు ము
న్నపరిమితంబుగా యశమునందిన పూర్వులవంటి బాణుఁడే
తపసుల మెచ్చుకోఁదగు విధంబునఁ జేసెఁదపంబు దానికిన్
గృప యుదయించి శంకరుఁ డొగింగగనవయ్యె వరంబులీయఁగన్. 23

ఉ. వరంబు లీయవచ్చిన పరమదయాకరుఁడగు శంకరుని దనపెద్దతాత
లందలె గొంతెమ్మకోరిక లెవ్వియుఁగోరక యిట్లుగోరె. 24

చ. మరణముగల్గకుండ మను మా పెదతాతలెకాక యెందఱెం
దఱొ! వినుఁగోరి రిచ్చితివి నాశనమందిరి గాని యందు నొ
క్కరుఁడు వరమిచ్చునీయెడల గౌరవముగా గనఁజేయరైరి దే
వర! అటువంటిదే వరము వారిబలెన్నినుఁ గోరనో హరా? 25

తే. గీ. ఎంతజాగ్రత్త చేసినయేనిగాని
దేహ మెల్లపుడుండ సందేహ మంద
వలసినది యోట నీభక్తి వలయునాకు
సన్నిధిని గాపురము పెట్టి సాఁకు మభవ? 26

తే. గీ. చచ్చి పిమ్మట నెందఱో సన్నిధాన
ముక్తి నొందువారలు పలుభక్తు లుందు
రింతకన్న గౌరవము నాకబ్బవలయు
శివ నారాజధానికి రావలయును. 27

కం. విచ్చలు వినుఁబూజించి భ
వచ్చరణము శరణమై శివ? భవద్దాసుల్
మెచ్చఁగ జీవితమొప్పఁగఁ
బుచ్చవలెన్ నాదు కోర్కి పూరింపు మజా! 28

సీ. నాకన్నబలశాలి నాల్గుసముద్రాల
మధ్య నొక్కఁడులేఁడు మహి మహేశ?
నాకన్నధనశాలి నాల్గుసముద్రాల
నుండు నేక్వీపాన నుండఁ దభవ!
నాకన్నజయశాలి నాల్గుసముద్రాల
పాలమందున లేమి సత్య మీశ!

నాకన్నసుంగారి నాల్గుసముద్రాల
చుట్టుభూమివిలేఁదు చూడు శర్వ!
తే. గీ. అడుగుమందువు దేవి విన్నదుగవలయు!
లేవి చెయ్యదియును విం లేమనాకుఁ
బార్వతజన్మన నీపూజ పు.ఫలముగఁ
జేసిపుట్టిన నాకెందు వేగిలేదు. 30

కం. అడుగుమవినవ్వు దేదియు
నడుగమి మరియావగాము నడిగితి నది నా
యెదఁదగు నచ్చినకోరిక
యిడు మ దకుము నీయక్కీర మేనెపఁద నిఁకన్? 31

కం. తొలి నినుఁగొలిచితి నిష్ఠం
గొలిచితి నీపింపఁగూడ గొలువపంయు నెం
దులకుఁగొలగావి కోర్కెలు
ఫలియించును వింటికీవు వచ్చిననెదియుణ. 32

ఉ. ఈవు కుపేసఁదేమొ? పినునెప్పుడుఁ గొల్వఁగనుంటి వింక నా
సేపనుఁగూడఁ జూడు మిదిచిత్తమునందున వచ్చుదేవి యో
దేవ! యిదేటివం చరుగుదెంతువుగా కిట తేను బిల్లలున్
దేవియు నీకు లెంక లరుదెంచి వసింపుము వాదుకోటలో. 33

సీ. నీకుఁగట్టించెద నిర్జరులకు గ్జూఱ
మంది గన్గొనఁగ దేవాలయంబు
హైమవతీమాత కాపెపుట్టింటికి
శతగుణంబెచ్చు ప్రాసాదమిదుదు
వెవకయ్య "కిట్టిదేఁగవచెప్పఁ"దవి యాతఁ
దను హర్మ్యమును ధర్మమునపుటింతు

స్కందున కెంతోపనందుగా( బచ్చలు
తాపించినట్టి సౌఖ్యంబొస(గుదు

తే. గీ. నలకుబేరు(డు కోమటి యతవియా(గి
యెట్టిదేనియు లొభ్యమ్ము నెట్టనేర
దీశ! నీకుతేదవికాద యేలొస(గిన
దా(చికొంట కనుమునుది( దల(పవలయు. 34

కం. నిను రావణుండు చేకొని
చని లంకన్నిలుప(దల(చి సా(గమి( దుదకు
న్వనటకు(బాలయ్యెను భ
క్తి(గా కెవ్వండునిన్ను( దేనేర్చు శివా! 35

కం. పొటప్రేలనొక్క గిరిక్రిం
దట(బడి యీ(పిరికి(దక్కి దయనీయత( జ
చ్చుటకగ్గమగుడు నీవం
తట మచ్చితి (బుతులనుతికి( దనిసి మహేశా? 36

ఉ. కోరినకోర్కి మంచిదవి కూరిమి నీకుజవించెనేవి దే
వేరియు నీవు పుత్రులను భృంగిరిటిప్రభృతు ల్మదీయముల్
గౌరవపూజ లందుటకు(గా( జనుదెమ్మనువా(డ నీగిరిన్
జేరవ మత్పురంబునకు( జేతులచే విడుశక్తి గల్గియున్. 37

కం. ఇరువదిచేతుల నొక్కే
గిరిబెకికిన వేయిగల్గు కృతిజాల(దె! ము
ప్పురముపలన దేవరకుజ
గరుణచెడి యెదేవిముప్పు గలుగునవిచుమీ? 38

కం. మొలకులచరితము లెఱుగుదు(
గలకంఠా! భక్తినిన్ను( గదలింపంగా(

దయచుగామందు సద్భక్తుల కంధరం
బులమన్న లింగకాయల వసింతు

తే. గీ. వణువుకన్నను నణువగునట్టి నీకు
విలుకనెడి శంకలే దెవ్వరేని పెద్ద
గుడిని గట్టింప నయ్యెడఁగూడ నుందు
వెంత పెద్దైన నదినీకు విలుకె యీశ? 45

శా. నీకున్ భక్తు లనేకులందు రెవరేని న్నాకు దీటౌదురే?
శ్రీకాంతప్రభృతుల్ మదిన్ దలఁచుచున్ శ్రేయంబులన్ గొంద్రుగా
కేకాలమ్మును గాపురంబెచట నీవేనాఁడు గావింపమిన్
నాకే యేరికిలేని గౌరవము సందర్శించుటన్ ధన్యుఁడన్. 46

కం. నీకు హరి మిత్రుఁడనుచున్
వాకొందురుగాని నాకు వచ్చినయశమా
శ్రీకాంతునకు న్వచ్చెనె?
యేకోపిమలేని నన్నె యెంత్రాప్తునగా. 47

మ. అతఁడు విశ్మిత్రుఁడె యామగారి భవదౌదార్యంబు సర్వత్ర మి
త్రతపాటించు సువారిపిత్తల కనంతాచక్ర మెల్లన్ స్వసం
స్మృతిలోఁజేరెడి దేవదేవ? చెపుమ శ్రీదుండు తాదృక్షుఁడే
వితగా నాయశముల్ గలంపనగునే? విశ్వేశ! తప్పుండెనే? 48

తే. గీ. ఏమిలోపమ్ము నేఁగాని యింతిగాని
సుతుఁడుగాని పొనర్చినచో క్షమింప
వలయు శిక్షింపవలయు నీవలమవిడిచి
యెచటికో ప్రయాణ మయ్యెదవే? మహేశ? 49

తే. గీ. ఈ వనాదరించి చనెదవేని నాకు
నీవొసంగిన యీ నవనిధులవేల?

వానిఁగూడఁ గైకొనుము వెంబడివివచ్చు
నేనువచ్చెద నీవెంట విచటనుండ. 50

కం. ఉత్తరదిశాధిపత్యము
నెత్తివిగల దద్దియిత్తు నీ యానతి యా
పత్తు భరించెడిఁ దనయుఁడు
వత్తున్నీవెంట నేను బదపోద మిఁకన్. 51

తే. గీ ఎంతశాశ్వత మీదేహ మీవిధాన
ములను నావంటిదిక్పతుల్ మునుపుచనిన
వారలెందఱో ? రాఁగలవారలెంద
ఱో ? భవత్సేవ విడనాడి యుండఁగలనె ? 52

తే. గీ ఎచటికేని యేగుమువుగా కేడినీదు
వాస మనినఁ గైలాసమువాస మనెడి
ప్రవిసు లింగంబురామి నా ప్రార్థనంబు
న్యాయ్యమగునేని నా కభయంబు నిమ్ము. 53

వ. ఇట్లు పలువిధములఁ బ్రార్థించు నిజభక్తునకు శాంతరంగిరమిత్రునకు భక్తపరాధీనుండు శంకరుం డిట్లనియె. 54

చ. కలరిల భక్తులెందఱో ? అఖండతపమ్ము లొనర్చినట్టి దై
త్యులు మఱివారు సర్వులు నెవో, వరముల్ వరియించి మీఁదమా
మ్యల సురలకా సురాంగనల నూరక వారక పీడపెట్టు త్రో
వలఁజనువారు బాణువిప్రవర్తన మట్టిదిగామి తెల్లమే. 55

తే. గీ. నీఁడు భక్తాగ్రసరుఁ డతినీరుఁ డయ్యు
బథముదప్పి చరింపఁడు వరమొసంగఁ
దలఁచి నేనేగఁ దక్కినదైత్యులట్ల
కోరక నమన్వరించె భక్తుఁడగుటతన.  56

వ. మాఱుపల్కుటకు వీలుగాక యంగీకరించితినే కాని వేఱుకాదని
వెండియు. 57

తే. గీ. నే నెచటనున్న నీవాఁడ నీవుఁ గూడ
నెచటనున్న నావాఁడవ హృదయసంగ
మం బొకండె సుసంగమ మంగసంగ
మంబు ప్రాజ్ఞుల కంత ముఖ్యంబు గాదు. 58

వ. పదునాల్గులోకంబులను నేను లేనిచోటు లేదు. అష్టమూర్తినగు నాకు వెలియగు పదార్థంబు లేదు. ఇట్టినన్నుఁ గైలాసవాసినిగాఁ బౌరాణికులు పేర్కొనుటకూడ స్థూలదృష్టి ననయో? స్థూలారుంధతీన్యాయంబున ననియో? యెఱుంగుము. నన్ను నీవెప్పుడును లింగమునఁ బూజింపుము. ఇతరత్ర పూజించుటకన్న నాకు నక్కడిపూజ ప్రేమపాత్రంబు. మఱియు నింకొక్క రహస్యంబు. 59

తే. గీ. ప్రతిమ స్వల్పబుద్ధులకను పక్కెఱుఁగు
దో యెఱుంగవా! కరచరణోరుముఖ్య
ము లవయవములు నాకేల? మూఢజనుల
కొఱకుఁ గల్పింపఁబడె నవి యెఱుఁగుమిపుడు. 60

తే. గీ. సర్వతశ్చక్షుఁడను నేను సర్వతోము
ఖుఁడ సర్వతఃపాదుఁడఁ గొందొకండు
నన్నుఁ గనలేఁడు నేఁ గందు నఖిల మొక్క
చోటనుండియె నాకొండు చోటులేదు. 61

తే. గీ. కన్నుగాంచుట చెవివింట ఘ్రాణరంధ్ర
ములకు వాసనదెలియుట మొనసి వాని
యందు నేనున్నయప్పుడే యనుభవించు
లేనిచో నట్టింద్రియమ్ములే నఖండ! 62

తే. గీ. యుద్ధమున కెవ్వఁడేతెంచు మగ్రుఁడతని
ద్వారమునఁ గాపురమ్మున్న కారణమున
గుండెబేజారుగాదె ? పుత్రుండు తార
కాసురువధించె ననుమాట నరులెఱుఁగరె ? 69

తే. గీ. యుద్ధములెలేవు సురలును నురగు లసురు
లెల్లవారలు నరిగాపు లెదురులేదు
చక్కఁగా సాఁగుచుండె రాజ్యమ్ము ప్రజల
కెట్టికష్టమ్ములును లేక యెసక మెసఁగె. 70

తే గీ. కాని బాణున కొకచింతగలిగి కలఁచఁ
బొడఁగె నాకున్నయదిగదా ? దోస్సహస్ర
మేం ! యిదికాల్పనే ! నాకపాలుఁడాది
నన్నెదురుకోరు బాహు లందిమునకొక్క ? 71

కం. అందమునకేవి రెండే
యందముగలిగించు విన్ని యందమిది వెదో
చందపుఁబరువున కంప్రముల
పొందిక నపహాస్య మనుమఁ బొగులుమనొకటన్. 72

కం. పరమేశ్వరుఁగన్గొని పొం
పిరివో మెది భక్తిమెుక్కి వినయము నయమున్
గరముంబెనఁగొన వేయుం
గరములు జోడించి కొంకుగదురఁగఁ బలికెన్. 73

తే. గీ. మఱ్ఱిచెట్టున కూడలమాడ్కి నాకు
వేయిచేతు లమర్చె నావేల్పుఁబెద్ద
ఆలమొనరింప నీచేతులం మెఱిఁగి
యెవఁడురా గుండెలుండు నో యీశ్వరేశ ? 74

ఆ. వె. కాముకునకు రేయి కన్నులమొగుడవు
నాకు రేయిపవలు నాస్తినిద్ర
యెట్లు చక్కఁబడునొ । యీ దాహకందూతి
మందుగలదె ? దీనిమాన్ప నెందు. 75

తే. గీ. ఐదు పదివేయుచేతప్ప నమరు లసుర
లెవరు కోర్తల నాకీయ రేనుబెద్ద
కూరుఁదనటంచు నవ్వారికోరికేగ
ప్రతిముచెముఁగాని దక్కఁదుఫలము సుంత. 76

కం. ప్రతియోధులు లేకుంటకుఁ
గత మస్మద్బాహుబలమె కాదు ఘటిల్లన్
పతి ? నీయందయుఁ గొండొక
కతమే సంశయముతీదు గతిగలదె ? యిఁకన్. 77

కం. నీకతన గలుగుపీడను
నీకువినా తీర్పనెవఁడు ? నీవ యెరవరేకా
నాకుసహాయము లేదు ని
నాకిఛరా ? భక్తిప్రార్థనము చేకొనవే ? 78

వ. ఇట్లొరలెడుంగాశివ మ్మనుగతిని గమలు పొరలుగప్పి తరతమ
జ్ఞానంబు నుడిఁగి "గురువవై దేవుడై" యనుతెఱంగునఁ గోరు
భక్తుని మదాతిరేకమ్ము సేవగించికొనియు వానితోఁబోరి గరాసుం
జేయుటకు భక్తపరాధీనునకు నించుకయు రుచింపక వాని నప్పటి
కెట్లో సమాధానపఱుపవలయుంగాన—"మూర్ఖం ఛందానువర్తేన"
యనుటంజేసి యిట్లు సంతసపెట్టె. 79

మ. హరియంశమ్మున యాదవాన్వయమునం దావిర్భవంబందె నీ
కెఱుఁగరాదొకో కృష్ణవిక్రమ ? మతం డేహేతువోకల్గి సం

గరమునీన్నికిదు నన్నుఁగూడ నవి నక్కంజాతుఁ దోడించెడిగా
వర మేనిచ్చితినట్టి దొక్కపుడు త్వద్వాంఛానుకూలమ్ముగన్. 80

వ. అతండు తనకుఁదానయై నీమీఁది కెందులకుఁ వచ్చునో యిప్పుడు చెప్పవలనుగాదు. దేవరహస్యంబు కొలఁదికాలమ్మలో సర్వమ్మను ఫలించు నెంతోవ్యవధి ప్రతీక్షింప నక్కఱలేదు పొమ్మనుటయు నతండు సంతసించి చని. 81

ఉ. ఎప్పుడువచ్చుఁగృష్ణుఁడు మదీప్సిత మెన్నఁడుదీరు నెత్తురుల్
చిప్పిల బాహులంట బెనచి శ్రీధరునంశముఁ గృష్ణుఁజంపి యా
మెప్పును కూలిమెచ్చఁగ నమేయయశంబునఁ బొల్చుటెప్పుడో?
యిప్పగిదిన్ బ్రతీక్షణము నెంతయనేహస మేనుజేతునో? 82

వ. బాణుండు వివేకియయ్యు యుక్తాయుక్తవిచక్షణుండయ్యుఁ బరమ భక్తాగ్రేసరుండయ్యు భావియోగవశంబునఁ గండకావరస్ఫూర్తిశయించి యిట్లు పరితపించుచు. 83

తే. గీ. కృష్ణుఁదేతెంచు నాపైకి జిష్ణుఁడగుచు
నవియె విష్ణ్వంశమే యతఁడగుచుగాక
గొల్ల యిప్పుడతండు నాకు భయపడెడిఁ
గాని తానయి యనికేల? కదఁగివచ్చు? 84

వ. కంస, జరాసంధ, శిశుపాలాదుల నతండు వధించినను నేదో కపటో పాయమ్మునను కాని ధర్మయుద్ధంబునం గామి తెల్లంబు. అట్లుగాక విజంబగు శౌర్యంబును విక్రమంబును గలవాఁడయేని యింతకుమున్న రావలసియుండె శూరుండగువాఁడు వేఱొకశూరుని పరాక్రమఖ్యాతి విని యాలసింపఁజాలఁడు. కావునఁ బరాక్రమపరిశీలనంబునకు వచ్చు నమాట పొసంగదు. అని వెండియు. 85

మ. అగుచో నెందుకువచ్చుఁగృష్ణుఁడు తనంతై తాను పాడిచ్చివున్
భగవంతుం దనుఁగూడగెల్చునట యావాక్యంబెటుల్ నమ్మఁగా

వగు( దామున్డినయుద్ధము౦ దశ(దకాదా । వైరుల౦జ౦పి పే
రుగడి౦చె౦ దన కల్ప్రకీర్తికిని రుద్రు న్నే(డెటుల్ గెల్చునో । 86

కం. వరముచ్చితినవియే మమా
వరు( దటులీవలయుటేమొ । వసుదేవసుతుం
దటియిచ్చి(దపించి సంతతి(
దరుణులకందఱకు( గోర దయనిదె శివు(డుగా. 87

తే. గీ. చాల(గాలమ్మునా(డె తా( బ్రక్రమదిగి
పుచ్చికొనె దానికై కంట(బూ౦చెన౦గ్రు
తన్ను(గూడ జయించెడి నన్నవరము
నెపముహరు(డిచ్చె । శ్రీకృష్ణు( డెపుడుగోరియె । 88

కం. అడిగిన హరు(డప్పుడు చె
ప్పెడివా(డే తెలుపుమిప్ప । విపులముగా నం
చదుగక పోతిం దినుచో
వడుగంగానేల రుచుల నన్నియు( దెలియు(గా. 89

తే. గీ. హరుని వరకారణమ్మున యాదవుండు
సంగరమ్మున పిర్జింప(జాలు(గాక
ఏను వరమీయలేమిగా । కృష్ణునకు న
తండు నను నాలమందెట్లు తా(కి బ్రదుకు । 90

కం. వరమద్దెడి(గాక శివ
జ్వరపు(బ్రతాపంబు నాదుబహుబాహువిపి
ర్పరదాపగళదురుశర
స్ఫురణాపరిణాహవహ్ని పొరి(గొనదె హరి(గా । 91

తే. గీ. యాదవులెవిప్ప డెందుకు । శూరవరుల
కుట్టి వాగ్వ్యయమది కీర్తిపట్టుగాదు

శంభుఁడే మెచ్చుఁగాక నాసంగరంపుఁ
జాకచక్యమ్ముగని యేల ? జాల మింక. 92

తే. గీ. హరునిచేఁ గెల్పుగొనెనను నప్రతిష్ఠ
నాకునేటికి ? నటులేని నాదువేయి
బాహులేటికిఁ గాల్పనే ? బవరమేగు
దేఱినప్పుడు మచ్ఛక్తి తెలియఁబడుత. 93

తే. గీ. "కాలివితోఁ దలయేటికి గోఁకికొనఁగ
వలసివచ్చెనొ ? యావదవల్లభునకు
గోచరింపదు హరునకు గోచరింప
కున్ననాడువునె ? యేదియో । యుండుఁగతము. 94

కం. నను గెల్చినపిమ్మటఁగద ?
తిమగెల్చు నతండహో "ప్రథమకబళే" య
న్ననుడివి జ్ఞప్తికిఁ దేకుం
డిన నే బాణుండనగుదునే । యనిరానీ ? 95

చ. అసురి యిటుల్ మనంబు ప్రియురాలి సమాగమమట్లు సంగర
వ్యసనపరాయణంబగుచు నాఱనికోర్కుల కాటపట్టుగా
వెసలకుఁ జారులంబనిచి దేశపువార్తలు వించు సారె మా
ససమునఁ గృష్ణువిక్రమచణత్వము నెంచి తృణీకరించుచున్. 96

వ. గడియయొక్కటి యుగంబుగా నతండు కాలంబు గడుపుచు నర్వదా
కృష్ణుఁడు తవంతఁదానై వచ్చుటకుంగల నిమిత్తంబునారయుచుండెం
గాని యది యంతిపురంబునకు నంబంధించినదగుటంజేసి స్ఫురింప
నవకాశంబులేమి నతీంద్రియజ్ఞానవిధ్యైకగోచరంబగుకతన వానికి
స్ఫురింపదయ్యె నంతఁ గొండొకకాలమ్మునకు. 97

కం. ఉషయనెడి బాణుకూఁతున
కుషస్స్వమయమునకుఁ బూర్వ మొకకలవచ్చెన్

యుష కేతువువకు వతి త
న్మిషమున వశమయ్యెఁ దెలిపె మేల్ చెలి కదియున్. 98

వ. ఆ స్వప్నసమాచారం బెట్టిదనిన నెవరో యొకయువకుండు లోకోత్త రంబులగు వందచందమ్ములు గలవాడు తనసిగ్గు కొల్లగొట్టి తన్నుం గలసి యేమేమో హాయిలు చూపించు సమయమ్మున మెలఁకువ వచ్చెనఁట. 99

చ. అదిమొదలవ్వధూతిలక మగ్గలపు మ్మనుప్రాయపు న్మహా
మదమున నున్నదౌకతన మాలిమిహెచ్చి దళాంగజాతిము
ర్గదములలోన నెన్నిది పగల్వలుకుం జమునంత దానినె
మ్మదిఁగల గుట్టుగన్గానియె మానివి నెచ్చెలి చిత్రరేఖయుఁ౯. 100

వ. చిత్రలేఖనమ్మునం దసమానప్రజ్ఞగల యా చిత్రరేఖ తాఁ నెచ్చెలి యుషాకన్యకకు వగపందవిలేదనియు నొక్కఁడా లోకమ్మున మాత్ర మకాదు నీమనస్సు పొంగిలినపొంగ యేలోకమ్మున మందినను దెచ్చి నీయంఘ్రులందబడి క్షమాపణంబు చెప్పవావిఁగా నొనర్తు నా దాకచక్యంబు చూడుమని భూర్భువస్స్వర్లోకంబులంగల యందగాండ్ర నెల్లర గదియ కొక్కొక్కరివంతునఁ జిత్రించి చూపంబొదంగిన నాదాణతనూజాత తనస్వాప్నికప్రాణనాధుం డందెవ్వండుమ గాఁదవి విషేధించి యూసడించుచుండె విట్లు కొన్నిదినమ్ములు గడచినపిమ్మట యాదవయువతులను జిత్రించి చూపమొదలిడుటయు. 101

తే. గీ. "నేతినేతితి" వాక్యమ్ము నిఖిలవస్తు
సముదయమ్మును గాదని సత్పదార్థ
మెట్లువిశ్వయించెనో ; అటులే యుషయును
గృష్ణునుమని నసిరుద్ధుఁ గేలఁజూపె. 102

వ. అట్లు చూపుటయు నా జగవీలిపిసాళిజంత. 103

చ. అగుఁగద ! నీఁడు నీహృదయ మాఱడిపుచ్చినవాఁడు సంధియ
మ్ము గలిగెనేని యిప్డె పువుఁబోఁడి ! వచింపుము తెచ్చుమీఁద అ
వ్వగలఁగు నీఁడుగాఁదవిన బాగుగఁజూచి వచింపు నేఁటిరే
యగుఁజుమి ! పెండ్లి నీ కతిరహస్యము నేఁ బొనరింతు సర్వమున్.

తే. గీ. మన్మధుని కొడుకీతఁడు మదవతులకు
జవ్వనమ్మున మదనుండె కానకుండు
వానికామరుని గోరినదానవీవు
చేయకుండునె ! సాయ మా శ్రీయుతుండు. 105

ఆ. వె. వానిఁదెచ్చి నీదు ప్రక్కలోఁబన్నుండఁ
బెట్టుదానఁ బిదపఁజెట్టలెట్టి
వచ్చెనేని సకల మానీటుకాని పి
తామహుండు గలఁడు తండ్రిగలఁడు. 106

కం. ప్రాణమ్మునేనియును నీ
కై నేనిడిచెదను నాకునై చూడకు నీ
దాన విసున్ సుఱపెట్టుచె
నానేర్పునకుఁగా ఫలంబు నారీమణికో ! 107

వ. నేఁటిరాత్రి నగరుఁబెండ్లి చేయింపుచుందువా ! యని సారెసారెకు
నూరించు నన్నారీతిలకమ్మునకు నిది సంఘటించుట దుర్ఘటంబని
యును చిత్రలేఖవమ్మునకును బ్రత్యక్షీకరణమ్మునకును జాల నంతరం
బుండు నవియు నెంచి యుష చెలికత్తె కిట్లను. 108

ఉ. ఈ విట వానిఁదేగలిగెదేనియుఁ బిమ్మటవచ్చు చిక్కులన్
దేవి వరాంబ మంచు రవిదీధితియున్ బలెఁ బాఱఁద్రోయ నే
భావమునందు నిచ్చలు సభాజనముం బొనరింతు నాయమా
నీవు నెఱింగినట్టిదియె నెచ్చెలి ! నాదగుభక్తి నాపైపై. 109

కం. పరమపవిత్రంబగు నా
చరితం బాయమకువచ్చి పాయము జేయం
దొంకొనిన నొందు మఱి యం
తరాయ మిప్పట్లఁగూర్ప దగు మెవ్వరికో ! 110

వ. మున్ను సావిత్రి తనమనంబున వరించిన వరునిం దక్క నన్యుని వరించుట పాతివ్రత్యలక్షణంబు గాదని యెంచి రాఁబోవు విధుమ లగణింపక సత్యవంతునే పెండ్లియాడి తుదకు జముని మెచ్చునకుం గూడఁ బాత్రంబై పుట్టినింటికిని మెట్టినయింటికిని మాన్యత చేకూర్చె ననుట నీవెఱుంగనిది కాదు అట్లే పరమేశ్వరీకరుణచే నా వివాహం బును నుభయతారకం బగునని నాకు దృఢమైన విశ్వాసము. 111

ఉ. వ్రాయుట చేఁతనొకతన వ్రాసితి వాయనదూష నీకెటుల్
రోయక వక్కఁదై చెలియరో ! యిటకున్ జనుదెంచు ? పచ్చుఁబో ?
ఆయన మన్మథాత్మరూపఁ దందమునాయది నచ్చునే ! యెటుల్
పేయుదు పెండ్లి దీనఁగలచిక్కులకే మెటులో తొలంగెడిన్. 112

చ. అనలు విజంబుగాఁ బరిణయం బగుచోఁ బితయూరకుండ కా
కుసుమశరాత్మజన్మనెదఁ గ్రోధముఁ బెంచి వధింపనెంచుచో
మనలునె ! తాతకృష్ణుఁ దనమామఁ దతండు పురారి శౌరియుఁగా
దొసఁగిటలేమి సంధిలెడి శ్రోవకుఁ దెచ్చి యదంతురాలముఁగా. 113

వ. ఈ యూహలన్నియు నాకాశసౌధనిర్మాణంబులు నా కాకలలోని యెమ్మెకాని పందర్శనంబు చిత్తరువు నందేని చేకూర్చిన నీ మేలు జన్మజన్మములకు మఱవరానిది నన్ను సంతోషపెట్టుటకై యాయ నపు నిటకుం దెత్తు నంటివి. శేలేకున్నను దెచ్చినంత పలుకేని బలికితివి చాలునని యెంచియు. 114

కం. కలికిరో ! మాయ లెఱింగిన
కలికి నమచు విన్నెఱిఁగియుఁ గార్యమువట్లఁగా

దలంపున సందేహించెదఁ
గల విజమవిపించు మాయగలదే ? యెందున్. 115

వ. ఇట్లు విరాళాసూచకంబుగ నొదువు నుషాకన్యకకు విదె యేనుజని వీమనోవల్లభుని నీ వికటమ్మునకుఁ దెచ్చినప్పు దేమనియెదవో ? చూచెదంగాక యనిచెప్పి యమ్మాయావివి గగనమార్గమ్మున నెగసి చనునంతకు విశీదంబయ్యె. 116

కం. తన భార్యతోడఁ గేళస
దనమున విద్రించు నమ్మదనసుతు మాయా
వివి చిత్రరేఖ యెట్లో
దనుజేశ్వరు కొమిరెపందు తల్పముఁ జేర్చెన్. 117

ఆ. వె. అచట మేలుకాంచి యాత్మాంగనయుఁగాద
యాత్మగృహముగా దటంచు వింత
గదుర దిక్కులరయఁ గామిని చెలికత్తె
చిత్రరేఖ గతముచెప్పె నెలమి. 118

ఉ. మా చెలియాజ్ఞ యొకతన మాయమెయి న్నినుఁగొంచు వచ్చితి
న్నీ చనవీపె గోరెడి మనీషిహితంబగు విట్టిపెండ్లికి
నోప్నఁచితి రిద్వరు న్మను మనోభవు పుత్రుని నిన్నుఁగోరరే ?
యేచెలు లెంతిమంది తమికేనియు నీదగురూపు పాత్రమా. 119

ఆ. వె. నీవుతగుదు వీమెనీకు నుదగు ధాత
యెన్నినాళ్ళ కిట్టిసృష్టి చేసెఁ
గోటికొకటి యిట్టి కూటముందునొ ? లేదొ ?
నందియుంబటంచు నందు నేను. 120

వ. ఇట్లు చిత్రరేఖ తత్కాలోచితంబుగ మాటలాడునప్పు డనిరుద్ధ కుమారుండు. 121

ఉ. ఎంతటి మాయలాడి యటి! యీ దనుజాంగన మద్గృహమ్మునం
గాంతయు నేను సెజ్జపయి గాఢపు నిద్దురలోన నుండ మ
ర్యాంతమునాపి నన్నుఁ గనుగొందని పోదిమి దేఁగఁజాలె నీ
యంతికి నద్దమంబొకటి మేథునమ్మునవేని గల్గునే? 122

కం. నేనిచ్చట విక్రమునిని
తో నుండుంగాక నాదు తొయ్యలి పితరుల్
నా నిజమెఱిఁగియ కెంతగ
మానసమునఁ గుందువారొ? మదినెటులైఁ దుఁగా? 123

తే. గీ. ఏకపత్నీవ్రతుండఁ గా విధియునొక్క
పెండ్లి మేదోషమునులేదు పెద్దలెఱిఁగి
చేయునది కావిరతమునఁ జెట్ట దీని
కతనఁ గలుగదె? యది తప్పు గాకయున్నె? 124

ఆ. వె. మాయపన్ని యటకు మావివి నమఁదెచ్చె
నంతవఱకు దోషినవరుగాక
అంతిపురముకన్నె నలరించుచును విటఁ
గాపురంబుసేఁత గాదె? తప్పు. 125

ఉ. కోరిన దండకత్తెయగుఁ గొండొకదోసములేదు కన్నె సం
సారుల తప్పువట్ట రిటుసాధ్వులకోరి వరించి మీఁద సం
సారుల మెప్పుగాంచిరని సమ్మతిఁజూపినఁ దండ్రి రక్కసుం
డోరిమిచూపునే? కొమిరె నొండొకచూపునఁ జూడకుండునే. 126

కం. నమవిట బంధించకపో
వునె? యాయుధమైనఁ గలదె? పోరాటకు మం
తనమిది దాఁగునె? జారత
యును జోరత దాఁగ వెట్టురో పయికుఱుకున్. 127

వ. అని కొంపొకసేపు తనలోఁ దా నుపాయాపాయచింతనమ్ముతోఁ బూర్వపక్షసిద్ధాంతమ్ము లొనర్చికొనుచు నేమియుందోఁపక స్తబ్ధుండై యనిరుద్ధుండు నిరుద్ధుండగు హార్యక్షుండువెయిది నను౩రించుట నెఱింగి చిత్రలేఖ యాతని నిట్లు సాంత్వనోక్తుల ననునయించె. 128

చ. ఇది పరిగేహమంచు నద రేయదియో ఘటియించునంచు నె మ్మదిజనియించు సందియము మానుము దీనికి నేనుబూఁట మా మదవతి నీపు నియ్యెడ సుమాళమునం జరియింపవచ్చు నీ సదనము పోతుటీఁగసొం సాధ్యముగామి నిజమ్ముచెప్పితిన్. 129

వ. ఇందరి యంతఃపురపరిచారికలకెల్ల నే నధినేత్రిని నాకు వ్యతిరేకించి యెవ్వతెయు వర్తించి బ్రమకనేందు నా శక్తి నార్యపుత్రుం డెఱింగియే యుండుటంజేసి మరలఁ బ్రశంసించుట చర్వితచర్వణంబు. వలయు నెడల నేను నిన్నికన్నడి కెట్లు రెండవకంటివానికిఁ దెలియకుండఁ దెచ్చితినో అట్ల నీక్రీడాగృహమ్ము చేర్పఁగలనని నేఁ జెప్పకమున్న నీకుం బొదకట్టవలసినదిగాని కొత్తయౌకతన నియ్యదియంతయు నయోమయంబుగా నుండుటంజేసి యట్లు పొదకట్టక పోవచ్చును. ఇది నీసదనంబ ఈపె నీయర్ధాంగి నేను నీపరిచారికను. ఆయీ మదులయం దణుమాత్రమును ననత్యంబులేదని వెండియు. 130

కం. చెలి నీకు రుచింపనిచో
బలవంతమువలన దితరభియము లవము నీ
తలఁపునఁ జేర్పకుమని య
చ్చెలి తలుపుబిగించి చనియెఁ జెచ్చెరఁబిదపన్. 131

వ. అనిరుద్ధుం డన్యథాకరించుటకన్ననద్దానికి లోఁగియుండుటయె శాస్త్రానికశ్రేయంబున కుపాయంబని తలఁచి నిస్పంకోచమ్ముగ వచ్చిలుకల కొల్కితో యథేష్టంబుగ మండి. 132

కం. తనసతిని మఱచె జననీ
జనకులఁ దనయూరు తనదుసఖులన్ మఱచెన్
వనజాక్షి యుషాకన్యక
తన కందఱకన్న ముఖ్యదైవత మయ్యెన్. 133

శా. ఏ సంబంధములేని ప్రాణులకె సూనేమందు లేఁబ్రాయపుం
బోసంబుంగనిపెట్టి ప్రేమమయముగాఁ బోషించి లోకమ్ము త
ద్దాసత్వమ్మును సంఘటించు వింతఁ దద్దాయాదువింగూర్చి యా
వాసిం దక్కువఁజేయునే? సుఖకుఁ దద్వాసంబునం దక్కువే? 134

వ. చిత్రరేఖ తనకుఁ దనవారిపై మనంబుపోయినప్పుడు తన్ను ద్వారకం జేర్చెదనని యభయహస్తం బిచ్చినను నతనికి మనంబున నట్టి కోరికయే పుట్టమిం జేసి యుషాకన్యకాలీలామయశృంఖలాబంధస్థుఁడు తన యనిరుద్ధత్వమ్ము నపవదించి విరుద్ధత్వంబు గల్పింప నయ్యంతఃపురంబునంద యుండె. 135

మ. మదిరాక్షీపరిరంభముల్ మఱియు నమ్మావిన్యపాంగమ్ములున్
హృదయమ్ముల్ గరఁగించునేరికిని మత్తేభేంద్రకుంభస్తనుల్
గదియన్ దేహము గేహమున్ దెలియునే? కాంతాశిరోజమ్మునం
బదముల్ గట్టఁగవచ్చు నంకెలలకున్ బద్ధుండు గాఁదేనియున్. 136

వ. అచ్చట ద్వారకయం దనిరుద్ధుఁ డేమైనదియుఁ దెలియక భార్యయును దలిదండ్రులును దక్కుంగల బంధువర్గంబును బరిపరివిధంబుల విచారించుచుండిరి. శ్రీకృష్ణుండు సర్వజ్ఞుండయ్యు మానుష భావమ్మునంజేసి యది యపహృతంబై యితరులతోపాటుగవారందు చనినవిధం బెఱుఁగఁజాలక యనేకగతుల విచారింపఁబడినవాఁ డయ్యె నట్టితఱి త్రిలోకసంచారియు నతీంద్రియజ్ఞానవిధియు నగు కలహభోజనుండు తనకు ననుకూలించు కలహమ్మునకుఁ జక్కని

ఓజంబు పక్షిప్రవరంబైనదియని సంతసించుచు ద్వారకకుంజని యనిరుద్ధుండు బాణాసురుని కిల్లటపట్టల్లుండై యతఁడెఱుంగకుండ నంతిపురమ్మునందు నిరుద్ధుండై యున్నవాఁడని నొడువుటయు శ్రీకృష్ణభగవానుండు పరస్పరవిరుద్ధార్థకంబగు మునివాక్యంబు తన మనమున సేమంబు తెల్పుటకు సంతసించి కల యథార్థంబు క్రమముగా నాయనకతనన యెఱింగి సాక్షాత్పరమేశ్వరునకుఁ బ్రాణతుల్యుండగు బాణునితోడి పోరు పరమేశ్వరుని గూడ రంగమ్మునకు రప్పించి యుమామహేశ్వరుని లీలాతాండవ పాండిత్యమ్మున సుప్రోషకంబు గాక లేదసియు నైనను నాకు నప్పరమేశ్వరుండిచ్చిన వరమ్మవిప్పట్ల నేను వినియోగపఱచికొని బాణుని శిక్షించి మనుమని సతీసమేతునిగాఁ దేఁగల్గుదునసియు నెంచి బలదేవ సాత్యకి ప్రభృతుల కెఱింగించి యుద్ధసన్నద్ధుండై యరిగె నట్లనగునపుడుగాని యిప్పుడుగాని యనిరుద్ధుని యుటకింకంబు బాణుండెఱుఁగకున్నను శ్రీకృష్ణుండెక్కటిమ్మునఁ దనపైకి నాలంబునకు రావలసివచ్చినదో యని యాశ్చర్యపడుటయు నా సర్వజ్ఞుండు. 137

ఉ. ఎందులకైననేమి ? యతఁడేదైతీ నీయుకెత్తివచ్చె గో
విందుఁడు రాక్షసాంతకుఁడు వేడ్క నీకు రణంబటన్న జో
దెందును గానరాఁడనుచుఁ బొచ్చెమొనర్చితి వీవు నన్ను గో
విందుఁడు రాఁగలాఁడనుట విస్మరియించితె జ్ఞప్తితెచ్చుకో. 138

తే. గీ. అతనియన్న బలుం డసహాయశూరుఁ
డిరువురిరువురె చెప్పఁగనేల ? మఱియుఁ
గలరు యాదవులెందఱో ; ఘనబలాఢ్యు
లింతకన్నఁ గావలసినదేది నీకు ? 139

చ. ఎవనికి నేదియుండదొ ; అదేకద ; కోరునువాఁడు నీకెవో
దవరము వాంఛనీయ మదిపండువుగాఁ దలపోతు వేలయా

జను విధిచోదితంబుగనొసంగి వివాహ మొనర్చనీకు గ
ర్భజయగుకూఁతు నింకెవఁడు పెండిలియాడు నొసంగనెంచినన్. 146

వ. సర్వంబును మాప్రభువునకు నేర్గదయగు పరమేశ్వరుండును మా
చెలికి నుపాస్యయగు పరమేశ్వరియును సమకూర్చెదరు. నీవు కొలఁ
దిసేపు శాంతుండవై యాలంబు దిలకింపుచుండుము నావుడు నెట్ట
కేల కిపిటుద్ధుండు మంత్రరుద్ధభుజంగంబు చందంబునఁ జిత్రరేఖా
వచనంబులచే నిరుద్ధుండై యంతఃపురంబునన యుండెఁ బదంపడి
యాదవదానవులకుఁ బరస్పరంబు సంకులంబగు యుద్ధంబు ప్రవ
ర్తింపుచిదప శ్రీకృష్ణుండు బాణుని సంహరించు పూనికగల్గియుం
డియు నందులకు భక్తపక్షపాతమ్మునంజేసి శంకరుం డడ్డుదగులు
నేమో యనితలఁచి యప్పరమేశ్వరుని పంచవిధమూర్తులలో
నొక్కండగు శ్రీకృష్ణభగవానుండు తన యభిప్రాయంబు నాంతరం
గికవ్యాపారమూలమ్మున నందఁజేయుటయుఁ బరమేశ్వరుండు. 147

తే. గీ. నీకొడుకు బాణునకును మన్నింపఁదగిన
పీఠికాఁ దట్టి మద్భక్తు నీఋసేఁత
నీకుఁదగదు ప్రాణంబు మన్నించివిల్చు
మతిశయించిన గరువమ్ము నతకరించి. 148

వ. ఒక్కండే మూర్తికి వివర్తంబులగు నా శివకేశవు లిట్లన్యోన్యాంత
రంగమ్ముల నన్యోన్యమ్ముమ నంతరంగమ్ముల ద్వారమ్మునన యందు
కొని యుద్ధం బొనర్చుచుండిరి-అంతశివుండు. 149

చ. భరమయి యుద్ధ మేద్రైబ శివజ్వర మస్త్రముఁబుచ్చె దానిన
త్వరముగనాఁగ శౌరి కడుదర్పమెలర్చెడి వైష్ణవజ్వరం
బురవడినంపె రెండునవి యుర్వియునాకస మంటి రాజి నం
గర మఖిలంబు మూర్ఛవడఁగా నొనరించి పరాక్రమింపుడుఁగా. 150

వ. ఇయ్యవి ప్రపంచనాశకంబు లగునని యరిష్టవారకుండగు శంభుండు
తన జ్వరమ్మును వైరము నుపసంహరించె ననంతరంబు బాణుని
బాహుకృంతనంబుదనకు మున్నుబంచి శ్రీకృష్ణుండు వైష్ణవజ్వరంబు
గూడ నుపసంహరించె బాహుకృంతనసమయమ్మునఁ బరమేశ్వ
రుండు శ్రీకృష్ణునాకారించి. 151

చ. ఇతఁడు మదీయభక్తుఁడగు నీతనిఁగాంతు విశాంతాంగి నీ
సుతుసుతుఁగా వరించె నలసుందరిఁ దివ్యపునుంట నాపెనుం
దతికరుణప్రమాత్మకత నావి వచింపటఁజేసి యచ్చితీ
వితనికి బంధుగైతి వికనేటికి మీరుమీరుఁ గయ్యముల్. 152

వ. ఇట్లు పరమేశ్వరుండు సౌహార్దమ్ముతో నానతిచ్చుటయు శ్రీకృష్ణ
భగవానుండు. 153

క. తనమిత్రుఁడు తనదైవము
తనకుఁ జక్రప్రదాత దైత్యుని భక్తుం
డని కనికరించి యసురా
సన మొనరుప రెండుబాహుశాఖలు విడిచెన్. 154

వ. బాణుండు పరమశైవభక్తాగ్రసరుం డగుటంజేసి శ్రీకృష్ణకృత
బాహుకృంతనంబునకుఁ గోపించుటకు మాఱు దుర్మదాపహారకం
బగుటకు సంతసించుచు వినయవినమితుండై. 155

ఉ. ఈవన దేవదేవుఁడ వహీనవిభూషణుమిత్ర ముల్లస
ద్భావుఁడ వెక్కటమ్మునను భండనముం దొనరింపవచ్చితో
దేవ! మహేశ్వరుం డెదియొదీన శుభంబొనఁగూడు నంచనెన్
నీ వరుదెంచకన్నను మనీషికి నొందొక భద్రముండునే?. 156

తే. గీ. నీవు చక్రాన మద్భుజానీక మెపుడు
కృంతన మొనర్పఁబూనితి కృష్ణ! యపుడె

సత్త్వ ముణుగుటకుబదులు సత్త్వమెచ్చె
రజసును దమంబు రెండు దూరముగ నరిగె. 157

క. పరమేశ్వరభక్తులకుఁ
గరి ప్రియుండ వనియు గళకంఠుఁడు త్వ
త్పరిచితభక్తులకున్ బ్రియ
తరుఁ డనియెఱిఁగియును నే మదమ్మున నిన్నున్. 158

చ. సమరమునం దెదిర్చితిని శౌర్యము చూపితి నొవ్వనారితిన్
నిముసములోన సర్వమును నీఱయిపోయెఁ దమంబు చక్రవి
క్రమమునఁ దత్సుదర్శనపు రశ్ముల నెన్నఁదరంబె నాకు జ్ఞా
నమిదు సుదర్శనప్రతిభ నన్నుఁ బొనర్చెను జ్ఞానిగా హరీ! 159

వ. నాకు నప్రయత్నంబుగ నీదర్శనంబు లభించుట మహాభాగ్యంబని సంతసింతుఁగాని యొక్క యపరాధమ్మునకు మిక్కిలిగా వగచుచుంటి. 160

చ. మృదువగు వెన్నవంటిది శరీరము నీయది యెష్ట కష్టమి
య్యది సహియింపనేరదు పదాబ్జసహస్రము లిందుకై సదా
మదిజపియింత్రు గోపికలు మాధవ! నిష్కరుణుండనైన నా
ప్రదరము లిందునాటి యపరాధమొనర్చె ననుగ్రహింపవే. 161

వ. ఇట్లు పరమభక్తాగ్రేసరుండగు బాణుండు శివునియందుంబోలెఁ దన యందును భక్తిప్రపత్తులు నెఱపుటకు శ్రీకృష్ణభగవానుండు సంతసించి యతని నభినందించుచు నిట్లనియె. 162

క. నీ విజ్ఞానము మిగులన్
భావుక మీశ్వరున కేను భక్తుఁడ సఖుఁడన్
నా వైరు లతని వైరులు
నీ వెఱఁగితి నీహస్యనియతిఁ బలెరే! 163

వ. విద్యామద ధనమద యౌవనమదంబు లనునవి సహజంబులు నీ వంటి శైవభక్తాగ్రగణ్యునే యవి గలంచినప్పు డిఁక సామాన్యప్రాకృతులనుగూర్చి వచింపనేల। అజ్ఞానావస్థయందొనర్చిన యేపాపంబు గాని జ్ఞానం బుదయించిన యుత్తరక్షణంబున నశించునని శ్రుతిస్మృతు లుద్ఘోషించెడి వట్లగుటంజేసి నీవు నాయెడల నట్టి జ్ఞానం బుదయించుటకు మున్నొనర్చిన యఘంబునకు వగవం బనిలేదు. అదియునుంగాక. 164

ఆ. ఏమియొనర్చితి వఘము నేనయి నీవయికెత్తిరాఁగ నా
పై మునుకుల్వి గుర్చు టదిపాపమె। శూరుఁ డెవండుగాని వి
న్నేమియుఁ దప్పవట్టఁడు మహేశ్వరభక్తులు తప్పొనర్తురే।
నా మనుమండు నీయెడ నొనర్చినవాఁ డొకత ప్పెఱుంగవో। 165

వ. అయ్యదిగూడ సహృదయభావంబున మనము సరిపెట్టుకొన్నచోఁ దప్పుగాదుగాని యట్లుగాక సంకుచితహృదయులమై పెనంగు నెడలఁ బెద్ద తప్పిదంబుగాఁ బరిణమించకపో దనివెండియు. 166

చ. హరు నయనాగ్నికీల భసితాకృతిఁ దాల్చిన మన్మథుండు శం
కరు కరుణాకటాక్షమున గావిధి యరిష్టమే
త్తెఱఁ జొరఁబాఱి శంబరుఁ డుదీర్ణబలుండు హరించె వాఁడు శం
బరుని వధించివచ్చె గృహమార్గమువట్టి యమంగుబ్బఁగన్ 167

వ. ఈ చరిత్రంబంతయు నీవింతకుమున్న వినియేయుందువు. వాఁడు ప్రద్యుమ్నుండు వాని తనూజుం డనిరుద్ధుండు. 168

మ. అనిరుద్ధుండు విరుద్ధుఁడయ్యె విను నీయంతఃపురిస్నీదుకూఁ
తు మనవ్వీడఁగలేక లేశమును నీదోషంబు లేదిందు నా
మనుమండే యపరాధి నీకొమిరె నంభావించి ప్రేమించుఁగా
కవయంబౌ వధ మేరుమెచ్చెదరు వాఁడందుండె గోప్యమ్ముగన్. 169

వ. వాఁడిలునీడి యెందేగె నేమయ్యె ననిమేమెల్లరమును గాలదినములు

నానావిధములఁ బరిశీలించియు జ్యోతిష్కుల నడిగియు విసివి వేసారితిమి
గాని సేమంబుగానున్నట్లు చెప్పువారేకాని యెక్కడ నున్నదియుఁ
జెప్పువారు లేరైరి అంత నారదుండరుదెంచి. 170

సీ. బాణుని కూఁతు స్వప్నమున నీ మనుమండు
దోఁచె వానిని నవ్వధువు వరించె
నా యుషాకన్యక యాంతరంగికదాసి
చిత్రలేఖ యశేషచిత్రములను
వ్రాయనేర్చినది యువకుల చిత్రములెల్ల
వ్రాసి స్వప్నమ్మున వచ్చువాని
నడిగిన నయ్యుష యనిరుద్ధుఁ జూపించెఁ
జూపించినంత నాసుదతి మాయ.

తే. గీ. కతన నిదురించువేళ నక్కలికికొలుకు
నీదు మనుమని బాణునంతిపురిఁ జేర్చె
నచట నెవ్వరు నెఱుఁగ కయ్యంబుజాక్షిఁ
గూడియున్నాఁడు నీకొడుకు కొడుకు కృష్ణ! 171

వ. ఇప్పటికి బాణునకుఁ దెలియకున్నను నిట్టిసంగతు లెన్నాళ్లు దాఁగె
దిని? తెలిసినచో నీమనుమం డెంతటికష్టం బందునయ్యో “ఎంటయింటి
పందేల”గదా? యనిబోధించుటయుఁ దప్పు మావారిసైనను గాకు
న్నను ప్రాద్యుమ్నునకు నా మనుమనిదిగాఁ దోఁచకమాన దనమెంచి
మనము కలిసికొనుట కింతకన్న సూచితంబగు మార్గం బగుపట్ట
మిఁ జేసి సింహవాధిపైన నీవయికి దండెత్తవలసివచ్చె ననునంతకు
శంకరుండును నటకేతెంచె నంతకుమున్న యాపద్విషయమ్మును
నాసర్వజ్ఞుం డెఱిఁగినదేయయ్యెఁ గృష్ణుండు పరమేశ్వరునకు విన్న
వించి. 172

తే. గీ. వేదములు ధర్మశాస్త్రముల్ వివిధములు పు
రాణములు వాగమమ్ములరాశి సర్వ

మతివ! నీయది కర్తవ్యమరసి నిశ్చ
యింపుమనివేడ శంకరుం డిట్టులనియె. 173

వ. మా బాణునికూఁతు రుషాకన్యక సావిత్రికన్నను మిన్న. స్వప్నము నందుఁ దన్నుఁ బ్రేమించిన వరుని వరించుటలో నేమితప్పున్నది? అనిరుద్ధుండు తనకుఁ దానయి యంతిపురి కిందులకై ప్రవేశించిన వాఁడు కాఁడు కావున నంతఃపురద్రోహి కాఁజాలఁడు దాసి చిత్ర లేఖదోష మిందున్నట్లు తోఁచినను బాగుగవిచారించినచో నామె రాజ్ఞికిఁ బ్రియంబొనర్చుట సేవాధర్మములలోనికిఁ జేరును; ఇంతకు నింతవఱ కేవిధమైన దోషమును నెవరియందును గనుపట్టదు. గాంధర్వము వివాహములలో నొక్కటి. ఉభయులపెద్దలును "ఏణసన్నాహం-బెదురుసన్నాహంబు"గా మార్చి వివాహం బొనర్చి యాచార నిర్వహణం బొనర్చుటయ కర్తవ్యంబనుటయు బాణునకు తదుత్తమ మార్గంబునకన్న నెంతపరిశీలించినను గొందొక్క మార్గంబు లేమిం జేసి సమ్మతించియుఁ గొందొకసేపు విప్రతిపత్తియుఁ బొడమినసుఖంబై మిన్నకుండుకతంబు శంకరుండు గ్రహించి యిట్లనె. 174

మ. అవమానం బిటనేది? యున్నయటులే వాపంత చింతింపనేం
టికి నన్నున్వరియించె హైమవతి తండ్రిం దల్లియుం జాల పై
బిపమొప్పంగ వివాహమున్సలిపి రేపాపంబు నీకూఁతు రిం
దవమానానకు హేతుభూతమును జేయం బూనె వాత్రుచెప్పదే? 175

క. దారిక పుట్టిననాఁడే
యేరికొ సొమ్మగుచుఁ బుట్టుఁ గృష్ణమనుమఁడె
వ్వారికిఁ గైకొనఁదగఁడే!
శ్రీరంజిల్లంగఁ బెండ్లిసేయుట లగ్గా. 176

తే. గీ. ఇతరు లెన్నివిధమ్ముల నెంత వెదకి
పెండ్లి చేసిన దంపతిప్రేమమిట్లు

కుదురదు స్వయంవరమ్మని గొంతదీవి
కనుమలొ చొక్కరిదెకదా? యందుఁ బ్రేమ. 177

వ. అందులకుఁగాదు నాకిందేదియో యవమానమ్ము స్ఫురించుచున్న దందువేని అందులకుఁ గొంకువాఁడు పుత్రికాజనకుండు కాఁగూడ దని యెఱుంగుము. అయినవాఁ డెంతటి యవమానమ్మునకేని సహింపవలసివచ్చు నియ్యెడ నట్టియవమానంబు లేశమును లేదు గదా? అని వెండియు. 178

ఉ. మామయిష్టుకన్నను బ్రమాదము వేఱొకఁడుండఁబోదు సు
త్రాముఁడెయౌనుగా కొకసుతం గనుహేతువుచేత మామయౌ
చో మశకమ్ముకన్నఁ గడుఁజుల్కనయౌఁ బరితాప మంతగా
దోమకునుండ దన్నియుమ దుఃఖములందెడి మామగార్లకున్ 179

ఉ. మామయిపుట్టుకన్నను బ్రమాదము వేఱొకఁడుండఁబో దదే
సోములమాను గొత్తియయి చూపఱునవ్వఁ జరింపఁడే? యికే
మామకు గౌరవంబొదవు? మంచిది యెంతటిదక్షులైన సు
త్రామునికన్న దక్షుఁడగు దక్షునితోఁ దులఁదూఁగ నేర్తురే. 180

ఉ. మామయిపుట్టుకన్న నవమానము వేఱొకఁడుండఁబోదు శ్రీ
ధాముఁడు విష్ణు వేను నలధాతయు మామలుగాకపోవు చే
పామరుపాదమో! గడుగుపాతక మబ్బునటంచు బంకియే
యీముగురున్ సుతాజనకు లిప్పటికేనియుఁ గాకమానుటల్. 181

వ. నీకు నప్రయత్నంబుగ నెన్నియోగ్యతలు జామాతలకుండవలయునో రూపవిత్తశ్రుతకులాదు లన్నియుంగల సంబంధంబు తటస్థించినది యీవివాహం బుభయతారకం బనుటకు సందియంబుకే దని వెండియు. 182

ఉ. దారిక తండ్రికిన్ హృదయదారిక యందురుగాక! యేదియో;
దారికతల్లి; అమ్మమయు దారిక; నాయనయమ్మపై తముఁగా

దారిక ; వంశమున్ బెనుచు దారిక లేక వెలుంగునే గృహ
ద్వారము ? స్వర్గమేగుటకు దారిక దారి కదా ? గృహస్థుకున్. 183

చ. అధముని కాఁగా నగుటకన్నను దాస్యము చాలమెచ్చనౌ
నధికునియింట నీకొమిరె యారసి యెంచి వరించియున్నద
త్యధికునిఁ గృష్ణునన్నఁడఁట ? యాదవుఁడంట ? బుధుల్ నుతించును
బ్రథితునిఁ బెండ్లియాడుటకు బాల పురాకృత మెంతమంచిదో ? 184

వ. ఇట్లు పరమేశ్వరుండు పలువిధంబుల నగ్గించుటయు బాణుండు కల్
కఁదేఱిన మనంబుతోఁ గూఁతుం బెండ్లికూఁతు గావింప నానతి
యొసంగి సక్రమమ్ముగా వివాహంబొనర్చి తన యైశ్వర్యమ్మునకుఁ
దగినపారిబర్హం బొసంగి యల్లునితోఁ గూఁతు నత్తింటికనిచె
నియ్యది యీశ్వరుని భక్తపరాధీనత్వము దెలుపు బాణాసురచరిత్రము
దీని శ్రవణమననాదులు సమస్తశ్రేయమ్ములు గలిగించు మఱియు
నర్మదయందు స్వయంవ్యక్తమ్ములగు లింగమ్ములను బాణపదంబుచే
వాడుటకుఁగతం బీ బాణున కట్టివరంబు పరమేశ్వరుండు ప్రసాదించు
టయే యని సూతుండు శౌనకాదులకుఁ దెల్పి ఫలశ్రుతి నివ్విధంబుగా
వక్కాణించి ముగించె. 185

ఉ. ఎవ్వఁడొసంగె దేహమిది ? యీఁగలరే తలిదండ్రు ? లింకఁ దా
నెవ్వఁడొసంగెఁ బ్రాణమిది? యీఁగలరే తలిదండ్రు ? లెంచఁ దా
నెవ్వఁడొసంగె జ్ఞానమది ? యీఁగలరే తలిదండ్రు ? లంచుఁ దా
నివ్వగఁ జింతసేయ శివుఁడెవ్వఁడొ ? గోచరమౌ గ్రమమ్ముగన్.

మెలకువ వచ్చినపిమ్మటఁ
గలలోఁగను వస్తువెదియుఁ గానబడమి వి
శ్కాలగాదుకలఁ భవమ్మును
గలయే యది పెద్దకలగ జ్ఞానికిఁ దెలియున్. 187

శా. ఆయుష్యంబు శతప్రమాణమగుఁగా కందెవ్వియో గండముల్
పాయంగావలెఁ బాసినిల్చినను సాపాలందు నీయఁగావలెన్
రే యన్పూతన, కున్నయేఁబదిట గౌరీనాథు నర్చించువా
రీ యుర్వింగనరారు పోవునెటులో హేయంబుగా నాయువుల్. 188

శా. బాలారిష్టము లెట్టులోఁ దచు పైఁ బ్రాయంబు బాలామణీ
హేలాకృష్టకురంగశాబకదశా హేయంబు ప్రాప్తించుటన్
కాలంబయ్యది వ్యర్థమైచుఁగు పైఁగాలంబు పోఁగాలమే
యేలా దేహితరించు? దేవుఁడిడుగా కెంతేని యాయుష్యమున్. 189

చ. ఇవికని పెట్టి దేహి తరించెడి యుత్నము సత్వా సదా
శివుని యజించుటాదియగు శిష్టసుకృత్యము లాచరించుచో
ధనమది సార్థకంబగుచుఁ బాశవినిష్కృతి ఘటించు నన్యథా
ధనముపయిన్ ధనంబునకు బారములేదని వేదమాడెడిన్. 190

సీ. అంఘ్రులయ్యవియె। శివాలయమ్మనకేగు
భాగ్యమెవ్వానికిఁ బట్టుపడునొ?
కరములయ్యవియె। శంకరుమ్రోలసల్పు జో
హారిద నేవి సహాయపడునొ?
కన్నులయ్యవియే। వియన్నదీజూటు లిం
గాత్మఁ జూచుట కేవియభిలషించు?
శ్రోత్రమ్ములవియె। త్రినేత్రులీలలు విన
సంతతం బేవి శ్రద్ధనువహించు?

తే. గీ. మనమనఁగ నద్దియే। సర్వమంగళాధి
నాథు నేది సతంబు మననమొనర్చు?
మానిసియు వాఁడె। శివు నేదు ధ్యానమున వ
శీకృతు నొనర్చు? సత్యంబు చెప్పినాఁడ. 191

"తన్మేమనశ్శివసంకల్పమస్తు।"

## ముఖ్య సవరణలు:

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 18 | 16 | నెఱుంగ | వెఱుంగ |
| 24 | 8 | పడవి | పదవి |
| 31 | 9 | నమ | నమ |
| 39 | 5 | పేరె | లేరె |
| 44 | 20 | గణంబు | గణంబు |
| 51 | 25 | జనము | జనదు |
| 54 | 22 | గొతముండు | అనవుడు గౌతముండు |
| 63 | 2 | మనంత | మనంతరంబు |
| 66 | 4 | దాయ | దాన |
| 71 | 20 | గ్రమ్మ | గ్రమ్మి |
| 80 | 21 | బీరమ్మ | బీరమ్ము |
| 81 | 23 | లెట | లెట్టి |
| 101 | 18 | యపీ | యలీ |
| 108 | 7 | ఎట్టు | ఎట్టి |
| 110 | 23 | గతాంసు | గతాసుం |
| 124 | 12 | గ్రొచుండు | గ్రొంచుండు |
| 128 | 20 | పపిగా | పసిగా |
| 134 | 23 | టిప్పణి | టిప్పణి |
| 151 | 14 | విదవవె | విదవలె |
| 152 | 21 | దక్కుం | దక్కుం |
| 187 | 22 | వలసి | వలపి |

82 పేజీ, 10-పంక్తిలోని—"యీూదవిబాదవి" అనుచోట

పాఠాంతరము—"యుక్కటి దాఁగిన" అని చదువుకోవలెను.

